# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




**ఫిబ్రవరి 1958**

సంపుటము 35 : : సంచిక 2

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1958

# నవసంధ్య

కొలకలూరి

కరుణ విశారరూపి, నలగన్నుల క్రాంతికి పోటు బుట్టె; ఆ
చరణ విహీనయే సమత, శాంతికి గుండెలు జారిపోయె; నం
శరణ సుదూర తీర్థధుని సత్యము, సద్గుణ, ధర్మదేవతా
నరశలు కృంగి పోయిరి ప్రశాంతదయాపరిపూర్ణజీవికై.

2

ఎందుకు, బీటువారి నలుపెక్కిన రోతల పీఠభూమిలో
ముందుకు సాగుచుంటి? మునుముందుకు వేగమె పోవలేక నే
నెందుకు కుందుచుంటి? హృదయోజ్జ్వల రక్తపరీక్ష గల్గి, ఏ
విందులు చేయనెంచి పలవించు తలంపుల చిక్కినాడనో?

ఏమిది నాకు కంట తడియేమి? విశార విషాద ఘోరతన్
తామర తంపరయ్యె హృదితాపము చూపెడి కంటినీరు, నా
కామిత దివ్యదీప్తికి నకాల ఫలాశ విభిన్నమయ్యె; ఆ
క్షేమ సుకూపి నాకనుల చేరదె? వీనుల విందు చేయదే?

నే నొక మానవుండ! తెగనీలిగి భావన చేయలేను; నా
జీనము కోసమై డబుకు మోదెడు చేష్టలు చేయలేను; ఏ
దానవ జాతికో బ్రదుకు ధర్మము చేసెడి దాతగాను; బా
ధానల తీవ్రదీప్తికి సితారు పరీక్షలు చేయ నెందుకో?

నేనొక మానవుండ! రమణీయ సువర్ణజగమ్ములో మదీ
యానన దర్శనాన మరియాదకు భంగము కల్గనీను; లో
లోన తపించిపోవు మది లోతుల దాకుదు; కోర్కెపారతో
వానకు గీనకుం దగిలి ప్రాతలు త్రవ్వుదు నెందుచేతనో?

హృదయము మండిపోవు నెడ, ఉన్నత భావవిపంచికల్ బదా
బదలగు వేళలందు; పరిపాలన చేయు పిశాచిహింస నం
పద తులదూగు నంత; పరిపక్వ ఫలమ్ములు చెల్లుచుండుటన్
గుదిగొను గుండెతో గుణనికుంజము చెంతకు చేరనేమొకా?

## 3

జల జల మంచు సాగు చలచల్లని నీళుల కొండవాగు పా
టల ప్రభవించు దివ్యమకుటాల ధరించిన మబ్బు కన్నియల్
వెల వెల బోవు కొండ నులివెచ్చని కౌగిలి చిక్క; తూర్పు, శో
భల తెలతెల్లవారె విభవాభ్యుదయోన్నత మార్గవేదిపై.

తూరుపురాణి వీడి, జయదుందుభి గీతిక లాలకించి, వ్యా
పార విశిష్టతన్ వసుధ భామకు చెక్కిలిమీటి, గడ్డిపై
కోరిక పొంగులెత్త తళుకొత్తెడు వన్నెల మంచు ముత్తెముల్
కూరిచి ఆకసాన నవకోమల భంగిమ దాల్చె సూర్యుడున్.

విశ్వసౌజన్య సౌహార్ద వీథి ప్రక్క
పూచి వికసించు తెలుగుల పూలతోట
చొచ్చి, సౌభాగ్యప్రాభాత సుమము లేరి
కోరి నా తల్లి సిగలోన కూర్చగలను.

సాహిత్య వాటిక చక్కగా పుష్పించి
విలసిల్లు విరజాజి విరులు దెచ్చి,
సంగీతవారిధి బంగారు కెరటాల
మరుగున వ్యథజెందు మణులు దెచ్చి,
శిల్పప్రపంచాన చెలువమ్ము లెగబ్రోయు
చిరుకొమ్మ చిగురాకు చిదిమి తెచ్చి,
నాట్యశాస్త్రిలలో నవనవోన్మేషంబు
సుమియించు మధుర భంగిమల దెచ్చి,
తగిన యన్నింటి దెచ్చి స్వాతంత్ర్య వీథి
చలువ సంస్కృతి పందిళ్ల విలువ దెసల
కుతుక ముప్పొంగ కూర్మితో కూర్చి పేర్చి,
మంచి రత్నాల పొదిగెడి మానవుడను.

నిత్యసుకుమార సుందర సత్య పుష్ప
చయ మసత్యరాక్షస ఘోర భయదక్రూర
పాదఘాటిన్ నలుగనీక పదిల పరచి
మాతృమూర్తికి మెడ గూర్చు మానవుడను.

సత్యధర్మ కరుణ సమత గులాబీల
ముండ్లలతల దీసి చెండ్లుకట్టి
కన్నతల్లి తెలుగు కాణాచి సిగలోన
మమతతోడ చేర్చు మానవుడను.

నవ్యజీవితరంగము నాల్గుదెసల
మల్లె తీవలు నాటించి మంచి పెంచి
నిండు నయనాల నా చెల్లి నీలి కొప్పు
జ్ఞాన పుష్పాల తురిమెడు మానవుడను.

4

వెలుగు కిరణాల విజయ వివేక దీక్ష
నిత్యనిద్రాణ జగతీ విస్తీతి దోలగ
కటికి రాకాసి చిమ్మచీకటులు పోయె
నిద్రమేల్కాంచె క్షుద్రదరిద్ర ధరణి.

రాత్రి మనస్సు చీకటి కరాళ వికారత చూచి యేడ్చె; నే
ధాత్రి వెలుంగు రేఖల సుదర్శన తీవికి నవ్వుకొంటి; ఏ
మైత్రి వికాసవర్తనము మార్చెనో జీవిత మార్గగమ్యముల్
చిత్ర విచిత్ర రీతుల రచించితి మామక భావమాలలన్.

# అన్నదమ్ములు

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

‘అబ్బబ్బ! ఒక్క నిముషంకూడా నేనిక్కడ వుండలేను!...’

‘ఏమిటట్లా రుసరుసలాడి పోతావు. అట్టే చూస్తుంటే...’

‘అంతేలే, నేనంటమే కనిపిస్తుందిగాని, ఇంట్లో యేమిటి జరుగుతోందో, నువ్వుపట్టించుకుంటేగా!...’

‘ఏమిటయింది చెప్పమంటుంటే, ఏమిటాసోది వూరికే!...కసురుకున్నాడు రాఘవులు.

‘మంగి నేరగావుందిగా! ప్రతిపనికీ మంగీ, మంగీ అని నావెంట పడటం. ఆమెమాత్రం, కూర్చున్న చోటునుంచి కదలకూడదు...ఓ మూల బుద్ధాడేమో చంకదిగడాయె! అన్నింటికీ నేనే రావాలేంటి...పోనీ బావచెప్పరాదూ...’

‘మా అన్నయ్యను యేమీ అనక, చాలా మంచి వాడు...’

‘అవున్లేవయ్యా, మీ అన్నయ్య మంచివాడు, మా అక్కయ్య మంచిదే, నడాన, నువ్వూ, నేనూ చెడ్డాళ్ళం. అంతేగా!

‘అసలు నీకేం వచ్చిందో చెప్పరాదూ...’

‘నాకేంరాలా!...ఓమాటడిగనా!...సంక్రాంతి పండగకంటా, నాకొక్క చీరె కొనిపెట్టావు! బుద్ధాడికి ఒక్క చొక్కాన్నా తెచ్చావు? ఎందుకొచ్చిన నౌకరీ అంట!...ఈరొమ్ముల్లో వుండి, నేను దాసీదానిలాగ పనిచెయ్యటమూనూ, నువ్వేమో రెక్కలు విరుచుకోవటమూ యెందుకంట! మనయిల్లు మనం చూసుకోలేమా! ఈ నెల బావ, యేమాత్రం తెచ్చాడు. ఆమె యేంపనిచేసింది...కూటికి లేనప్పుడూ చచ్చేటట్టు పనిచేశాము. ఇయ్యాల, కొంచెం సంపాదిస్తున్నాం గదా అనుకుంటే, ఆ అనుభవం లేకపాయె! పైగా మనిద్దరికి అబంనచాకిరీ తప్పకపాయె!...నువ్వు ఆలోచించు, నేను అన్నాననికాదు...’ మంగి రాఘవులు మొహంలోకి ఆలోచనగా చూసింది.

రాఘవులు యేమీ సమాధానం చెప్పలేక పోయాడు. రాఘవులుకు తెలుసు, మంగి అన్న మాటల్లోగల సత్యం. తాము కొనుక్కున్న కొత్తిరిక్షాలో తనసత్తువ యెంతుందో తనకు బాగా తెలుసు. తాము కట్టుకున్న పూరింటికి తాను యెంతశ్రమ పడ్డాడో మరిచిపోలేదు. ఎవరికోసం యీశ్రమ, యెందుకోసం యీబాధ అని యెన్నడూ రాఘవులు ఆలోచించలేదు. తనకష్టార్జితం, యింకొళ్ళపాలవుతోందని కూడా యెప్పుడూ వూహించలేదు. తన జీవితం వడ్డించిన విస్తరికాదు. తాను కష్టంచేసి బ్రతకాలి. ఈ సత్యాన్ని రాఘవులు పూర్తిగా గుర్తించాడు. తాను శ్రమపడుతున్నప్పుడు కూడా, యింకోళ్లు తన శ్రమ ఫలితం అనుభవిస్తున్నారనే భావనే కలగలేదు. అందువల్లనే తాను అన్నతో పాటు యీవూరువచ్చినప్పుడు, మనం యెట్లా బ్రతకటం, యెట్లా సంపాదించటం, యెట్లా జీవించటం, యివే సమస్యలు యిద్దర్నీ బాధపెట్టినాయి. బండరాళ్లను ముక్కలు ముక్కలుగా చేశారు. దుంగ కొయ్యల్ని బద్దలు బద్దలుగా చీల్చారు. ధరిత్రిని, శ్వేద బిందువులతో తడిపి, నారుపోసి పెంచారు. నిలువు టెండలో, కడుపులు మాడ్చుకుని, కట్టిన పునాదుల మీదనుంచి భవనాలు లేచినాయి, రెక్కలు ముక్కలు చేసుకుని నాగలి పట్టిన పొలం నవ్వింది. అదంతా యితరుల సొమ్ము. పోను, రాఘవులు తీవ్రంగా ఆలోచించుకున్నారు. దీనికి అంతం యేమిటి మనశ్రమ మనకు అక్కరకు రావటంలేదు. ఇతరులకోసం, మన రక్తం ధారపోయటం యెందుకు! ఎంతసేపు ఆలోచించినా, యీ సమాజవ్యవస్థ యొక్క అంతుచిక్కలేదు. వాళ్లు బ్రతకాలి, దీనికోసం యేంచెయ్యాలి! ఇదే ఆలోచన. ఎంత కష్టపడ్డా తిండికే సరిపోవటంలేదు. బ్రహ్మప్రళయంగా వరదలు వచ్చి, పంటలన్నీ నాశనమయితే, నీటిచుక్క లేక పోసినవారు, మలమలమాడిపోతేయేం, యెట్లాగైతే నేం, తామున్నచోట తమకుతిండి దొరకదనే, పొట్టల్ని చేతపట్టుకుని, దేశంమీదపడ్డారు. రక

రకాల పనుల్లో తరతమ భేదాలుగా, తమరక్తాన్ని ధార పోయటమే. దీంట్లో సుఖం లేదు, శాంతి లేదు, దీనికొకసు దంటూ లేదు. యౌవనాన్ని వెనక్కు నెట్టేసి, కాలం ముందుకు పరుగెత్తుకు పోతుందని యిద్దరికీ తెలుసు. యౌవనంలో అనుభవించవలసిన సుఖాన్ని బలిచేసుకున్న తర్వాత, యింకా మనుగడే అనవసరం అని కూడా వాళ్ళిద్దరూ గ్రహించారు. ఇలాంటి ఆలోచనలు వాళ్ళిద్దర్ని తీవ్రంగా కలవరపరిచినాయి. ఎట్లానైనా, తమసొత్తంటూ ఒకటి యేర్పడాలి. అంతవరకు అవిరళంగా కృషి చెయ్యాలి. దానితర్వాత అన్ని సమస్యలు వాటంతట అవే దక్కపడతాయని అనుకున్నారు. పగలనక, రాత్రనక, తమ రక్తం అంతా ధారపోసి తాములాగుతున్న రిక్షాను, యజమానికి యిచ్చేసి, కొత్త రిక్షాను కొనేశారు. ఇప్పుడు యజమానికి, తమరక్తంలో, భాగం యివ్వక్కర్లేదు. ఒకవారం, పగల్లా సోము రిక్షాను తీసుకుపోతే, రాత్రిపూట రాఘవులు తీసుకుపోతాడు వంతుల ప్రకారం. యిద్దరూ రిక్షా చక్రాల్ని తిప్పేస్తున్నారు ఎక్కడో వూరిబైట, చౌకగా కొంచెంగా స్థలం కొనుక్కుని, ఓ పూరిగుడిసె వేసుకున్నారు. ఇల్లొచ్చింది ఇల్లాలురావాలి. సోము పెళ్లి చేసుకున్న కొద్ది నెలల్లోనే రాఘవులూ పెళ్ళిచేసుకున్నాడు. తమల్ని పీల్చిపిప్పిచేసిన రిక్షా యజమానికి పోటీగా నిలబడ్డారు యిద్దరు అన్నదమ్ములును! ఒకవస్తువును, తమ సొత్తుచేసుకోవటంలో వుండే సాధకబాధకాలు యిద్దరికీ పూర్తిగా అర్థమయినాయి. సోము, రాఘవులు, అప్పుడప్పుడు, తమ గతచరిత్రంతా జ్ఞాపకం తెచ్చుకుంటూ, విచారిస్తూ వుంటారు. తోడుకోడళ్ళిద్దరు కళకళలాడుతు యింట్లో తిరుగుతూవుంటే అన్నదమ్ములిద్దరు ఆకలూ, చిగిరించి, పుష్పించి, కాయలుకాసినట్లు సంతోషపడుతున్నారు. సోముకూ మగపిల్లాడే, రాఘవులకు మగపిల్లాడే!

ఇప్పుడిప్పుడే, రిక్షాను అద్దెకు యివ్వటం కూడా మొదలు పెట్టారు. అయితే రాబడి పూర్తిగా తగిపోతోందని తెలిసినతర్వాత, శరీరం కష్టపడితే కాని, డబ్బురాదని తెలుసుకున్నారు. ఇద్దరు అన్నదమ్ములల్లా అరుగురయ్యేటప్పటికి, మన స్తత్వాలు విభిన్నంగా కనిపించటం మొదలుపెట్టినాయి, దృక్పథాలు మారటం మొదలుపెట్టినాయి. లెక్కలకు విలువ వచ్చింది. తన, మన అనే భావం, ఒకరికి తెలియకుండా ఒకరికి పెరిగిపోయింది. అన్నదమ్ములు సుభావంగా వూరుకుంటున్నారు. తోడికోడళ్ళు రచ్చకెక్కుతున్నారు శాంతి సంతోషం, యొకరిమనస్సుల్లో వారికి వుంటుందనే మాట అసత్యమని యిద్దరి అన్నదమ్ములకు తోచింది. తామున్న యింట్లో వుంటుంది శాంతి, సంతోషము.

నిజానికి రాఘవులు కష్టపడ్డంత సోము కష్టపడటం లేదు. ఇది యివ్వాళ రాఘవులు తెలుసుకున్న సత్యం కాదు. తాము మొదట యీ వూరువచ్చినప్పటినుంచి, సోముకు, రాఘవులుకు తెలిసిన విషయమే! శరీర దౌర్బల్యము వున్నా, మనోబలం చేత యిన్నాళ్ళు సోము నెట్టుకువస్తున్నాడు. సోము అంతమాసుకుని రాఘవులు కంటలు పెంచుకున్నాడు. అన్న సంగతి, తనకు మొదటినుంచీ తెలిసినా మంగి యీనాడు ఆలోచిస్తున్నట్లు, రాఘవులు యెన్నడు కూడా ఆలోచింద లేదు. రాఘవులు తీవ్రంగా ఆలోచించుకుంటున్న కొద్దీ మంగి అంటున్న మాటల్లో సత్యం గోచరమవుతోంది. జీవితం శాశ్వతం కాదు. ఓ మూలవృద్ధాప్యం ముందుకొస్తుంది. ఇట్లాయెన్నాళ్ళు సాగిపోవటం. పిల్లాడు పెరిగి పెద్దవాడయితే, వాడు కూడా రెక్కలు విరుచుకోవాల్సిందేనా! నేను కష్టపడింది చాలదా. అయినా నేనుకష్టపడింది నా కోసమేనా! నా సంతోషంకోసం కాదు! నేను కష్టపడి సంపాదించిన దంతా ఖర్చయిపోతే, నా కొడుక్కు మిగిలే దేముంటుంది? ఏవేవిటో ఆలోచనలు పరంపరలుగా వచ్చి, రాఘవుల మనస్సుమీద దాడి చేస్తున్నాయి. ఇంట్లో పోరు. బైట శ్రమ. తనకు సుఖంలేదు. ఈ రెండూ రాఘవుల మనస్సును తీవ్రంగా పీడిస్తున్నాయి. వెంటనే తాము యీ వూరు మొదట వచ్చినప్పుడు, తన అన్న, తాను యే విధంగా వున్నారో, ఆ దృశ్యాలన్నీ కళ్ళల్లోకి వచ్చి నాట్యమాడేవి. వెంటనే దులపరించుకుని, రిక్షా యెక్కుకుని వెళ్ళిపోయే వాడు.

ఆనాడు రాఘవులు యింటికి వచ్చేటప్పటికి యింట్లో ఘర్షణ పడుతున్నట్లు మాటలు వినిపించినాయి. చప్పున వచ్చినవాడు వచ్చినట్లుగానే ఆగిపోయాడు.

'ఏవిటి యీ బాడింపు. చీటికి మాటికి, మంగి యేదో యేదో అంటూనే వుంటుంది. ప్రతిదానికి నేను సమాధానం చెపుతూ కూర్చోవాలి...అంతేయిదా మరీ! నాలుగు డబ్బులు ఎక్కువ తెస్తున్నాడుగదా తన

మొగుడని, యిష్టం వచ్చినట్లు అంటుంటే వూరుకోవన్ వేవా!...పోనీ రాఘవులు యేమన్నా అంటాడేమో అంటే యేమీ మాట్లాడడు...' రామి కోపాన్నంతా వెళ్ళగక్కుతోంది.

'రాఘవులను యేమీ అనక వాడు చాలా మంచి వాడు...'

'అవునులే, మీ తమ్ముడూ మంచివాడే, మా చెల్లెలు మంచిదే, మధ్యన, మనిద్దరమే చెడ్డాళ్ళం...' 'అంత కూటికి లేక చస్తున్నామా!...మన యిల్లు మనం చూసుకోలేమా? యెందుకొచ్చిన తంటాఅంట యిది!.. రామి, దీర్ఘంగా, సోము కళ్ళల్లోకి చూస్తూ నిలబడింది.

సోము యేమీ సమాధానం చెప్పలేకపోయాడు.

ఇంతలోకే మంగి తనపని పూర్తి చేసుకొని యింటికి వచ్చేసింది. తన భర్త మొహం చూసీ చూడటంతోనే, మంగి నవ్వుత ఆగిపోయింది. ఏమిటి అట్లా వున్నావని అడిగింది. రాఘవులు మారు మాటాడకుండా యింట్లోకి వెళ్ళాడు. సోము రిక్షా తీసుకుని బైటకు వెళ్ళిపోయాడు.

ఒకరి మాటలు ఒకరు వినాలచేటంత బిగ్గరగా సంభాషణలు రోజు రోజుకు సాగిపోతున్నాయి. నలుగురు పెద్దవాళ్ళు నాలుగు రకాలుగా ఆలోచించుకుంటున్నారు. రాఘవులు, అన్నను పిలిచి అడుగుదామనుకున్నాడు. సోము, తమ్ముణ్ణి అడగనే అడిగాడు. మంగివల్ల తప్పేమీ లేదు, మంగి అంటున్న మాట లన్నీ నిజమే! వదినకు నువ్వు సరిగా చెప్పకపోతే మాత్రం చాలా కష్టమని కూడా రాఘవులు హెచ్చరిక చేశాడు. సోము కూడా వెంటనే అనేశాడు. మంగివల్లనే యీ భేదాభిప్రాయాలు వచ్చినాయి. ముందర మంగిని సంబాళించుకుంటే అన్నీ సమసిపోతాయని. రాఘవులకు చర్రున కోపం వచ్చింది. సోము బాగా చిరాకు పడ్డాడు. ఇద్దరు ఎన్నడూ అనుకోని మాటలు అనుకున్నారు. లోపల మంగి మండిపడిపోతోంది, బావ, తన పెళ్ళాన్ని వెనకేసుకు వస్తున్నాడని. రామి బుస్సు మంటోంది, రాఘవులు తన పెళ్ళాన్ని వెనకేసుకు వస్తున్నాడని. ఈమాటల ఘర్షణ రోజు రోజుకు తీవ్ర రూపం దాలుస్తోంది. చివరకు పంపకాలదాకా వచ్చింది. ఇంట్లో చెంబూ తప్పాలనుంచి పంచుకోవటం అయిపోయింది. ఇక యిల్లుంది, రిక్షా వుంది. ఇంటి పంపకం యెంతసేపటికి తెగలేదు. మంగి యేమి నూరిపోసిందో యేమో, రాఘవులు గటిపట్టే పట్టాడు. ఆ యింట్లో సగంకంటె యెక్కువ భాగం తనకు రావాలని, సోము, రామి యెన్ని చెప్పినా, ఆమాటకు వప్పుకున్నాడు, హద్దులు గీసుకున్నారు. ఎవరి స్థలంలో వారు తలోకపాక వేసుకున్నారు. ఇక రిక్షా సంగతి వచ్చేటప్పటికి పంపకాలు కుదర్లేదు. ఇద్దరికీ తెలుసు, యీ నాడు రిక్షాను అమ్మితే, వేరొక రిక్షా కొనుక్కోలేమని, కిరాయి రిక్షా తీసుకుంటే యెంతో కష్టమని మునుపటిమాదిరిగానే, పగలల్లా ఒకడు, రాత్రిలా ఒకడు వంతులు చొప్పున రిక్షానులాగి సంపాదించుకుని తింటున్నారు. ఆ యిద్దరికీ అదివరకు మాదిరిగానే, ఆరిక్షాయే జీవనాధారం.

మంగి వూహించినట్టుగానే, రాఘవుల సంపాదనతో, తనకొక చీరెఅని, కొడుక్కు చొక్కా అని, భర్తకు ధోవతిఅని సంపాదించుకో కలిగింది. విడిగా వున్నతర్వాత, రాఘవులకు, మంగి అన్న మాట లన్నీ ఒక్కొక్కటే అనుభవంలో కనిపిస్తున్నాయి.

కాలచక్రంతో పాటు, రిక్షాచక్రం రాలేక యెంతో వెనక్కు పడిపోయింది. అవూళ్ళో సిటీబస్సులు వచ్చేసినాయి. మైలువెళ్ళాలంటే, అణాయిస్తే, యిట్టే వెళ్ళిపోతారు. పావలాయిచ్చి, రిక్షాయెక్కే నాథుడు యెవరూ కనిపించటం లేదు. రిక్షాల గిరాకి చూస్తూ చూస్తుండగానే యిట్టేపడిపోయింది. తాను అదివరకు సంపాదించేదాంట్లో సగంకూడా రావటం లేదు. ఇంత సంపాదించినవాళ్ళం. ఓచిల్లర కొట్టు పెట్టుకున్నా, యీపాటికి మనజీవనానికి దిగులులేకుండా పోయేది అనవసరంగా రిక్షాకొనుక్కుని యెందుకూ కొరగాకుండా పోయామే అని విచారపడుతున్నారు రిక్షా యజమానులు. ఈవచ్చిన కొత్తమార్పుతో, అన్నదమ్ములిద్దరిమధ్య వైరుధ్యము పెరిగింది. ఎవరికివారు, ఆ రిక్షా తనసొత్తే కావాలనే పట్టుదలలో వున్నారు. ఎంతసేపటికి యిద్దరిమధ్య సమన్వయం కుదర్లేదు వీరిద్దరూ యిట్లా మనస్పర్థలు పెంచుకుంటూనే వున్నారు. ఈ మధ్యలోనే యింకో వుపద్రవం వచ్చిపడింది. మ్యునిసిపాలటీవారు, రిక్షాలను తీసేస్తున్నారనే వదంతి పుట్టింది. రిక్షా యజమానులు, రిక్షాలాగేవాళ్ళు, సభలు సమావేశాలు, జరిగి ఏకగ్రీవంగా తీర్మానాలు ఆమో

దించారు. రిక్షాలను వుంచాలంటూ, కార్మిక నాయకులు, పోయిన పలుకుబడిని వుపయోగించుకోవటానికి, యీ అవకాశాన్ని శాయశక్తులా వినియోగించుకున్నారు. ఎంత ఆందోళన జరిపినా, ఏమీ ప్రయోజనం లేక పోయింది. మ్యునిసిపాలిటీవారు తమ సమావేశంలో రిక్షాలను తీసెయ్యాలని నిశ్చయించారు. ఈ నిర్ణయం అమలు జరపంగానే, నీటినుంచి బైటపడవేసిన కప్పలు లాగ, రిక్షాయజమానులు, రిక్షాలాగేవాళ్లు తన్నుకు పోయారు గిలగిల. అదివరకు సంపాదించిన సొమ్ము పెట్టుకొని కొంతమంది యజమానులు యింకోరకం వ్యాపారంలోకి దిగారు. రిక్షాలాగేవాళ్లు కూలీ, నాలీ చేసుకుని బ్రతుకుతున్నారు. అతికష్టంమీద, విడివిడి భాగాలుతీసి అమ్మితే, రాఘవులుకు, సోముకు, తాము ఖర్చుపెట్టిన సొమ్ములో మూడోవంతు వచ్చింది, రిక్షాఅమ్మకంలో. ఆ డబ్బును చెరిసగం పంచుకోవటంలోకూడా తగాదాలుపడి చివరకు యెట్లాగోట్లా సర్దుబాటు చేసుకున్నారు. రిక్షాపోవటంతో, భుక్తి గడవటం యెంతో కష్టమైపోయింది. రెక్కలు విరుచుకున్నా, ముగ్గురిపిల్లల్ని, పోషించాలంటే, మంగికి, రాఘవులకు పెద్దసమస్య అయిపోయింది. సోము అదే స్థితిలోవున్నాడు. తన కుటుంబాన్ని పోషించే గత్యంతరం లేక, రాఘవులు, తనస్థలాన్ని, యింటిని అమ్ముకుని, యెక్కడో పూరిగుడిసెలో, నెలకు మూడు రూపాయలు అద్దెలో కాలక్షేపం చేస్తున్నాడు. సోము కూడా తప్పనిసరిగా తనయింటినికూడా అమ్మెయ్యవలసివచ్చింది.

తనకొచ్చిన డబ్బుతో విశ్వప్రయత్నం చేశాడు యింకా డబ్బు సంపాదించాలని. చిన్నదుకాణం పెడితే, దాంట్లో నష్టంవచ్చింది. ఏపనిచేస్తే, ఆపని తనకు యెదురయికూర్చుంది. రాఘవులకు తలకుమించిన పనయిపోయింది. ఎటూ తోచటంలేదు. మంగి, రెండుపూట్ల రెండిళ్ళకు వెళ్ళి బండచాకిరీ చేసివస్తుంది. తాను అక్కడా యిక్కడా తిరిగి, ఆపనీ, యీపనీ చేసుకుని యింటికి వస్తాడు.

ఏ పూటకాపూట, ఆ పూటకు గడవటానికే సరిపోవటంలేదు. సోముకు ఎక్కడలేని కోపంవచ్చింది. ఒక్కక్షణం కూర్చోకుండా ఏదో పనిమీద వెళుతూనే వుంటాడు. రామి ప్రొద్దస్తమానం చాకిరి చేస్తూనే వుంటుంది. అప్పుడప్పుడు, వెనకటివన్నీ జ్ఞాపకంవచ్చి ఏడుస్తుంది. సోము, తాను తమ్ముణ్ణి అపార్థం చేసుకున్నానేమో అని బాధపడుతూ వుంటాడు. రాఘవులు చాలామంచివాడు. మంగికూడా చాలామంచిదే. నేను తెలుసుకోలేకపోయాను. మొట్టమొదట తాను, తన తమ్ముడు ఈ వూళ్లోకి వచ్చినప్పుడు ఎట్లావున్నారో జ్ఞాపకం తెచ్చుకుంటూ విచారపడతాడు. తన తమ్ముడి జాడ తనకు తెలియదు. ఈ వూళ్లో వున్నాడో లేదో కూడా సోముకు తెలీదు. రాఘవుల్ని చూసి చాలా రోజాలయింది. సోము దీర్ఘంగా ఆలోచించుకుంటున్నాడు.

రాఘవులు దిగాలుపడి అరుగుమీద కూర్చుని, కళ్లు తుడుచుకుంటున్నాడు. తాను, తన అన్నతోపాటు ఈ వూరు వచ్చినప్పటినుంచి జరిగిన మార్పులన్నీ గుర్తుకొస్తున్నాయి. ఒక్కొక్క విషయమే తొలిచి తొలిచి రాఘవుల్ని బాధపెడుతున్నాయి. మంగి చెప్పిన మాటలు విని అనవసరంగా అన్నతో విరోధము తెచ్చుకున్నాను. అన్న చాలా మంచివాడు. వదిన చాలా మంచిది. అన్నను చూసి యెన్నాళ్లయిందో మరి! ఎక్కడున్నాడో ఏంచేస్తున్నాడో! రాఘవులు సంక్షోభపడిపోతున్నాడు. మంగి లోపల లోపల కుమిలిపోతోంది. సుఖపడదామనుకున్న రోజుల్లో మళ్ళీ అవి మొదలయినాయి. ఏ విధంగా జీవితం మళ్ళీ మారిపోతుందో చూచి బాధపడుతూంది. వెనకటివి తలుచుకుని విచారపడుతుంది. రాఘవులకు గాని, తనకుగాని వూపిరి సలపనంత పని. అయితే శ్రమకు తగినంత ఫలితం దొరకటంలేదు. తాను క్రుంగిపోతోంది, రాఘవులు చిక్కిపోతున్నాడు. ఏమి చెయ్యటానికి తోచటంలేదు.

ఎవరో బొంబాయినుంచి పెద్ద వ్యాపారులు వచ్చి, ఇక్కడికు మూడుమైళ్ల దూరంలో ఒక పెద్ద ఫ్యాక్టరీ కట్టబోతున్నారని అనోటా ఆనోటా వినవచ్చింది. ప్రతినోటా యీమాటే వినిపిస్తోంది. రాఘవులు నిశ్చయించుకున్నాడు, ఆ ఫ్యాక్టరీ పూర్తి అయ్యేటంతవరకు అసలు మకాంయెత్తి, అక్కడే వుండిపోతే సరిపోతుందని.

తమ బట్టల్ని చేతపట్టుకుని ఎక్కడెక్కడవాళ్లు అక్కడకు తయారయ్యారు. బ్రహ్మాండంగా పనులు సాగిపోతున్నాయి. చుట్టూ రకరకాలయిళ్ళు, ఆఫ్యాక్టరీ కట్టడం, చేతినిండా పని. దేనికీ వెతుక్కోనక్క

లేను. మంగితలకు ఓ చుట్టచుట్టి, బయలుదేరుతుంది. రాఘవులు, పలుగు, పారపట్టుకుని బయలుదేరుతాడు. ఆగగారిన హృదయాల పునాదులమీద పైకిలేచిన భవనాలమాట గుర్తుకొచ్చి, తన గతిపరిస్థితిని, గతి ఆలోచనలను, స్ఫురణకు తెచ్చుకుంటున్నాడు, రాఘవులు. వికలిగా తనలో తాను నవ్వుకుని, మనం యీ జన్మలో భాగ్యవంతులం కాలేము. భాగ్యవంతులు యింకా భాగ్యవంతులవుతారు. బీదవాళ్ళు యింకా బీదవాళ్లవుతారు, వాళ్ళకు డబ్బుంది. మనకు రెక్కలున్నాయి. మనం కష్టపడాలసినవాళ్ళం. అది తప్పదు, రాఘవులు యేమేమిటో ఆలోచించుకుంటూ, పనిచేసుకుని పోతున్నాడు.

ఎండ చుర్రుమంటోంది. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేశాడు. రాఘవులు స్వేదస్నానం చేస్తున్నాడు. ఎంతో నిబ్బరంగా, గుండెబరువుతో, పారతో లాగిన మట్టిని తట్టలోకి వేస్తున్నాడు. మంగి. ఆయాసపడుతూ, అక్కడే చతికిలపడిపోయింది; రొప్పుతోంది. ఒక్కసారిగా పైకిచూసింది. సూర్యకిరణాలు వాడిగా కళ్ళల్లోకి పొడుచుకు పోయినాయి, చప్పున కళ్ళు మూసుకుంది. రాఘవులు, తట్టనిండా మట్టిని నింపేసి, పలుగును గట్టిగా భూమిలోకి దింపేసి, దాని ఆసరాతో అట్లాగే నిలబడిపోయాడు రొప్పుతూ. మేస్త్రి ఎక్కడ పనికట్టాడో ఏమో, చప్పున రాఘవులవైపుకు గబగబా వస్తున్నాడు. మంగి చప్పునలేచి నిలబడి తట్ట నెత్తిన పెట్టుకుని చకచక నడిచింది. రాఘవులు భూమిలోకి గుచ్చిన పలుగును పైకిలాగాడు రౌద్రంగా. మేస్త్రి, చూసీ చూడకుండా ఇంకో వైపుకు వెళ్లిపోయాడు. కూలీలు గుంపులు గుంపులుగా వచ్చేస్తున్నారు. పని చురుకుగా సాగిపోతోంది. మేస్త్రి పంపించాడు గామాలు, ఓ పదిమందికూలీలు పలుగులు, పారలు పట్టుకుని, రాఘవులున్న చోటుకు వచ్చేసి, భూమిని త్రవ్వేస్తున్నారు. వంగిన నడుము ఎత్తలేక అతికష్టంమీద, మట్టితట్ట యింకోడి ఆసరాతో పైకెత్తి, తలమీద పెట్టబోయేసరికి, 'రాఘవులూ...' అంటూ గట్టిగా కౌగలించుకున్నాడు సోము—రాఘవులుకు కొద్ది క్షణాలదాక నోటినుంచి మాట పెగిలి రాలేదు.

అదుర్దాగా, మంగెక్కడ, పిల్లలెక్కడ అంటూ సోము కుశలప్రశ్నలు వేశాడు. రాఘవులు కూడా యెంతో ఆప్యాయంగా క్షేమ సమాచారాలు అడిగి అన్నా! నేను పెద్దతప్పు చేశాను, అంటూ కంట తడిపెట్టుకున్నాడు. సోము, తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుంటూ 'రాఘవులు నువ్వట్లా అనక, నేనూ చేశాను...డబ్బున్నప్పుడు ఒకరిసుఖాల్ని చూసి ఒకరు ఓర్వలేకపోయినాము. డబ్బుపోయిన తర్వాత, ఒకరి కష్టాల్ని చూసి ఒకరు జాలిపడాలని వచ్చింది...మనకు మిగిలింది మన రెక్కలే! మధ్యలోవచ్చిన డబ్బుకాదు....మనం అన్నీ పంచుకున్నాం...కాని మన ప్రేమల్ని పంచుకోలేక పోయినాం...' ఇద్దరు అన్నదమ్ములు పెనవేసుకుని వెక్కి వెక్కి ఏడ్చారు.

దూరాన్నుంచి చూసిన మంగి, పరుగు పరుగున వచ్చి, 'బావా, అక్కెక్కడ!... అంటూ బావురుమంది.



# కలకత్తా నగరము

శ్రీ సుధీన్ దత్తా

కాల్పనిక జగత్తులో విహరించుతూ వుండే నా మిత్రబృందంలో వేదాంతి ఒకాయ నున్నారు. ఆయన మాట్లాడ్డాని కుపక్రమించారంటే మన కిట్టే తిక్కలుట్టిస్తారు. అలాంటి అకటావికటం! 'ఏ ప్రదేశాన్ని గురించైనా తెలుసుకోవాలంటే అసలు ఎప్పుడూ ఆ ప్రదేశానికి వెళ్ళి స్వయంగా చూడకూడదు' అని ఆయనది అదో విచిత్ర సిద్ధాంతం. ఇల్లాంటి మాటలు విని, ఆయన ఊహాగానం చేసేమనిషనీ, వాస్తవాన్ని అవాస్తవికంగా తలక్రిందులు చేసి మాట్లాడతా రనీ అనుకునేవాణ్ణి. కాని ఆయన అభిప్రాయమేమిటో ఇప్పుడు నాకు కొంతకు కొంత అవగత మౌతోంది. ఎందుచేతనంటే: పూర్వం, కలకత్తాలో, మాయిల్లు ఇప్పుడు 'ఫోర్టు విలియం' కోట వున్నచోట వుండేది. ప్లాసీ యుద్ధానంతరం ఆ కోట కట్టడానికి ఉపక్రమించినప్పుడు మా కుటుంబం అక్కడనుంచి లేచిపోవలసి వచ్చింది. నగర మధ్యంలోకి మారాము. నాటికీ నేటికీ మేము నగరం నడిబొడ్డు నే వుంటున్నాము. నేను అక్కడే పుట్టాను. అక్కడే పెరిగాను. అర్ధశతాబ్ది పైచిలుకు నా జీవితంలో, అధిక భాగం అక్కడే వెళ్ళిపోయింది—కాని మా నగరం ఇలాంటిది అని చెప్పమంటే వశంగాదు. ఏ పరాయిదేశపు పెద్దమనిషైనా వచ్చి మీ నగరంలో చూడవలసిందేమిటి అని అడిగితే, నేను తెల్ల మొహం వెయ్యటమే.

ప్రాచీనమైన నగరం కాకపోవటంచేత, అలా వేలెత్తి నిరూపించటానికి ఆస్కారం వుండదంటారేమో. కాని నాకు అలా తోచదు. నిజానికి కలకత్తా నిన్న మొన్న పుట్టిన నగరమే: ఇది నగర రూపం ధరించటం ప్రారంభమై రెండు శతాబ్దాలు కూడా కాలేదు. భారతదేశంలో, ఇతరత్రా లక్షలాది సంవత్సరాల ప్రాచీనతను సంతరించుకున్న ప్రదేశాలున్నాయి. ఇదంతా నిజమే ననుకోండి. కాని ప్రపంచంలో, ఇటీవల పెంపొందిన అనేక క్రొత్త నగరాలున్నాయి. అవి శోభగానే వుంటాయి. ఈ ప్రాచీన భారత భూమిలో కూడా, ప్రతినగరంలోను ఇప్పుడు జనం క్రిక్కిరిసి వుండే ప్రదేశాలు, బ్రిటిష్ ప్రభుత్వం తొలిరాజధానిగా నిర్మించుకున్న ఈ కల

* ఎన్‌కౌంటర్ పత్రికతో గల ప్రత్యేక యేర్పాటుతో *

కత్తా నగరంకంటే మరేదీ ప్రాచీనమైనది కాదు. కలకత్తాలో ప్రాచీన శిథిలశిల్పసంపదలు కనుపించక పోయినా, మధురా, ఢిల్లీ, కాశీ మొదలైన మహా నగరాలవలెనే, కుళ్ళు వీథులకు, మురికిగుట్టలకూ మరేదీ కొదవలేదు. అందులోనూ ఉత్తరాదిప్రాంతం కంటే, ఈ తూర్పుదిశలో వుండే సహజవాతావరణం, ఎట్టి నిర్మాణములకైనా అనతికాలంలో జరాభారాన్ని పట్టించి శిథిలావస్థకు తేవటానికి సమర్థమైనది. మా వంగీయులు ఈ విషయాన్ని యేనాడో గ్రహించినట్లున్నారు. అందుచేతనే కాబోలు సుమారు రెండువందల సంవత్సరాల క్రితంవరకూ వారు పూరి కప్పువేసిన మట్టికొంపలలోనే నివసించుతూ వచ్చారు. అంతేగాదు—మట్టిదేవుళ్ళను కొలుస్తారు; వాటి పని అయిపోగానే నదీగర్భంలో ఉద్వాసన చెప్పేస్తారు. మట్టిలో మట్టి కలిసి మాయమైపోవటానికి.

18 వ శతాబ్దివరకూ, గంగానది, సాగరసంగమం చెయ్యటానికి, హుగ్లీనది ప్రధానవాహికగా వుండేది. అందుచేత ఇప్పుడు కలకత్తానగరం వున్న ప్రదేశానికి ఉత్తరంగా, ఏడెనిమిది మైళ్ళదిగువ వరకూ నాగరప్రజలు నివసించుతూ వుండేవారు. ఈ ప్రజావాసాలకు వెనుక తట్టున, ముళ్ళతోపుల బాడవభూములు వ్యాపించి వుండేవి; వాటిలో అక్కడక్కడ మధ్య మధ్యను చిన్న చిన్న పల్లెగ్రామాలు. ఈ నాగర ప్రాంతానికి పైభాగంలో ఇంగ్లీషువారు కొంతకాలం ఆవాసం చిక్కించుకున్నా, స్థానిక పరిపాలకుల ఒత్తిడివల్లనైతే నేమి, ఇతర యూరపియన్ జాతుల పోటీకి తట్టుకోలేకపోవటంవల్లనైతే నేమి, అక్కడ నిలవలేకపోయారు. అందుచేత నదివెంట దిగువకు వచ్చి సముద్రతీరంలో మూడు చేపలరేవులను ఆక్రమించుకు స్థిరపడ్డారు. ఆవిధంగా, బ్రిటిష్ సామ్రాజ్యంలో రెండవదిగా పేర్కొనదగిన కలకత్తానగరానికి శంకుస్థాపన జరిగింది. శైశవదశలో ఈ నగరానికి అనేక అవాంతరాలు తటస్థించినా, దాన్ని అభివృద్ధికి తెస్తున్నవారు, సుదూరంలో కాళీఘట్టంలో వేంచేసియున్న విలయకారిణి కాళికాశక్తియొక్క ప్రభావంగా ఎంచి తలొగ్గుతూ వుండేవారు. కలకత్తా నగరంయొక్క కీర్తిప్రతిష్ఠలు ఆ విలయమూర్తివల్ల సంక్రమించినవి కావని స్పష్టంగా తేలుతోంది. కాకపోతే, బ్రిటిషువాళ్ళు చేరేవరకూ ఆ ప్రదేశం నిర్జనంగా వుండిపోవటానికీ, అనంతరదశలో చెలరేగిన అనేక కల్లోలాలకూ ఆ మహాశక్తే కారణమని నేను విశ్వసిస్తున్నాను.

## II

ఆదిలో అంత ఆలోచన మీద జరిగిన పని కాకపోయినా, ఒక విదేశీ ప్రభుత్వం సామ్రాజ్యస్థాపన చేయటానికి ఇంతకంటే అనువైన ప్రథమస్థావరం మరొకటి లేదు. స్థానికప్రజలు తొలిగా ఆ కొత్తవలసలోకి మూగటానికి, యితరప్రాంతాలలో వ్యాపించివున్న అరాచకపరిస్థితులూ, అరక్షితస్థితీ కారణమైనా, అనంతరకాలంలో వారు దాన్ని అంటిపెట్టుకుని స్థిరనివాసం ఏర్పరుచుకోవటానికి వేరే కారణాలున్నాయి. వారి ఆశాపథంలో కొన్ని నూతనావకాశాలు దృగ్గోచరమైనాయి. పైపెచ్చు ఈ విదేశీ స్థావరంలో వుంటే, అనాదికాలంనుంచీ వస్తున్న కట్టుబాట్లకూ నియమాలకూ వారు బద్ధులై వుండనక్కరలేదు. కష్టపడకుండా తేలికగా డబ్బుసంపాదించి జేబులు నింపుకోవచ్చు. చిత్రవిచిత్రాలైన కొత్త కొత్త భావాలతో తలలుకూడా నింపుకోవచ్చు. ఈ నూత్నభావాలలబ్ధి భారతదేశమునకు బ్రిటిష్‌పరిపాలనవల్ల సంక్రమించిన ప్రధానఫలితం. చిరకాలం ఈ నూత్నభావవ్యాప్తికి కలకత్తా నగరం ప్రధాన కేంద్రంగా వుండేది. కాని ఆనాడు అక్కడికి చేరినవారెవ్వరూ, అది, తమ స్థిరనివాసంగా ఎంచుకునే వారు కారు. నగరంలో, వాణిజ్యం ద్వారా సంపాదించుకున్న డబ్బుతో యితర ప్రాంతాలలో భూములూ పుట్రా కొనుక్కునేవాళ్ళు. గైరుహాజరు భూస్వామిక వర్గమంటూ రద్దయిపోయిన తరుణంలో కూడా, వాళ్ళు, తమలాగే అక్కడికి చేరిన యితర వ్యాపారస్థులతో వాణిజ్యంలో పోటీ చేయటానికి వచ్చామనే దృక్పథంతో వ్యవహరించేవారే కాని మిగతా వారితో ఏకమై పోయేవారు కారు. ఇందువల్ల ఆర్థిక వర్గాలు పెంపొందే ఆస్కారం లేకుండా పోయింది. కాని, కుటుంబమే సర్వసాంఘిక కార్యకలాపాలకూ కేంద్రంగా వుండటంచే, వర్ణవ్యవస్థ ప్రభావం కొంత తగ్గింది.

ఈలోగా మృణ్మయావాసాలను వదిలి, ఇటుకా సున్నంతో కట్టిన మేడలమీద నివసించాలనే ఒక క్రొత్త ఆవేశం లేదా ఒక క్రొత్త నాగరకత బయలుదేరింది. దబదబా మేడలు లేచి పోయినై. ధనికులు కట్టడం సరే, ముందుముందు ధనికులు కాబోతున్న వాళ్ళూ, కాగోరుతున్న వాళ్ళూ కూడా కట్టారు వెర్రిమొర్రి వాగ్దానాలతోనూ. 'పదెనిమిది కోట్లు లెంటా తిప్పతో'మని రామప్పపంతులులా దబాయించి

అప్పలాక్ నోరు నొక్కేసి, యెట్లాగైతేనేం, తమభావి తరాల సంతానం గొప్పవాళ్ళుగా చెలామణీ కావటానికి తలో మేడా కట్టేశారు. అలా ఆ నగరంలో భవంతులన్నీ, అంతఃపురాలనీ, రాజప్రాసాదాలనీ, తమంతటా చెప్పుకుంటూ తలో మేడా కట్టేశారు. ఈ కట్టడాలకు ఒక పాలూమాలా ఒక పద్ధతీ లేదు. ఎవరికెక్కడ యే విధంగా జాగా దొరికితే ఆ విధంగా కట్టేయడం. దానికో 'ప్లానింగూ' బందిలూ అలాంటి క్రమీ లేదు. మురికి బావులను ఆనుకుని, గోడ్లకొట్టాలమధ్య పెద్ద పెద్ద భవంతులు లేచినై. వాటిమధ్యగా సందులు. వర్షాకాలం వస్తే ఈ సందులు పేడకుప్పల దగ్గరనుంచి, మురుగుడుకుండ్లదాకా యేరూపమైనా భరించవచ్చు. నా బాల్యంలో, కొన్ని ముఖ్యప్రాంతాలలో, ఈ సందుల్లో నే కంకర గొట్లు వేశారు. కాని కొంచెం పెద్దవర్షం కురిస్తే చాలు వీటిలో చాలాభాగం మోకాటిలోతు నీటిలో మునిగి వుండేవి. ఇక ఈ భవంతుల శిల్ప సౌభాగ్యం సంగతి ఎత్తుకోనక్కరలేదు. తెల్లవాళ్ళ స్వంతానికి కట్టుకున్న స్తంభాలు వేసిన యిళ్లు వలసల్లో వాళ్ళు మామూలుగా కట్టుకుంటూవుండేమాదిరి విశాలంగా కట్టుకునేవాళ్ళు. ప్రభుత్వ భవనాలన్నీ పాటున, ఒకేరకం, భయంకర దృశ్యాలు. ఇక ఆ హైకోర్టుభవనం సంగతి, తమరు స్వయంగా చిత్రించాలిసిందేగాని, చెప్పలేనమ్మరు— అంత దారుణం. ప్రభుత్వ భవనము, మ్యూజియం, విక్టోరియా మెమోరియల్ హాల్, యివిమటుకు చూడ ముచ్చటగా వుంటాయి.

హైకోర్టుతో పోటీ చేయగలిగింది, స్కాట్లండ్ గురాల నమూనాలో, వ్యక్తిగతంగా ఒక భారతీయ కళాభిమాని నిర్మించిన భవంతి ఒకటుంది. ఈభవనానికి చేరాలంటే, చెడువాసనకు పేరుమోసిన కలకత్తా చేపల మార్కెట్టూ, కూరల మార్కెట్టూ దాటి పోవలసి వున్నది. అందుచేత ఆ ప్రాంతం విషయం తలుచుకుంటే, తమసాంఘనగరం తలపుకు వస్తుంది. ఇతర నిర్మాణాలన్నీ, మానవుని అయావ్యగ్రతల నన్నిటినీ ద్యోతకమానం చేస్తాయి. ధనికుడైన యే వంగీయుడు భవననిర్మాణం చేయవలసివచ్చినా గ్రీకు శిల్పాలు చెక్కిన స్తంభాగ్రాలూ, పోతయినుము పిట్టగోడలు అమర్చిన వరండాలూ వుండెంది కుదరదు. చుక్కల్లోకి లేచిన ప్రహారీ గోడలు లోపలున్న భవనాలకు, ప్రజల దృష్టిదోషం తగులకుండా కాపాడుతూ వుంటాయి. ఇకను ఆ గోడలలోపల: తృణశయ్యలు, పుష్పశయ్యలూ, రకరకాల జలాభిశేచనయంత్రాలు



గ్రీకు నమూనా స్తూపాలకుండీలూ, అద్దమైన రాతి శిల్పాలూ చీపరపాపరతీగలూ అల్లుకునివున్న జలాశయాలూ, పక్షి చలవరాతిలో చెక్కిన, నగ్న మూర్తులూ ఇవన్నీ వుంటాయి. వీటిమధ్య అంతూ పంతూ లేని పెద్దభవనం. ఆ భవనంలో అనేక విశాల మందిరాలు. ఆ మందిరాలలో చిక్కిరొక్కిరిగా పైనుంచి వ్రేలాడ్తూ, ఎటు మెలిపినా తలపు తగులుతూ, దీపగుచ్ఛాలమర్చే 'షాండిలీర్స్', లతలూ నాగ శీర్షాలూ చెక్కిన కాళ్ళతో కొయ్యసామాన్లు, పెద్ద పెద్ద అద్దాలు— ఒకదానికొకటి సంబంధం లేకుండా చిక్కిరొక్కిరిగా వుంటాయి. ఇక చిన్న చిన్న గదులు అనంతసంఖ్యలో వుంటాయి. వాటిలో, ఒకళ్ళతో ఒకళ్ళు సంబంధం లేకుండా ఆడవాళ్ళూ మగవాళ్ళూ జీవించుతూవుంటారు. రాత్రిపూట జీవసృష్టిని పెంపొందచేయటానికి కలుసుకోవటం తప్ప, యితరత్రా వాళ్ళకి ఒకళ్ళతో ఒకళ్ళకి సంబంధమేమీ వుండదు.

ఆర్థికంగా ఇంకా కొంచెం తక్కువస్థాయిలో వుండేవాళ్ళ భవనాలు మళ్ళీ వేరు. వాటికి ఒకొక్కదానికి రెండేసి పెరళ్ళు వుంటాయి. వాటిలో మట్టి తొట్లలో నాటిన తాటిమొక్కలు తప్ప మరే ఉద్యానవనాలూ వుండవు. ఆ యిళ్లలో పడకగదుల సంఖ్య బహుళం, పరాయి పెద్దమనుషులువస్తే ఆహ్వానించటానికివుండే గదులు పరిమితం. ఈ గదులనిండా ఈగలూ దోమలూ.

III

ఈ మహాసౌధాలకు, ప్రతిదానికీ ముందు, ప్రత్యేక పూజామందిర ముంటుంది. చుట్టూ ఆర్చీలు ఉంచిన వరండాతో చిన్న భవనం. వీటిలో దేవతారాధనకు సంబంధించిన మహోత్సవాలు జరుగుతూ వుంటాయి. ఈ ఉత్సవాలు సంవత్సరానికి దాదాపు పదమూడుదాకా వుంటాయి. వీటిలో అత్యంత ప్రధానమైన ఆరాధన వర్ష ఋతువు అనంతరం ప్రారంభమై నాలుగు రోజులపాటు కోటికోలాహలంగా జరుగుతుంది. మహాకాళియొక్క ప్రసన్నావతారమైన దుర్గాదేవిని ఆరాధించుతారు. చివరకు విజయదశమినాడు పదిచేతులుగల ఈ మహామూర్తిని నది దగ్గరకు మోసుకుపోయి దాన్లో కలిపేస్తారు. అనంతరం సాయంత్రం దాకా ఎవరుబడితేవాళ్ళు ఎవరుబడితే వాళ్ళను కౌగలించేసుకుంటూ వుంటారు. జనం చిన్నా పెద్దా, కొద్దీ గొప్పా, ఆడా మగా లేకుండా, ఇలా కలగాపులగమైపోయే మరొక తరుణం హోలీ పండుగ. ఆనందపారవశ్యంలో ఆడా మగా జనం సిగ్గు విడిచేస్తారు. బుక్కాయి దుమారాలతో వీధులు కోలాహలమై పోవటమేగాక, కామోన్మాదులైన జన సమూహాలు యిళ్ళమీదకూడా దాడి చేస్తాయి. ఈ తరుణాలలోతప్ప మిగతా సర్వకాల సర్వావస్థలయందూ, యే కక్ష్యలో మెసలవలసినజనం ఆ కక్ష్య అవధులు అతిక్రమించకుండా అత్యంత జాగరూకులై మెసలుతూ వుంటారు. గౌరవ కుటుంబాలకు చెందిన కులస్త్రీలు బయటకి వచ్చి విందులు వినోదాలలో పాల్గొనట మంటూ వుండదు. అయితే భోగంపడుచులకు కరువు లేదు. ఈ మహాభవనాలలోని విలాసమందిరాలలో వాళ్ళు పాటలూ పద్యాలు హోరెత్తిస్తూ నాట్యాలు చేస్తుంటే, యజమాని తన మిత్రులనూ, అనుయాయులనూ చుట్టూ చేర్చుకుని తాగి తసమిసలాడుతూ వుంటాడు.

ఇంత ఆత్మీయత లేకుండా, గౌరవ మర్యాదలను పురస్కరించుకుని కేవలం లాంఛనప్రాయంగా జరిగే విందులూ వినోదాలూ వుంటాయి. వీటికి ఆయా కుటుంబాలకు ప్రాపుగా వుంటున్న బ్రిటిషు అధికారులు ఆహూతులౌతూ ఉంటారు. ఈ అగ్రవర్గపు అస్పృశ్యులకు మొదట ఎంత ఆప్యాయంగా స్వాగతవచనాలు పలికినా, విచిత్రమైన పద్ధతిని అతిథిగార్ని అలా దూరంగా ఉంచేసే వ్యవహారమంతా నడిపిస్తారు. ఈ అధికారులు, తప్పతాగుతూ, మిఠాయిలు తింటూ, ఎత్తయిన ఆసనాలలో, ప్రదర్శనశాలలోని బొమ్మల మోస్తరుగా ఒకటి రెండు గంటలు కూర్చుని విసుగెత్తి తిరిగి ఇళ్ళకు చేరుకుంటారు. ఇవిగాక బహిరంగంగా, గృహోపవనాలలో ఏర్పాటు చేసే సంగీత కచేరీలకూ, పురాణ కాలక్షేపాలకూ, భరతనాట్యాలకూ ఇంచుమించు ఎరిగున్న వాళ్ళనందర్నీ ఆహ్వానించుతారు. ఇక కూతుళ్లూ, కుమార్తెలు వగయిరాల వివాహాలు జరిగితే, మేడలూ మిద్దెలూ, దొడ్లూ, దోవలూ వాకిళ్లూ, వరండాలూ, యావత్తూ భోజనశాలలుగా మారిపోతాయి. ఎరిగివున్న జీవుల్లో ఏ ఒక్కణ్ణీ అతిథుల జాబితాలో చేర్చకుండా ఉంచటానికి వీల్లేదు. కాని, ఆంగ్లేయ నాటకరంగాన్ని అనుసరించి నాటకరంగం ఏర్పడేవరకూ వంగీయులకు సాంఘిక వినోదకార్యక్రమాలంటూ ఉండేవికావు. వంగీయులు క్లబ్బులకూ వాటికీ వెళ్లరు. ఆహార నియమాలవల్ల 'రెస్టారెంటులు' మొదలయినవి పెంపొందటానికి యెక్కువ అవకాశం లేకపోయింది. తాగుడు మహాపాపం—రహస్యప్రదేశాలలో తప్ప దానిజోలికి పోగూడదు. అందుచేత, క్రికెట్ పోటీలూ, గుర్రపు పందాలు, ఫుట్‌బాల్ పందాలూ ఏర్పాటై జనాన్ని ఆకర్షించేవరకూ, వంగీయులకు ఉన్న సాంఘిక వినోదమల్లా ఒక్కటే—ఉపన్యాస వేదిక!

గ్రాంథిక స్థాయిలో, తీవ్ర ధోరణిలో, అనర్గళంగా, అపారపారావారంగా ఉపన్యసించటం వంగీ

యులకు వరదా. మొదట్లో ప్రారంభమైన సభలూ, సమావేశాలు సాంఘిక సంస్కరణల ప్రచారంకోసం, మత సంస్కరణల ప్రచారంకోసం ఏర్పాటైనా, రాను రాను అవి, వంగీయులలో వేగంగా పొడసూపిన ఉన్న భిన్న భిన్న వర్గాలను సమైక్యపరిచేందుకు మూలంగా, వాటిని మరింత పెంచినయ్. జాతిలో వున్న శక్తిసామర్థ్యాలు ఇలా వృథాగా వ్యర్థమైపోకుండా కొంత ప్రయోజనానికి వచ్చాయంటే యిందుకు బ్రిటిష్‌వారు అవలంబించిన విధానమే కారణం. పటుమని పదిమంది లేకుండా, పరిపాలనను సాగిస్తున్న విదేశీ అధికారులు ఎక్కడ తమ అధికారగౌరవానికి భంగం కలుగుతుందోనని భయంతో బహిరంగసభలకూ వాటికీ రాకుండా సభావిరోధులుగా ప్రవర్తించేవాళ్లు. అందుచేత ఏకాంతవాసం అభిలషించేవాళ్ళు. సిపాయిల తిరుగుబాటునుంచి బ్రతికిబయటబడ్డ తరువాత, ఈ ఏకాంతవాస స్వభావం దురహంకారంగా పరిణమించింది. బ్రిటిష్ వాళ్లకు తటస్థించిన ఆ ప్రమాదావస్థలో వంగీయులు హృదయపూర్వకంగా వాళ్ళకు అండగా నిలబడి సహాయం చేశారు. అనంతరదశలో దురహంకారరూపంలో బ్రిటిష్ వాళ్ళు ప్రదర్శించుచున్న ఈ కృతఘ్నతను సహించలేకపోయారు. రిప్పన్, యూరపియన్ నేరస్థులను, భారతీయులైన స్థానిక న్యాయాధిపతులు (మాజిస్ట్రేట్లు) విచారణ చేయవచ్చునని ప్రతిపాదన చేసేసరికి, బ్రిటిష్ వాళ్లంతా కూడగట్టుకుని ఇంచుమించు తిరుగుబాటు చెయ్యటానికే సిద్ధమయారు. దీంతో ఆ విదేశీయులు తమ జాతిపట్ల ఎంత హేయభావంతో వున్నారో స్పష్టమై క్రోధావేశులైనారు.

IV

పరస్పరం గౌరవ మర్యాదలు చూపుకునే విషయంలో బ్రిటిష్ వారు తెల్లెప్పుడు చిన్నచూపుగానే చూస్తున్నారు. ఇద్దరిమధ్యా నూతనంగా నిర్మింపబడిన ఈ సాంఘికమైన ఇనుపతెర తన ప్రాచీన సౌధపు రాతిగోడలకంటే అభేద్యంగా కనుపించింది వంగీయునికి.

తాను ఎంతవాడైనా, బహుమతులు తేరవేసే దానిగా తప్ప, అతిథిగా ఆంగ్లేయుని ఇంటికి వెళ్ళే అవకాశంలేదు. ఏదైనా వ్యవహార కార్యార్థం వాళ్లు వుండే క్లబ్బులలోకి వెళ్లవలసివస్తే నవుకర్లు వెళ్ళే దొడ్డిదరవాజా వెంట వెళ్ళవలసిందేగాని బహిరంగంగా వెళ్లే అవకాశంలేదు. పార్కులు వగైరాలలో వాళ్ళకు ప్రత్యేకించిన ప్రాంతాలలోకి తప్పైతేని పొరపాటునైనా కాలుపెట్టగూడదు. వాళ్లు భోజనం చేసే హోటళ్లలోకి వెళ్ళాలంటే, వాళ్ళు వేసుకునే దుస్తులు ఎరువు తెచ్చుకోవాలి, లేకపోతే బయటికి పంపేస్తారు. కాని మెకాలే, ఈ వ్యక్తులు పరిపాలనా నిర్వహణకు అతి ఆవశ్యకమని గ్రహించారు. అందుచేత జాతీయ విద్యా విధానాన్ని బలవంతంగా అణచివేసి ఆంగ్లేయ భాషను ప్రవేశపెట్టారు. ఈ వంగీయులు ఈ ఆంగ్లేయులు ఆశించిన దానికంటే మితిమీరిన తెలివితేటలు చూపించారు. నిరక్షరకుక్షులుగావుండే, వీరిపైన, అధికారం చెలాయించమన్నందే విదేశీయులు వీరిని 'బాబూ' అని పిలవవలసి వచ్చింది. ఆంగ్లేయులకు ఆమాటను ఉచ్చరించటం రానందున కొండముచ్చుఅనే అర్థం వచ్చే ఇంగ్లీషుమాట లాగా (Baboo) ఉచ్చరించేవారు. అలాగౌరవించి చివరికి భారతీయ సైన్యంలో వీరికి ప్రవేశంలేకుండా చేశారు.

అయా కారణాలను అవగతం చేసుకుంటే, గతశతాబ్దాంతానికి సమర్థులైన వంగీయు లందరు రాజకీయ విప్లవవాదులుగా ఎందుకు తయారయ్యారో సులభంగా బోధపడుతుంది. ఇందుకు వంగదేశంలో వున్న వారసత్వశాసనం కూడా చాలా దోహదం చేసింది. తండ్రి ఆస్తి కొడుకు లందరికీ సమానంగా పంచాలని ఈ శాసనం. ఇందుచేత మూడుతరాలకుమించి ఏ కుటుంబంలోనూ డబ్బు నిలిచేది కూడబెట్టటానికి వీలులేదు. పాత కుటుంబాలన్నీ త్వరితగతిని పతనమైపోతున్నయ్. ఏవో వృత్తులు నిర్వహించుకుంటున్న వారికి ప్రాధాన్యత హెచ్చింది. బ్రిటిష్‌వారి దయాదాక్షిణ్యాలతో సంబంధంలేకుండా స్వతంత్రంగా బ్రతికేవారికి గౌరవం హెచ్చింది. వీరిలో చాలామంది న్యాయవాదవృత్తిలో వున్నవారు. మరికొంతమంది డాక్టర్లు. మరికొంతమంది పత్రికా సంపాదకులుగా పైకివచ్చారు. తమవిజయం తమస్వయం శక్తిమీద ఆధారపడివుందని కుటుంబ గౌరవాలు ఇటుపైని రంజించవనీ తెలుసుకున్నారు. అందుచేత తమవృత్తులను అత్యంతశ్రద్ధతో నిర్వహించేవారు. వీరిలో చాలామంది విదేశాలకుపోయి తమవృత్తులకు కావలసిన విజ్ఞానాన్నంతా సేకరించి తెచ్చుకునేవారు. తిరిగివస్తూ వాళ్లు రహస్యంగా సేకరించి తెచ్చుకున్న రాజకీయాభిప్రాయాలు విని ఇక్కడి తెలియని అజ్ఞానులు కొందరు నవ్వుకున్నా, అనంతరదశలో వాళ్లు యూరపియనులతో పాటు తమకుకూడా సమాన ప్రతిపత్తి వుండితీరాలని బహిరంగంగా ప్రకటించటంతో వాళ్లను జాతీయవీరులుగా ఆరాధించారు.

ఆటవిక ధోరణిలో కిప్లింగ్ ఎడాపెడా విసురుతూవుండే అపహాస్యాన్ని అవగతం చేసుకుంటే, అతనికీ అతనిజాతికీ ఆంగ్లవిద్యలో ఆరితేరిన ఈ వంగ ప్రముఖులంటే ఎంత మంటగా వుండేదో తెలుస్తుంది. నిజంగా ఒకొక్కప్పుడు ఈ పెద్దల ధోరణులను సహించటం కష్టంగానే వుండేది. తమ వృత్తుల్లో

చిరకాలంపనిచేసి పెద్దవాళ్లయిన తరువాతకూడా, విశ్రాంతిసమయాల్లో కూర్చుని, చిన్నతనంలో తాము ఆక్స్‌ఫర్డులోనూ, కేంబ్రిడ్జిలోనూ, లండన్‌లోనూ, ఎడింబరోలోనూ వుండగా వెలగబెట్టిన విలాసవిభ్రమాలనుగురించి బహిరంగంగా కబుర్లుకొట్టేవారు. ఏ ప్రధాన న్యాయాధిపతి ఉద్యోగమో చేస్తున్న బ్రిటిష్ అధికారి యెవరైనా తన ఉదారహృదయాన్ని వ్యక్తీకరించటానికి మా క్లబ్బులో చేరతావని వర్తమానంచేస్తే 'బెంగాల్ క్లబ్బుల్' లో ప్రముఖుడైన వంగ న్యాయవాది యెవరైనా చేర్చుకున్న అనంతరం చేరుదువుగాని, అందాకా ఆగమని తక్షణ సమాధానంగా వర్తమానం అందజేసేవారు. పెద్దపెద్ద శాలాటి ఫ్రాకుకోటు తొడుక్కుని బ్రిటిష్‌వాళ్లను తలదన్నిన బ్రిటిష్‌వాళ్లుగా దర్జాగా సభలూ సమావేశాలలో ఉపన్యాసాలిస్తూ యావత్తు భారతదేశానికీ స్వయంపరిపాలనాధికారం కావాలంటూ వార్షిక తీర్మానాలు చేస్తూవుండేవారు. ఈ దేశభక్తుల తీర్మానాలు మృదుమధురమైన ఆంగ్లభాషలో వుండేవి. అప్పటికే ఈరకం మనుష్యులు దేశం నలుమూలలా వెలిశారు దేశంలో చదువుకున్న వాళ్ళంతా వాళ్ళకు మద్దతు చేశారు. మేరుమందర ధీరుడని ఖ్యాతికెక్కిన కర్జన్‌కు సహితం ఈ పరిణామం మూసికంగారు పుట్టింది.

## V

అతనికి ఎంత అక్కసు లేకపోతే, కలకత్తా విశ్వవిద్యాలయం ఛాన్సలర్ గావుండి, తన అధికారాన్ని దుర్వినియోగం చేస్తూ, వంగజాతి సౌశీల్యాన్ని విమర్శిస్తూ అలా చెడామడా మాట్లాడుతాడు? ఇంతకు ఒక దశాబ్దం పూర్వంనించే హైందవ విజ్ఞానవేత్తలను పురుగులక్రిందమాట్లాడటం బ్రిటిష్ అధికారులు నేర్చుకున్నారు. వంగీయులలో హైందవులు 'జాట్ అటవికజాతినుంచి ఉద్భవించినవారు; మహమ్మదీయులు 'అనాగరికులైన పఠానువంశీయులు'. ఈమహమ్మదీయులంటే పూర్వపరిపాలకవంశంగా వారిమీదఆంగ్లేయులకు మొదటినుంచీ గుర్రుగా నేవుండేది. సైనికవిప్లవంయొక్క మహదాశయం మొగలు సామ్రాజ్య పునరుద్ధరణ అని బహిరంగంగా ప్రకటింపబడటంతో ఈ విషవాతావరణం వీరి స్థితిగతులు మరింత దుర్భరమై పోయినాయి. వీళ్ళు కూడా యీ నూతన్నాధికారం పట్ల గుర్రుగానే వుండేవారు. కాని కొంతకాలానికి పరిపాలనాధికారంలో వాళ్ళకి స్థానం లభింపజేయటంతో తమ పూర్వ వైభవాన్ని పునరుద్ధరించుకోవచ్చునని సంతృప్తి వారికి కలిగింది. నవీన విజ్ఞానాన్ని సేకరించుకుని చెడిపోకుండా వుండటమే ప్రధాన యోగ్యతగా పరిగణించి బ్రిటిష్‌వాళ్ళు వీళ్ళను ప్రోత్సహించేవాళ్ళు. అయినా ఒకరిద్దరు ఎవరేనా తమ హైందవ సోదరులను అనుకరించి చెడిపోయినా వాళ్ళకి కూడా అవకాశమిచ్చి మంచి చెడ్డలు తెలుసుకోమనే వారు.

ఈలోగా హైందవులు—ఆధ్యాత్మికవాదులు గాని ఆధిభౌతికవాదులు గాని—ఈ నిరంకుశ ప్రభుత్వాన్ని నిరసించుతూ వచ్చారు. భారత జాతీయ పునరుద్ధరణ అంటూ కలలు గంటూవున్నారు అందుచేత కర్జన్ అనంతరం వచ్చిన గవర్నర్ జనరల్ "విభజించి పాలించాలి" అనే పరిపాలనాసూత్రాన్ని బహిరంగంగా ప్రకటించాడు. అదృష్టవశాత్తూ కలకత్తాలో ముస్లిములు అల్పసంఖ్యాకవర్గం. ఒకచెంప ఇస్లాంమతోద్ధారకుడుగా వ్యవహరించుకుతూ దాని మహావైభవాన్ని యావద్భారతంలోనూ పునరుద్ధరించాలని షేక్ మహాశయుడు అలీఘర్ లో ప్రచారం చేస్తూవుండగా రాష్ట్రంలో అల్పసంఖ్యాక వర్గంగా వున్న ముస్లిములను ఒక ప్రాంతంలో అధికసంఖ్యాకవర్గంగా తయారుచేసి అరాచకాన్నీ, అనైక్యతనూ వ్యాపింప జేయటానికి వంగరాష్ట్ర విభజనకు పూనుకున్నారు. కాని ఇది రంజించలేదు. ఆదిలో ముస్లిములు ఎంతోమంది దౌర్జన్యవాదులైన హైందవ విప్లవకారులతో చేతులు కలపకపోయినా అనంతరం వారు చెరిపిన వీరకృత్యాలకు అబ్బురపడి, వారితోపాటు ఉత్సాహభరితులై ముందుకు దూకారు. దాంతో బ్రిటిష్ వారి పథకం తల్లక్రిందులై పోయింది. వంగరాష్ట్రం తిరిగి ఒకే ఖండంగా కలిసిపోయింది. [సశేషం]



# ధర్మభ్రష్టుడు

## శ్రీ చోడవరపు రామశేషయ్య

I

### హైస్కూలు. స్కూలు ఫైనలు క్లాసు

గోపాలం : ఒరేయ్, మోహన్! మనూళ్ళో ఒక పోస్టాఫీసుంది; ఎట్లా చెప్పాలా అని ఆలోచిస్తూ వుండేవాణ్ణి

మోహన్ : ఏం? గోపాలం; ఇంతాలోచనలో పడ్డావా!

గో : అనే నే చెప్పేది; కాని ఆ లోటు మన శంకరం తీర్చాడురా. (పిల్లల నవ్వు)

శంకరం : (అభిమానంతో) నీవు వ్రాసే ఉత్తరాలకు... అంతేగా గోపాలం?

మో : ఒరేయ్! చింత చచ్చినా పులుపు చావలేదురా!! హా...హా హా

గో : వాళ్ళ నాన్న సత్యహరిశ్చంద్రుడోయ్. (పిల్లలందరు గొల్లున నవ్వుతారు.)

మో : ఒరేయ్, గోపాలం వీ డద్భుతంగా లోహితాస్యుడుగా తయారైనాడురా.

నారాయణం : తండ్రి, కొడుకులు ఆదర్శ పురుషులోయ్.

గో : ఆదర్శం అతుకుల బొంతలో ఉంటుందిరా? నారాయణం.

మో : ఉంది కాబట్టే జమీందారు గారిని త్రోసి రాజన్నాడురా; వాళ్ళ నాన్న.

శం : మీ రనేది ఏమిటో నన్ననండోయ్. మా నాన్నగారి మాటెందుకు?

గో : మీ నాన్నగారి మాట మా నాన్నగారు చెప్పితేనే మాకు తెలిసిందోయ్.

శం : (క్రోధతో) అట్లాగా.

నా : ఒరేయ్, హెడ్మాస్టారురా!

మో : ఇహ ముయ్యరా, శంకరం పోస్టాఫీసులు. (పిల్లలందరు గొల్లున నవ్వుతారు.)

[హెడ్మాస్టరు త్వరగా ప్రవేశించి]

హె : ఏమిటీ అల్లరి? (అందరు నిశ్శబ్దంగా నిలబడుతారు) గోపాలం! నీవు మా చేటరుకు పనికిరావు.

గో : ఆదర్శ పురుషులకు అతుకులబొంత గతిఅయిందని అందరు నవ్వుతున్నారండి.

హె : ఎవరా ఆదర్శ పురుషుడు?

మో : శంకరమండీ.

హె : (కోపంతో) ఛీ, నోరుముయ్.

మో : మా కిదంతా గోపాలమే చెప్పాడండీ.

గో : నేనట్రా!

హె : (వినిపించుకోకుండా) శంకరం!...చాలా విచారకరమైన సంగతి...సరే, కాని నీవు క్రిందటి నెల జీతం కట్టలేదూ?

శం : (సిగ్గుపడుతూ) లే...దం...డి

హె : పాపం...సరే, పుస్తకాలు తీసికో...

[శంకరం బిక్కచచ్చి క్లాసులోంచి వెళ్లుతాడు-తెర]

II

"జగమేలె పరమాత్మ ఎవరితో మొరలిడుదు!
వగబూన దాళజాల నన్నేలుకోరా
॥నీ నగుమోము॥

పార్వతి: మాస్టరు గారూ! వసుమతి గాత్రమో లేక మీ జంత్రి మహిమో! చేస్తూ చేస్తున్న పని వదిలిపెట్టి పరుగెత్తుకొని వచ్చాను.

సంగీతం మాస్టరు : అమ్మా, వసుమతిగాత్రం సువర్షించింది.

పా : మరి మీవాయులీన మందమారుత వీచికలో!

సం. మా: అది మీ సంగీత పరిజ్ఞాన విశేషం.

పా: మీ ఈ ప్రశంసకు నేతగను.

సం. మా: మీకు చాలా కృతులు కంఠోపాఠమని వసుమతి చెబుతూ వుంటుంది.

పా: వసుమతి కిప్పటికెన్ని కృతులు నేర్పారు?

సం. మా: దాదాపు వాడుకలోవున్న కృతులన్నీ వచ్చాయి.

పా: మీ శుశ్రూష చేయడం నిజంగా మా అమ్మాయి అదృష్టం.

సం. మా: బంగారం మంచిదైనప్పుడే గీటురాయి రాణిస్తుంది. నా శిష్యులలో ఈ మనోహర గాత్రం, ఈ రాగ ప్రస్తారనైపుణిగలవారు లేరనే చెప్పాలి.

పా: మీ ఆశీర్వాదం. పంతులుగారు మీ కమాను పోక పిలకు మురుస్తుంటారు.

సం. మా: సహృదయులు...వారి దర్శనమై చాలరోజులయింది.

పా: ఊళ్ళోనే ఉన్నారు. ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నారు.

సం. మా: నేటి సంఘంలో సత్యానికి స్థానం లేదేమో అని, అనిపిస్తోంది. పంతులుగారు తమ నిజాయితీకి తమ ఉద్యోగాన్ని బలిచ్చారు.

పా: ఇది మా దురదృష్టం. ఆ లక్షాధికారికి అనుకూలంగా అన్నీ చేసి వుంటే ఈ వేళ మాకీ తిప్పలు వచ్చివుండేవి కావు.

సం. మా: పంతులుగారిలో ఈషన్మాత్రం దోషం లేదని తెలిసికూడా అధికార్లు వారి కన్యాయం చేయడం మరీ ఆశ్చర్యంగా వుంది.

పా: నిర్దోషు పాలిట కల్పతరువు ఆ ఈశ్వరుడే ఉన్నాడు.

వసుమతి: అమ్మా! నాన్నగారు మాస్టరుగారికి జీతమిచ్చి ఆరు నెలలయిందట.

పా: (ఆశ్చర్యం) ఏమిటీ! మాస్టారూ!! ఆరు నెలలే!!!

సం. మా: అవునండమ్మా పంతులుగారిబ్బందిలో ఉన్నారుగదా అని అడగలేకున్నాను.

పా: రేపు ఇస్తారు లెండి...అమ్మడూ! ఇంతకాలం నీ గురుసేవ ఇదేనా?

వసు: నాన్నగారు జీతం ఇవ్వటంలేదని ఇంతకుముందే చెప్పారు, మాస్టారు.

పా: వారివద్ద ఓర్పుకూడా నేర్చుకో. (శంకరం వచ్చి పుస్తకాలు విసిరి కొడ్తాడు)

పా: (తీవ్రంగా) ఏమిటిరా, ఆ విసురు? శంకరం!

శం: విసురా? ఇంకా నయం, ఈ పుస్తకాలు ఇంటికి చేరాయ్.

పా: సరే, మాస్టారు! పంతులుగారితో చెబుతాను.

సం. మా: సరేనమ్మా; వెళ్ళొస్తాను. (నిష్క్రమణ)

పా: పెద్ద మనుష్యుల ముందా నీ ప్రతాపం?

శం: అయితే ఏమంటావ్?

పా: ఏమనేది ఏమిట్రా? నీ చదువింత చక్కగా ఉంది.

శం: చదువు దోషమేముందమ్మా?

పా: మరి నీపని ఏమిటి?

శం: అవునమ్మా, నే చేసినపని నీకు బాగుండలేదు; కాని ఆ వెధవలు నా చినిగినబట్టలు చూచి నవ్వుతే నీకు మర్యాదగా వుందనుకొంటాను.

పా: (క్రోధ, అభిమానంతో) ఏమిటీ!

శం: ఏమిటేమిటమ్మా? అందరు నా చింకిబట్టలు చూచి నవ్వారు.

పా: ఆఁ, నవ్వడమే!

శం: ఆ అవమానం నే భరించగలనా, అమ్మా?

పా: ఒరేయ్, ముందు ఈ చెవుల పోగు అమ్మి బట్టలు కుట్టించుకోరా; వెళ్ళు, ముందు వెళ్ళు.

వ: అదేమిటమ్మా! అవి కూడా అమ్మేస్తే నీ కింకా ఏమున్నాయ్?

శం: అమ్మా, దుద్దులమ్మి బట్టలు కుట్టిస్తావు; సరే, మరి జీతాలో?

పా: (ఆశ్చర్యం) జీతాలా! జీతాలేమిటి?

శం: క్రిందటి నెల జీతం కట్టలేదని బయటకు గెంటివేశారు.

పా: గెంటివేయడమే!

వ: నాన్నగారినైనా చూడకుండా ఇంతపని చేసారా? అన్యాయ్య!

శం: ఓహో! నాన్నగారినా? నాన్నగారిప్పుడు పంతులుగారు కారు; వసూ!

పా: మన ఆ హెడ్మాస్టరేనా నిన్ను బయటకు గెంటించింది?

శం: వారు మాత్రమేం చేస్తారు? అమ్మా, నియమం అందరికీ ఒకటే గదా?

వ: అయితే పెద్దన్నయ్యను కూడా పంపివేశారా?

శం: నే నసలు తలఎత్తితే గదా, అన్నయ్యసంగతి కను క్కోడానికి?

పా: మీ నాన్నగారిని మీరు జీతాలడగలేదా?

శం: ఎందుకడగలేదు? ...వారే కట్టుతామన్నారు.

పా: కడుతామని కూడా కట్టలేదా?

శం: అసలు డబ్బుంటే గదా, కట్టడానికి?

వ: మీరుచాలక నేనుకూడా ఒకబరువుని తయా రయ్యాను.

పా: (వినిపించుకోకుండా) ఒరేయ్, శంకరం; ముందు నీ ఈ దుద్దులు అమ్మి డబ్బు తీసుకురా.

[రాముడు నెమ్మదిగా వస్తాడు.]

శం: దుద్దు లమ్మితే సరిపోతుందా? అమ్మా.

రా: దుద్దు లమ్మడ మేమిటి? అమ్మా.

పా: మీ జీతాలు కటడానికి.

రా: నా జీతం ప్రిన్సిపాలుగారు కట్టారు.

శం: ఛీ, ప్రిన్సిపాలుగారిని ముష్టి ఎత్తావా?

వ: అదేమిటి చిన్నన్నయ్యా; అట్లా అంటావ్?

శం: వారిసొమ్మమాత్రం అన్నయ్య ఎందుకు పుచ్చు కోవాలి?

పా: పుచ్చుకోపోతే ఏం చేస్తాడు? చదువు పోతుంది గదా.

శం: ఏం, పోతే నేం? ఎందుకొచ్చిన చదువు? ఇంత చదువుకొన్న నాన్నగారు...

రా: వారి చదువు వారి నేం చెయ్యలే; జమీందారు చేసినదానికి చదువునంటావేం?

వ: తన కవమానం జరిగిందని ఉక్రోషం పట్టలేక అంటున్నాడు లే; అన్నయ్యా.

శం: నా అవమానంతో మీకు సంబంధం లేదా? వనూ!

పా: వాళ్ళకు కాదు; తల్లిదండ్రులమైన మాకుంది సంబంధం.

శం: అయితే వీళ్ళకు నే నేమి కానా?

రా: శంకరం! అమ్మని బాధపెడుతున్నావు.

పా: మీబాధ మాది కాదుట్రా? రాము.

శం: ఈ బాధకు కారణం?

పా: మా కర్మ.

శం: అమ్మా, కర్మను అడ్డంపెట్టుకొని దుర్మార్గుల అక్రమాన్ని సహించడం కేవలం పిరికితనం.

పా: మా కర్మ బాగుండలేదు కాబట్టే జమీందారుకి మీ నాన్నగారిమీద కోపం వచ్చింది.

శం: అమ్మా, నే నీ కర్మను ఎదిరిస్తాను.

రా: నీవు పొరపాటు పడుతున్నావు.

శం: అన్యాయానికి అడ్డుతగలడం పొరపాటా?

పా: ధనవంతులు చేసేది అన్యాయమని ఎవరనగలరు? శంకరం.

శం: వాళ్ళు చేసేపని అన్యాయమైనప్పుడు కూడా ధైర్యంగా అడ్డుపడలేని ఈ సంఘం మనవంక వ్రేలుపెట్టి చూపడ మెందుకు?

రా: సంఘంమాత్రం ధనవంతుల్ని ఎదిరించగలదా?

శం: ఎదిరించలేనప్పుడు దరిద్రుల్ని అవమానించడ మెందుకు?

పా: సంఘాన్ని కాదని మనం బ్రతకగలమా?

శం: ఇటువంటి పక్షపాతసంఘాన్ని వదులుకోవడమే మంచిది.

రా: అవునమ్మా జమీందారు ఆగ్రహానికి బలియైన నాన్నగారియందు సానుభూతికూడా చూపలేని ఈ సంఘం మనల్ని ఉద్ధరిస్తుందా?

వ: ఉద్ధరించకపోతే విచారంలేదు అన్నయ్యా! నిందించ కుండావుంటే చాలు.

శం: ధనాధికారాలకు దాసోహం అంటున్న సంఘానికి నిందించడ మేపని.

పా: (విసుగా) మీ ముగ్గురికీ మతిపోయిందా ఏమిటి?

శం: మతి మాకు కాదుపోయింది. నీవు పూజించే సంఘా నికి పోయింది.

పా: సంఘాన్ని వదులుకొని ఏంచేయగలంరా?

శం: ఏంచేయ్యలేకపోతే అవమానానికి ఆహుతి అవు దామా?

పా: అంతకంటె చేయకలిగింది ఏముంది?

శం: ప్రతీకారం.

రా: రెక్కలూడలాగిన పక్షి ఎగురుతుందా?

పా: ఒరే, శంకరం; ఏమైనా అఘాయిత్యం తలపెట్టే వురా?

శం: మరి ఈ వంచకబృందాన్ని పూజించమంటావా? ...అమ్మా, నీవు నిజం చెప్పు, నాన్నగారు కడుపు నిండా తిని, కంటినిండా నిద్రపోయి ఎన్ని రోజులైంది?

పా: (మౌనం)

శం: మాట్లాడ వేం? చెప్పు. నాకీవిధంగా కుమిలిపోవల సిందేనా?

పా: ఇది నీపని గాదు. పెద్దవాళ్ళకు వదిలెయ్.

శం : మీ పెద్దవాళ్ళకు ప్రతిపనిలోను కర్మ అడ్డంవస్తుంది గదా!

వ : అమ్మను ఎదిరిస్తావా అన్నయ్యా.

రా : ఒరే శంకరం; ఎందుకొచ్చిన మాటలు. పోయి స్నానంచేయ్.

శం : ఆఁ, అట్లాగే పోతున్నా. మీ అందరికీ భారమై నప్పుడీఇంటిలో వుండను.

పా : (కంగారుపడుతూ) తల్లిదండ్రులకు తమ సంతానం భారమటరా!

శం : ఏమో, నాకు తెలీదు. నా అవమానాన్ని మీరు పంచుకోనలేదు నాకీఇంట్లో తావులేదు.

రా : శంకరం!

శం : అన్నయ్యా, నీవుకూడా రెక్కలులేనిపక్షివే.

పా : అందుకని మా కడుపుని చిచ్చుపెట్టిపోతున్నావురా?

శం : అమ్మా, నేనుండిమాత్రం మీకేమిలాభం? అందుకే వెళ్లుతున్నా.

రా : ఎక్కడకు వెడతాడులేఅమ్మా. నీవు భయపడకు.

పా : వాడిసంగతి నీకు తెలీదురా: ఒరేయ్, శంకరం; నామాట విను.

వ : చిన్నన్నయ్యా! రా! తిరిగిరా! అమ్మ ఏడుస్తోంది.

రా : ఒరేయ్, శంకరం.

శం : మీరు నాకోసం విచారించకండి (వెళ్లును—తెర)

III

* * సాంబయ్యపంతులు మంచంమీద మూలుగుతూ పడుకొని ఉంటాడు.

పా : ఈపూట జ్వరమేమైనా తగ్గిందేమో! చూస్తాను ఉండండి.

సాం : ఎన్నిసార్లు చూస్తావు? నీవింతెందుకు కంగారు పడుతావ్? జబ్బులు మనుష్యులకుగాక మ్రాకులకు వస్తాయా? పార్వతీ.

పా : అవును, కాని మీకీ మనోవ్యాధి ఎందుకండీ?

సాం : మనోవ్యాధేమిటి పార్వతీ? నాపార్వతి నావద్ద ఉండగనే... నేను నీ ఈ పాలిపోయిన శరీరం చూచి బాధపడుతున్నాను కాని నన్ను గురించి కాదు.

పా : నాకేం? నేను బాగానేవున్నా.

సాం : నీవింకా నన్ను మభ్యపెట్టాలని చూస్తున్నావా? పార్వతీ. నేను చిన్నపిల్లవాడినా?

పా : (మౌనం).

సాం : పార్వతీ, నన్ను గురించిగదా, నేను నీకిన్ని బాధలు.

పా : అవేం మాటలండీ! (తల నిమురుతూ) కొంచెం సేపు నిద్రపోండి. తేలికగా వుంటుంది.

సాం : నేను మాట్లాడకుండా పడుకుంటానే అనుకో; కాని ఈ మనసు?

పా : మీ ధైర్యస్థైర్యాలేమైనాయ్.

సాం : అవి నాశంకరంవెంట పోయాయ్.

పా : (ఆవేదన) శంకరమా! వాడెక్కడికి వెళ్లుతాడు? ఏదో చిన్నతనం కాబట్టి కాని.

సాం : తల్లివైన నీవుకూడా అంటేనంటావా?

పా : (మౌనం).

సాం : సరే, కాని; రాము ఇంకా ఎందుకు తిరిగిరాలేదంటావు?

పా : శంకరం కనిపించలేదనుకుంటాను.

సాం : వాడింకా కనిపిస్తాడంటావా?

పా : కనిపించకేమౌతాడు? ఆడపిల్లా? మనం అలమటించడానికి? తిరిగి, తిరిగి వాడే వస్తాడు.

సాం : ఆ అగౌరవం భరించి బ్రతికివున్నప్పుడుగదా?

పా : (ఏడుస్తూ) ఇంతభిమానం కలవాడెందుకు పుట్టాలి?

వసుమతి : (పరుగెత్తుకుంటూవచ్చి) అమ్మా పెద్దన్నయ్య!

సాం : ఆఁ! (మంచంమీదలేచి కూర్చుని) వచ్చాడా? చిన్నన్నయ్య రాలేదూ?

పా : శంకరం జాడ తెలీలేదా రామూ?

[రాముడు ప్రవేశం.]

సాం : అడగటమెందుకు? వాడిమొగమే చెబుతోంది గదా? (మంచంమీద వాలుతాడు.)

వ : అన్నయ్యా, ఈ నెత్తురేమిటి? (కంగారు) చొక్కాఅంతా నెత్తురే నే!

పా : అయ్యో, అయ్యో; ఈ నెత్తురేమిటిరా?

సాం : (కంగారుతో లేచి కూర్చుండి) అయ్యో, తల చిల్లిపడిందేమిరా?

రా : ఏమీ లేదూ, నాన్నా; టికెట్టులేదని స్టేషను రాకముందే బండిలోంచి దూకాను.

సాం : అరి, భగవంతుడా, (తల పట్టుకొని మంచంమీద వాలుతాడు.)

పా : అయ్యో, రామూ! మీ నాన్నగారి తలకు కోడు కొట్టుకుందిరా.

సాం : కొట్టుకోలేదులే...ఏరా! రామూ! అసలు వాడి జాడే తెగలేదా?

రా : వాళ్ళైతే కనిపించలేదు; కాని మిమ్మల్ని ఎరిగిన వాళ్లు కొంతమంది చూచామనే చెప్పారు.

సాం : ఎప్పుడు? ఎక్కడ?

రా : అది మాత్రం నిశ్చయంగా చెప్పలేరు.

సాం : అవన్నీ ఒట్టిమాటలు.

పా : మీ విషయంలో ఎవరబద్ధమాడుతారు?

సాం : (వ్యంగ్యంగా) అవును. ఎవరూ ఆడరు.

రా : అందరు జమీందారు మాదిరే వుంటారా? నాన్నా?

సాం : ఛీ, ఛీ; వాడిమాటెందుకు ఎత్తావురా?
(పోస్టుమాన్ కేక వేస్తాడు).

పా : ఎవరో చూడు, రామా!

రా : (చూచి) పోస్టుమాన్, అమ్మా.)

సాం : శంకరం ఉత్తరం వ్రాశాడా?

పో : లేదు, సార్; వసుమతి గారి పేర రిజిస్టరుఉంది.

పా : వసుమతికా?

సాం : శంకరం పంపివాడు గావును.

పో : కాదు, సార్; రేడియోవారు పంపారండి.

పా : రేడియో వారా!

పో : అవునండీ, అమ్మగారు.

రా : నీవేమైనా ప్రోగ్రామిచ్చావా? వసూ. చెప్పు కాబోలు.

వ : అవునన్నయ్యా; మాష్టారు గారికి జీతం...

సాం : (గద్గదంగా) అమ్మా...వసూ!...

వ : (ఆత్రంగా) అమ్మా! చిన్నన్నయ్య!!

అందరు: ఆఁ!

సాం : ఏడీ? వాడేడీ?

పా : అడుగో, గోడప్రక్కన నుంచున్నాడు.

సాం రా! నాయనా! శంకరం!

వ : రా! అన్నయ్యా! నీకోసం తిరిగి తిరిగి పెద్దన్నయ్య...

శం : (ముందుకొచ్చి) నాకోసం తిరగడమెందుకు?

రా : పిచ్చిప్రీతి.

పా : కోప్పడకురా, వాణ్ణి.

రా : కోప్పడి వద్దంటున్నావా? అమ్మా! నాన్న గారిని మంచం పట్టించినవాణ్ణి గౌరవించాలంటావా?

సాం : కాదురా, రాము! వాణ్ణీస్థితిలోకి తెచ్చింది నేనురా.

వ : అచంకలో మూటేమిటి? చిన్నన్నయ్యా?

శం : మన గౌరవాన్ని రూపుమాపిన డబ్బు.

రా : (ఆశ్చర్యం) డబ్బా! ఎక్కడిది!!

శం : ఎక్కడిదేమిటి? ఉందే.

పా : మవదా! ఇంతడబ్బా!!

శం : ఇంకో నయం. జమీందారుకు కొంత అట్టే పెట్టాను.

రా : (కోపం) దొంగిలించావుట్రా!

పా : నా కడుపు చెడబుట్టావురా.

వసు : ఛీ, ఇదేనా నీ అభిమానం?

సాం : (మంచంమీదనుంచి లేచి కోపంతో వణుకుతూ) జమీందారు ఇంటికి కన్నం వేశావురా? దీనికి నీ తండ్రి సంతోషిస్తా డను కొన్నావా? నీవు నాకొడుకు వేనా? ఛీ! పో! నీ మొగం చూడకూడదు. (అరుపు) పో! ముందు నాఇంట్లోంచి పో! కదలవేం?

శం : నాన్నా!

సాం : ఛీ! నోరుముయ్! నాన్నా అని పిలవడానికి నీకు నోరెట్లా వచ్చిందిరా? (జుట్టు పీక్కుంటూ) ఈ వయస్సులో నీవు నా మొగాన్ని ఉమ్మి వేయించడానికి పూనుకొన్నావా? నా పరువు ప్రతిష్ఠలకు చిచ్చుపెట్టావుటరా? నేను బ్రతికి ఉండగానే ఇంతపని చేశావా! ముందు నాబుర్ర రామకీర్తిపాడి అప్పుడు మూట విప్పు. నీకు డబ్బే ప్రధానమైందిరా? నీ తండ్రి మాన మర్యాదలు మంటలో కలపడానికి ఇంట్లోంచి పారిపోయావా? చచ్చిపోయా వనుకొన్నా—చచ్చిపోతే ఎంతబాగుండేది! (పట్టలేని కోపం) తీసుకురా! బండ తీసికురా. వాడి తల పగలకొట్టి నేను పగలకొట్టు కొంటాను......ఏం? అట్లా చూస్తావేం? కొడుకు చేసిన పనికి సంతోషిస్తున్నావా? మీరందరు ఒకటైనారా? ఛీ! పోండి. నేనీ ఇంట్లో నే వుండను. (వళ్ళుతోయి తడబడి క్రిందపడతాడు).

పా : అయ్యో, అయ్యో!

రా : పట్టరా, శంకరం! మంచంమీద పడుకో పెడదాం.

శం : ధర్మభ్రష్టుణ్ణి నన్నాయనను ముట్టుకో మంటావా అన్నయ్యా!

రా : (తెల్లబోయి తమ్ముడివంక చూస్తాడు).

పా : (తేరిపారచూచి) అయ్యో! (మూర్ఛ).

వసుమతి : నాన్నా, నాన్నా (ఏడుపు).

[తెర]

# యాజ్ఞవల్క్యము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

గురువయి యాజ్ఞవల్క్యుఁ డనుకూల విధంబున జ్ఞానమార్గముం
గఱపుచు నైహికంబులు సుఖంబులు దక్కఁ జరించెఁ బూర్వ; మ
త్తఱి జనకర్షి వానికడఁ దానును జేరి యమూల్యగోష్ఠిలోఁ
జొరఁబడియుండుఁ దత్త్వ పరిశోధన సేయు జిఘృక్షఁ బేరిమిన్.

మునివరు లెందఱో యొకసమూహముగా నటఁ జేరి తత్త్వ దృ
ష్టిని గుఱుతించి మోక్షపదసిద్ధికి నువ్విళు లూరుచుందు; రా
జనకుఁడు మాత్రమే తగినపాత్రుఁడుగా నుపదేష్టగాఁ దలం
పను దగియుండె; దానిని మనంబున నాగురువర్యుఁ డెంచియున్.

అనయము గారవించును మహర్షి గ వానిని గాంచి—వాని ద
ర్శనమున మోదమందు ననిశంబును, దత్త్వ విచారదృష్టిలోఁ
బనుపడువానిబుద్ధిపరిపాక మెఱింగియు నబ్బురంపుఁ బెం
పును వెలయించు; నియ్యది యపూర్వముగాఁగఁ దలంతు రెల్లరున్.

ఇతనికి నిట్టిగారవ మదేలొకో! వీఁ డొకఱేఁడు గాన—మా
మతమున వీని కీయఁ దగు మన్నన శాస్త్రము చెప్పలేదె? యా
క్షితి నిటువంటి గారవము చెందుట కెవ్వఁడు తగ్గవాఁ డో! యా
కతల నెఱుంగమే యుగయుగాల చరిత్ర సమీక్ష చేసినన్?

అని పదిమంది కొందలము నంది మనంబులు కుచ్చితంపుఁ ద్రో
వను బరవళ్లు ద్రొక్క యొకవంక మొగంబులు తెలిపోవ నూఁ
పునవిషవహ్ని రేఁగి తలఁపుల్ మొద లంటను రూపుమాసి శాం
తిని హతమార్ప దేబెలయి దిక్కఱి చిక్కుల స్రుక్కి రొక్కటన్

నాఁటికి నాఁటికిన్ మనుజనాథుని మాటకుఁ ప్రాభవంబు బా
హాటముగా వెలార్పఁగ మహర్షియు గోష్ఠియు నిర్వహించు; మా
యాటలు సాగ వేల? జనకర్షికి గౌరవ మేల? యంచు న
ప్పాట నెదిర్పఁగాఁదగు నుపాయముకోసము చూతు రామునుల్.

జనకమహర్షి, యాశ్రమము చాయకు వచ్చిన యాజ్ఞవల్క్యుఁ డే
కని యెదురేఁగి స్వాగతము గక్కునఁ జెప్పియు గారవించి వా
నిని గొనిపోవు; వాని మహనీయునిగా గుఱుతించు, వాఁడు చె
ప్పిన దొకవేదమై పరమ విజ్ఞతఁ గూర్చియు నేర్పు చూపఁగా

అతఁడు రానినాఁడు మును లందఱ కధ్యయనంబు లేదు—కా
ర్యాతురుఁడై యొకప్పుడు రవంతగఁ దాళియు వచ్చెనేని యే
దో తరువాయియే యగు; మహోన్నతుఁ డాతని దివ్యకీర్తి యీ
రీతిగ నెల్లదిక్కులకు రేఁబవళుల్ పెనుపొంది ప్రాఁకినన్.

ఒకతఱి మౌనివర్గ మది యోర్వక సాహసమైన మౌని జం
కక యిది తేల్పఁగావలె ముఖాముఖ గానని యాజ్ఞవల్క్యు వ
ద్దకుఁ జనుదెంచి చిత్తముల దందడిహత్తఁగ—వ్యర్థవాద సూ
చకమగు త్రోవలోఁ దమ విచారము స్పష్టము చేసి రిట్టులన్

అనఘా! నీ కిది న్యాయ మౌ? భువన విఖ్యాతుండవై శాస్త్రవా
దనలన్ బోధనసేయఁగాఁగలిగి విద్యామూర్తివై యాశ్రమం
బున ధర్మవ్యతిరేక మిట్లు కలుగన్ బోనిత్తువే? నీవు చే
సినదానిన్ దెగడంగ నేర్తుమె? పరీక్షింపంగ నిల్లెంతువో?

జనకున కిట్టి ప్రాభవ మొసంగఁ గతంబది యేమి? బ్రహ్మవి
ద్యను గుఱుతింపఁగాఁ దగిన యర్హత వానికి నెట్టు లబ్బె? నీ
మునిజనవర్గమున్ విడిచి ముందుగ వానికె బోధసేయ నౌ
నని తలఁపంగ న్యాయము రవంతయుఁ గన్పడునయ్య యిమ్మెయిన్!

ధనముల్ ధాన్యము లెన్నొ యున్నవని విద్వాంసుండుగా వానిఁ జూ
చిన మే మొప్పఁగలారమే? సతతమిస్సీ! యంచుమేమెంచు శ్రీ

లను ముఖ్యం బని యెంతు వేమొ ? యది యేలా స్పష్టముం జేసి చిం
తను బోకార్చుపస్వామి! సంశయములోనన్ మమ్ము నిట్లుంతువే ?

కలుషిత బుద్ధులై నలుముఖాలఁ బురాకృత కర్మధర్మముల్
దలఁపక స్వేచ్ఛమై నొక విధానఁ జరించు నరేంద్రు లెవ్వరే
నిలఁ దరియింతురే! యెవని కేనియు విత్తము చిత్తశాంతిఁ దేఁ
గలదె మహాత్మ! యందలి వికారముగూర్చి వచింప నేటికిన్ ?

ఇది యొక బ్రహ్మవిద్య : ధరణీశ్వరు లెట్టులు దీని నేర్వఁగాఁ
గుదురును ? బైగ—నీమునులకుం గల 'బాధ్యత' త్రోసిరాజు చే
సెదవు మహాత్మ! దీనిఁ బరిశీలన చేసి సహింపలేక త
ప్పిదమని యెంచి నీకు వినిపింపఁగ వచ్చితిమయ్య యిచ్చటన్

పాలును నీరు మిశ్రమగు పద్ధతి నేయఁగ నేల? రాజు లే
లీలఁ బరీక్ష చేసినఁ జలింపకమానరు; వారిభోగముల్
మేలగు త్రోవ లెన్నొ వినమే కలకాలమునుండి? దీని నీ
వేల గణింపవయ్య? భరియింతుమె యిట్టి పరాభవంబులన్ ?

ఆకు లలంబు లేటి పరమాన్నముగాఁ దిని యెండవానలం
దాకులపాటు నొందక నిరంతరతత్త్వ విచారదృష్టియే
సోఁకెడి యాతపోధనుల చూడ్కికి రాజులవైభవంబు లే
లా కనిపించు? నీశ్వర విలాసము ముందవి లెక్కలోనివే!

సిరులకు—మోక్షమార్గముల చిక్కుల 'కంటును సొంటు'ఁ బాయఁగాఁ
దర మగునా ప్రపంచమున ధాతకు నైతము? దానిమాట నీ
వరయక లేనిపోనిది మహర్షిగ వానికిఁ బేరువెట్టి యా
దరమున నింత చేసితివి; దానికె క్రుళ్లెదమయ్య పెల్లుగా.

ఇఁక క్షణ మేని యాతని సహింపము—మాతుదిమాట నీకుఁ జె
ప్పక కికురింపఁబోల దని వచ్చితిమయ్య మహర్షివర్య! యే
మొకమున రాచవాని మునిముందుగఁ జేరిచి బహ్మవిద్యఁ బూ
నికఁ గఱపంగఁబూనెదొ? మనీషివి నీకిటు విన్నవింతుమా!

అని యొకచిత్రమై హృదయ మత్తఱిఁ జూఁడెడి క్రొత్తవాలకం
బును గని యాజ్ఞవల్క్యుఁడు, నృపున్ జనకర్షిని మందబుద్ధు లి
ట్లని తెగడంగఁ జూని రకటా! యిది యిట్లగు నంచు నెంచనై
తినిగద! పోని—వీరి కుతిఁ దీర్చెదఁ జూచెద భావివైఖరిన్

ఇన్నివిధాల నీచదువు లెన్నొ శ్రమంపడి నేర్చియున్న నే
నెన్నఁగ దోషినైతిని బళే! యిఁక జాతికి జ్ఞానభిక్ష య
భ్యున్నత రీతిగా నొసఁగు నుత్తమ దివ్యనరేంద్రుఁ గూర్చియే
మన్నను నాల్కతున్కలయి యూఱడి క్రుంగఁగఁ జేయదో భువిన్ ?

అని హృదయవ్యథం బొగిలి యప్పటి కూఱట నంది వారి బు
ద్ధిని మొదలంట మార్చను మదిం దలపెట్టియు దూరదృష్టి మైఁ
గని యిటువల్కె!—మీకిఁక 'ముఖాముఖ' నందియ మెల్లఁదీర్చఁ జా
లను మఱి—దానికిం దగు వలంతి ప్రయత్నము చేసి చూచెదన్

నాలుగునాళ్లు సైఁపుఁ డనినన్ విని యెల్లరు నవ్వి వల్లెయం
చేలిద మైన చూపు లొలయించి యథావిధిఁ బాహ్య భాగముల్
లీలఁగ సాగిపోవఁగ—మలీమసబుద్ధులు నాఁడునాఁడు మైఁ
దూలుచుఁ గ్రోధిసూపఁగఁ గుదుల్‌వడఁ జేయఁగ నుండి రమ్మెయిన్.

సశేషము



# ఆనవాలు

శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రి

ప్లాట్‌ఫారమ్ అదిరిపోయేలా ధ్వనిచేసుకుంటూ వచ్చి చటుక్కున ఆగి వూరుకుంది గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ వరంగల్ స్టేషన్లో. సెకండ్ క్లాసు కంపార్టుమెంటులో పురుషులందరూ దిగేవరకు కూర్చుని తను .రి చివరి సీటునుండి లేచి నిలబడి ముందుకు సాగిపోతూండగా కాలికి ఏదో తగిలినట్లుగా వుండి క్రిందకు ఒంగిచూసింది డాక్టర్ లలితాదేవి. నల్లగా మెరుస్తూ అందమైన ఒక చిన్న లెదర్ బేగ్ క్రిందపడివుంది. 'అయ్యో! ఎవరో మర్చిపోయారు పాపం!' అని అనుకుంటూ చేత్తో పట్టుకుని ప్లాట్‌ఫారమ్ మీదకు దిగి నిలబడి అయిదారు నిమిషాలపాటు వేచి చూసింది దాని యజమాను లెవరైనా వెతుక్కోవడానికి వస్తారేమోనని. కాని ఎంతసేపు చూచినా ఎవరూ రాలేదు. దానిని తన మందులపెట్టెలో పెట్టుకుని ముందుకు నడిచింది.

ఇంటికి వెళ్ళి భోజనం చేసుకుని కాసేపు బడలిక తీర్చుకున్న తర్వాత ఆమెకు ఆ లెదర్ బేగ్ మాట జ్ఞాపకం వచ్చింది. వెంటనే మంచంమీదనుంచి ఒళ్ళు విరుచుకుంటూ లేచివెళ్లి మేజాబల్లపైనగల మందుల పెట్టెలోని లెదర్ బేగ్ తీసుకుని మళ్ళా మంచంపై ఆసీనురాలై దానిని చిన్నగా తెరిచిచూచింది. అందులో ఒక చిన్నఫోటో వున్నది. అంతకంటే వస్తువాహనాలేవీ అందులో లేవు. ఎంతోసేపు స్మృతిపథానికి పని కల్పించకుండానే ఆ ఫోటోలోని రూపాన్ని ఆమె తేలికగానే స్మరింపగలిగింది. అది తన బాల్యస్నేహితురాలు సుమిత్రయొక్క ఫోటో! ఫోటో వెనకప్రక్కన రెండు జాజిపువ్వులు అంటుకుని వున్నాయి. ఈ ఫోటో యింత భద్రంగా యీ అందమైన లెదర్ బేగ్‌లో కూర్చుని పూజానివేదనల్ని పొందుతూ అత్యంత ఆప్తంగా చూడబడటానికి కారణమేమిటి? ఒకవేళ యీ ఫోటో పోగొట్టుకున్నవాడు ఆమె భర్తే అయి వుంటాడని అనుకోటానికైనా ఎప్పుడూ ఎరుగా వుండే భార్యను చిత్రపటాలద్వారా కూడా యింత గొప్పగా ఆరాధిస్తూ వాటిని రెలు ప్రయాణాలలో కూడా మోసుకుని పోగలిగినంత మమతలతో పెనవేసుకునే జీవి మగజాతిలో మచ్చుకైనా కన్పించ గలడా? అసలు యీ ఫోటో యింత ఉన్నత స్థానము పొందుటకు గల కారణమేమిటి? ఈ సందేహాలకు తగిన జవాబులు మనసులో ఎంత తరచి చూచినా ఆమెకు లభించినవి కావు. కాని సుమిత్ర జీవితకావ్యమున ఏదో ఒకపుటలో స్వర్ణాక్షరములతో లిఖింపదగిన ముఖ్య వృత్తాంతం యిందు ఇమిడివుండ వచ్చునని నిర్ధారణకిమటుకు రాగలిగింది!

అసలు ఆమె సుమిత్రను చూచి కనీసం ఇరవై వసంతాలైనా దాటి వుండవచ్చు. ఈ సంగతి ఎప్పుడో ఏవేవో గత స్మృతులను మనసులో తిరగవేసుకుంటూండగా ఆ కోమల కంఠస్వరం సుర్తుకు తలిగి, తను ఇఱువుర్చీ బాగా ఎరిగివున్న ఒకరికి సుమిత్ర యొక్క అంతుపొంతులను తెలుపవల్సిందిగా కోరుతూ లేఖ వ్రాసింది. ఎంతోకాలము పట్టకుండానే వారినుండి జవాబు వచ్చింది. సుమిత్ర యొక్క తల్లిదండ్రులు ఎన్నడో కాలంచేశారనీ, ఆ వెంటనే ఆమె అన్నదమ్ములు మద్రాసులో తమకుగల ఆస్తిపాస్తులన్నిటినీ అమ్మివేసుకుని పోయారనీ, ఇక పోతే సుమిత్రభర్త చాలా దూర దేశంలో కొంచెం నుంచి ఉద్యోగంలోనే వున్నట్లు కొంత కాలంక్రితం ఎవరివల్లనో వినటంతప్ప అంతకుమించిన సమాచారం సుమిత్రనుగూర్చితను కేమీ తెలియదని తెలియజేశారు.

ఒకవారం రోజులు గడిచిన తరువాత ఒకనాడు లలితాదేవి దిన పత్రిక చూస్తూండగా అందులో యీ క్రింది విధంగా ఒక ప్రకటన కన్పించింది.

"లెదర్ బేగ్ పోయింది.

ఈ నెల 16 వ తేది ఉదయం నేను గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణము సల్పుతూండగా

సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్‌లో పక్క బేబునుండి ఒక లెదర్ బేగ్ జారిపోయింది. ఆ బేగ్ దొరికినవారు అందు తమకు అక్కరపడు వస్తువులేవీ లేవనే తెల్సుకుని వుంటారు. అందులోవున్న ఆ ఒక్క వస్తువూ ఎవరికీ ఏ విధంగానూ పనికి వచ్చేదికాదు. కనుక ప్రస్తుతం బేగ్ స్వాధీనంలో వుంచుకున్నవారు దానిని నాకు అందజేసి నేను ఇవ్వదలచుకున్న ఏడునూర్ల రూపాయల పారితోషికము పొందుదురుగాక". ఈ ప్రకటన కర్త తన స్వస్థలం నెల్లూరుగా పేర్కొంటూ తన ఫోన్ నంబరు మాత్రము యిచ్చి వూరుకున్నాడు. సంతకం 'సుహాజ' అని వున్నది. ఈ విషయమును గూర్చే ఆలోచిస్తూండగా ఆమె వద్దకు వైద్య సంబంధముకు సలహాకొరకు ఒక దీర్ఘరోగి వచ్చాడు. అతడు లలితాదేవితో తన అనారోగ్యమును గూర్చి అంతా విన్నవించుకున్న తదుపరి ఏదో మాటా మంచీ మాట్లాడుతూ తన చేతిలోని భగవద్గీత పుస్తకాన్ని చూపించి 'డాక్టరుగారూ? పాపం! యీ పుస్తకం ఎవరిదో? ఏమిటో? దీని మీద ఆడవాళ్ళ పేరేదో వున్నది......ఏకాదశాధ్యాయం గల పేజీలలో మొగవాళ్ళ దెవరిదో ఫోటో వున్నది......అని అంటూ ఆ గ్రంథాన్ని ఆమె చేతిలో వుంచాడు. ఆ గ్రంథం తెరిచి చూడగానే మొదటి పేజీలో పెద్ద అక్షరాల్లో 'సుమిత్ర' అని పేరు కన్పించింది. ఇక ఏకాదశాధ్యాయంలో వున్న ఆఫోటో తీసి చూసింది. అది సుందరుడైన ఒక పురుషవ్యక్తి ఫోటో. వంకలొంకలు తిరిగిన క్రాఫింగుజుట్టూ, ఎంత కఠిన హృదయున్నయినా నవనీత మొనర్చగల ఆ నవ్వు మొగము- ఫోటో చూడటానికి ఎంతో ముచ్చటగావుంది. ఆ నేత్రాలలో ఏదో విజ్ఞాన స్రవంతి ప్రవహిస్తున్నట్టుగా తోస్తోంది. లలితాదేవి బాగా శ్వాసిస్తూ వేడి నిట్టూర్పు విడిచి యిలా అన్నది. "ఇంతకు ముందువరకు ఒక గడ్డు సమస్య నా మనసును కొరుక్కుని తింటోంది. ఇదికూడా యిప్పుడు కంటపడటంతో అది మరింత దుర్గమంగా తయారైంది. అయితే యీ గ్రంథం మీకు ఎలా లభించిందంటారు?" "ఒకవారం క్రితం నేను మా మేనల్లుడి పెళ్ళికని నెల్లూరు వెళ్ళాను. ఇంత దూరం వచ్చానుకదా అని ఒక ఉదయాన పెన్నానదికి స్నానానికి వెళ్లాను. స్నానంచేసి వస్తూండగా స్నానాలగట్టుకు కొంచెం ఇవతలగా రోడ్డు ప్రక్కనే మట్టి గడ్డలపై యీ పుస్తకం పడివున్నది. ఎవరో మర్చిపోయి వుంటారనే ఉద్దేశంతో వెనక్కు స్నానాలఘట్టంలోకి వెళ్లి అక్కడున్న వారందర్నీ అడిగాను. మాదికాదంటే మాది కాదన్నారు. చివరకు దీన్ని నావెంట తెచ్చుకోక తప్పిందికాదు."

"సరే! యీ గ్రంథాన్ని, యీ ఫోటో నూ నావద్ద కొంతకాలం వుండనీయండి యీ సమస్య విషయమై కొంత పరిశోధన సల్పవలసివుంది."

"అలాగేవుంచి, వాటి సొంతదారులెవరైనా కన్పిస్తే వారి కప్పగించండి."

డాక్టర్ లలితాదేవి అమర్నాటి జనతా ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరి నెల్లూరు వెళ్ళింది. వెళ్ళగానే హోటల్లో ఒకగది తీసుకుంది. భోజనంచేసివాక తీరిగ్గా కూర్చుని దినపత్రికలో చూచిన నంబరు ప్రకారం ఫోన్‌లో పిలిచింది.

"హల్లో! సుహాజీ వున్నారా?

"నే నేనండి. వున్నాను. తమరెవరు?

"నేను వరంగల్‌లో ఒక లేడిడాకర్నండి. ఈ మధ్య ఒక దినపత్రికలో మీ ప్రకటన చూచి మీకు ఒక సంతోషవార్త అందచేద్దామనే కుతూహలంతో బయల్దేరివచ్చాను."

"అట్లానా? చాలా సంతోషమండి. నా జీవిత సుస్వప్నాన్ని ఛిద్రంచేసి నా కందివ్వబోతూన్న మహాదాతలా మీరు? అయితే మీరు ఇప్పుడు ఎక్కడ వున్నారో చెప్పండి. మీకోరకు టాక్సీని పంపిస్తాను."

"హోటల్ బృందావన్‌లోనండి."

"లలితాదేవి తన బసవద్దకు వచ్చి ఆగిన కారులో ఎక్కింది. కారు ఒక పెద్ద పెంకుటిభవంతి ముందు ఆగింది. దానిపై 'బాలబాలికా విద్యాసదనం' అని లిఖింపబడిన ఒకబోర్డు కట్టివుంది. కారులోనుంచి దిగి లోపలకు వెళ్ళబోతూండగా గుమ్మంలోనే సుహాజీ ఎదురై స్వాగతవాక్యాలు పలికి లలితాదేవిని లోపలకు తీసుకొనివెళ్లాడు. గదులన్నీ నిరుపేద బాలబాలికలతో కిటకిటలాడిపోతున్నాయి. మూడు వరండాలు దాటిన పిదప నాలుగో వరండాలోని ఒకవైపునున్న గదిలోకి తీసుకునివెళ్ళాడు. ఆగదిగోడపై 'సుహాజీ గది' అని వ్రాసివుంది. పద్ధతిచూస్తే అది ఆఫీసురూమ్‌గా తోస్తోంది. తాను ఒక పేముకుర్చీలో కూర్చుంటూ

ఆమెకు ఒక అందమైన సోఫా చూపించాడు. గది నాలుగుగోడల్లా వ్రేలాడుతూండిన సుందర చిత్రాలను తిలకిస్తూ సోఫాలో ఆసీనురాలైంది లలితాదేవి.

"సోదరీ! మీ పేరేమో తెల్సుకోవచ్చునా?" అని అడిగాడు సురూజీ, మందస్మితాంకురములైన అధరములను చిన్నగా కదల్చుతూ.

"నా పేరు డాక్టర్ లలితాదేవి అన్నయ్యా" అని వెంటనే ఆమెనుండి జవాబు వెలువడింది. కాని యీ మాట జారిన తరువాత ఆమెకు చాలా విస్మయంకలిగింది. ఈ అజ్ఞాతపురుషుణ్ణి ఇంత అనురాగంగా ఎలా సంబోధింపగలిగానా అని. అయినా అణచుకోలేని వాత్సల్య స్రవంతి ఏదో ఆమె హృదయాన్ని ఉప్పొంగజేస్తోంది.

"మీ అసలు పేరేమండీ సురూజీ?"

"అందుకు జవాబుగా లెటర్ హెడ్ పేపరొకటి ఆమె ముందుంచాడు సురూజీ. దానిపై 'డి. యమ్. రాయ్. (సురూజీ) ఎం.ఏ, యమ్.ఇ.సి. ఓ.యల్.' అని వున్నది.

"కోల్పోయిన నా సుప్రసన్నం నాకు చేరనున్నదనే సంతృప్తి అలావుంచి, మీ పరిచయం కలిగినందుకు ఎంతో సంతోషిస్తున్నాను."

"మీకు అప్పచెల్లెళ్లు ఎంతమందండీ?"

"ఇప్పుడు ఎవరూ లేరు. ఎన్నడో ఒక చెల్లెలు వుండేదట. ఇప్పుడు ఎక్కడైనా జీవించే వున్నదో, లేదో; తెలియదు. నా చిన్నతనంలోనే అది నాకు దూరమైంది."

'ఎందుకు తనమనసు ఇంత ఆరాటపడుతున్నది? ఈ వ్యక్తి కన్పించింది మొదలు తనశరీరంలోని ప్రతి రక్తాణువూ ఎందువల్లనో ఆక్రోశిస్తున్నది. అత్యంతమైన హృదయవేదనతో పెదవులు కదల్చింది లలితాదేవి.

"ఎన్నడో ఒక చెల్లెలువుండేదా? ఇప్పుడామె ఏమైందంటారు?"

"అది ఒక చిత్రగాథ. చాలాకాలం ఆ గాథ స్మృతిపథంపై మెరసినప్పుడల్లా ఏకాంతంగా కూర్చుని ఎంతోసేపు ఏడుస్తుండేవాణ్ణి. కాని యిప్పుడు యీ సేవాజీవితమునకు అటువంటి పూర్వగాథల్ని మనసులోకి మాటి మాటికీ రప్పించుకోవటం మహాప్రమాదంగా భావించి దీక్షగా వాటిని అదుపులో వుంచాను. మళ్లా యివ్వాళ్ళ స్వాగతింపలేకపరికీ కొంత హృదయపరితాపం తప్పదు. అయినప్పటికీ మీరు విన ఉత్సాహపడుతున్నారు గనుక చెప్తాను.

"నాకు ఆరుసంవత్సరాల వయసప్పుడు మాతండ్రి కుటుంబసమేతంగా రామేశ్వరయాత్రకు వెళ్ళారు. అప్పుడు మా చెల్లెలివయసు మూడేళ్ళు. ఒకరోజున మమ్మల్నిద్దరినీ ఒడ్డున కూర్చోపెట్టి మా తల్లిదండ్రులిద్దరూ సముద్రంలోకి దిగి స్నానంచేస్తున్నారు. మేమిద్దరం ఆడుకుంటూ ఆడుకుంటూ వుండగా ఆ జనసమూహంలో ఎవరిదారి వారిదైపోయింది. మా నాన్నగారు ఎన్నోచోట్ల వెతికించారు. పోలీసు రిపోర్టు యిచ్చారు. ఇంకా ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఫలితంగా మూడురోజులైన తరువాత నన్ను ఒక మార్వాడీసేట్ తీసుకునివచ్చి మా నాన్నగారికి అప్పగించి వెళ్ళాడట. కాని చెల్లి ఆంతమాత్రం తెలియలేదు. ఎన్నో విధాల కృషి చేశారు. ఏమీ ప్రయోజనం కలగకపోయింది. చివరకు మా అమ్మ కూడా దాని దిగులులోనే పరమపదించింది. మా నాన్నగారు కూడా అంతిమక్షణాల్లో దానిపేరు తల్చుకుంటూనే ప్రాణంవిడిచారు. ఇప్పటికి యీ వృత్తాంతం జరిగి ఇరవైఎనిమిది సంవత్సరాలైంది. అసలు అది జీవించేవున్నదో? లేదో?... గుర్తించడానికి ఆధారములంటూ వున్నవికాని అవి చాలా జటిలమైనవి. దానికి వక్షస్థలంపై ఒక పెద్ద పుట్టుమచ్చ వుండేదని అంటూండేవారు మా నాన్నగారు. స్త్రీ యొక్క వక్షస్థలం బహిరంగంగా కన్పించేది కాదాయె! ఇంకొకటి కూడా వున్నది. తప్పిపోయిన సమయంలో దానిమెడలో ఒక చంద్రహారం గొలుసుకూడా వున్నదని మా అమ్మ చెప్పింది. ఆ గొలుసులోగల బిళ్ళపై 'డి. చంద్రమతీదేవి' అని మా అమ్మపేరు కూడా వున్నదట. ఆ గొలుసును మా అమ్మ స్నానానికి సముద్రంలోకి దిగుతూ మా చెల్లెలిమెళ్లో వేసిందట. అదికూడా గుప్తంగావుండే సందర్భమేనాయె! ఇక గుర్తించేందుకు యీ ఆధారాలు ఎలావుపయోగపడతవి చెప్పండి. మా చెల్లెలిది కూడా మీ పేరే! కావాలని పట్టుబట్టి మా నాన్నగారితో పోట్లాడి మరీ పెట్టుకుంది ఆ పేరు దానికి మా అమ్మ. అది మా అమ్మమ్మపేరట. మా అమ్మ పుట్టింటివారి సంప్రదాయంలో స్త్రీల

పేర్లకు చివర 'దేవి' అనీ పెట్టుకోవటం ఏనాటినుంచో వస్తూన్నదట......" కళ్ళనీరు కారుస్తూ మొహం అరిచేతుల్లో పెట్టుకుంది లలితాదేవి.

"ఎందుకు మీరలా బాధపడతారు లలితాదేవి గారూ? అదినా దురదృష్టం"

చేతుల్లోని ముఖం పైకెత్తి గుండెల్లోని దుఃఖభారమును అణిచేసుకుంటూ దృఢకంఠస్వరంతో అన్నది లలితాదేవి "నీది కాదు అదురదృష్టం. సోదర ప్రేమను పొందుటకు నోచుకోని ఆ అభాగ్యురాలిది. నీవలె నే నీసోదరికూడ ఉన్నతవిద్యావంతురాలే. కాని నీకు లేని మానసిక సఖం ఆమె గొప్పగా అనుభవిస్తూన్నది. అశాంతి, అస్థిరత్వాలు ఆమెను సమీపింపవు కూడా."

"ఆఁ! ఏమంటున్నారూ? అంత మహాసుఖజీవా నా చెలి! అయితే యిది మీరెట్లా చెప్పగలుగుతున్నారు లలితాదేవిగారూ? జ్యోతిషం ఏమైనా తెలుసా?"

"ఇన్ని చాలక నేను జ్యోతిష విద్యాంసురాలను కావాలని కూడా కోరుకుంటున్నావా అన్నయ్యా?"

"మరి యీ సంగతి తమకు ఎలా తెలుసునంటారు?"

"నా ఆత్మ ప్రబోధం అలా పల్కుతోంది."

రాయ్ కొంచెం ముందుకు వొంగిఎంతో శ్రద్ధగా, ఆశగా అడిగాడు.

"మరి అయితే నాకు యీ జన్మలో ఒకతడవైనా నా సోదరీ సందర్శనం కాగలదంటారా? ఒక్కసారి మీ ఆత్మను అడిగిచూడండి. నా జీవితమంతా మీకు కృతజ్ఞుడనై వుంటాను."

"ఓ, తప్పకుండాను. ఒకతడవేమిటి? వంద తడవలు. వేయితడవలు..."

"ఎప్పుడంటారు?"

"ఈ వారంలోనే."

"ఈవారంలో ఏ రోజనంటారు?"

"శుక్రవారం నాడు."

"ఇవ్వాళేకదా శుక్రవారం."

"ఇరవై నాలుగు గంటలూ యింకా పూర్తికాలేదుగా."

ఇక ఏమాత్రమూ సందేహం లేదు. ఈ ఎదుటి వ్యక్తి తన పుట్టింటి వంశాంకురమే! తాను ఎవరి జీవితాల్ని గురించో పరిశోధనలు చేయవచ్చి మరుగుపడిన తన జీవిత సత్యాలనే తెల్సుకుంది.

రాయ్ కొంచెంసేపు గుబులుగా ఆలోచించి చూసి చివరకు నిరాశతో కృంగిపోతూ యిలా అన్నాడు: "ఏమో నాకేమీ నమ్మకం తోచటంలేదు. ఏ జోశ్యంలో. ఏనాటి చెల్లి? ఎక్కడ వున్నదనీ? ఏమిటో ఇదంతా? సరేగాని మీరు హిందూ జ్యోతిష సిద్ధాంతాల ప్రకారమా లేక పాశ్చాత్య జ్యోతిష..." మాటకు అడ్డుతగిలి కొంచెం విసురుగా అన్నది లలితాదేవి. "ఏ జ్యోతిషాలు చదివనక్కర్లేదు. నీముఖంలో నేను నాముఖంలో నీవు భావాల్ని చదువుకుంటే చాలు. సరేగాని, నీ చెల్లెలి ముచ్చట్లలోపడి లెదర్ బేగ్ మాట మర్చిపోయినావ్."

రాయ్ మనసులో బాధపడుతున్నాడు. తన చెల్లెలివృత్తాంతం చెప్పినప్పటినుండి యీమె తనపట్ల చాలా నిర్లక్ష్యత చూపుతున్నది. గదమాయింపుగా మాట్లాడుతోంది. అనవసరంగా యీమె ముందు అదంతా వల్లెవేయటంద్వారా లేకితనంగా ప్రవర్తించానేమో అని భావిస్తున్నాడు.

కొంచెంసేపు వూరకున్న తర్వాత లలితాదేవి అన్నది" ఒక షరతు వున్నది. ఈఫోటోకు సంబంధించిన గాథను నాకు నీవు పూర్తిగా వినిపించగల పక్షంలోనే నానుండి యీ లెదర్ బేగ్ నీవు పొందగలవుసుమా! నీ పారితోషికంతో కూడా నాకేమీ నిమిత్తం లేదు. పారితోషికాలముష్టితో నీ దయాదాక్షిణ్యాల కొలుపు నేను చెయిజాచ నవసరంలేదు. ఉద్దేశమే కలగాలిగాని సహజమైన పద్ధతిలోనే నీమీద దండయాత్ర జరుపగలను."

"నాకు అభ్యంతరం లేదు. ఆ ఫోటో గాథ చెప్తాను వినండి. చివరలో నా వస్తువుని మాత్రం నా కిచ్చేసి వెళ్లండి. మీరు తగిన బహుమతి నానుండి పొందితేనే నాకు సంతృప్తిగా వుంటుంది. నా తలిదండ్రులు నా పదిహేనేళ్ల వయసులోపల మూడు సంవత్సరాల వారగా యీ లోకాన్ని విడిచి వెళ్లారు. ఆ సంవత్సరమే నా చదువు స్కూల్ ఫైనల్ పూర్తయింది. తరువాత మా మేనమామ ఇంటికి చేరి ఇంటర్ లో ప్రవేశించాను. నేను సూక్ష్మగ్రాహినని నన్ను నేను మెచ్చుకోవటమే కాదు. ఆ విషయం నాకు విద్యనేర్పిన కాలేజి లెక్చరర్లు కూడా అంటూండేవారు. నాలుగు సంవత్స

రాలలో డిస్టింక్షన్ మార్కులతో ప్యాసై మొదటి తరగతి పట్టభద్రుడనిపించుకున్నాను. ఆ సమయంలోనే నా మనసును ఒక కుసుమకోమలి ఆకర్షించింది. ఆమె పేరు సుమిత్ర. ఆమె అన్నగారు ఆ వూరికి బదిలీ అయి మా మేనమామగారి మేడపైన అద్దెకున్నారు. ఆమెకూడా నాయందు వలపు నిల్పుకుందని గ్రహించటానికి నాకు యెంతోకాలము పట్టలేదు. ఆ విశ్వమోహన రూపము ఇప్పటికీ నా మనసులో తళతళడుతూ చెరగరానిదయిపోయింది. ఆమె అన్నగారు ఆఫీసుకు వెళ్ళిపోగానే నేను మేడ ఎక్కుతూండేవాణ్ణి. ఆ కోమల హస్తాలు నా మెడపై ఎన్ని చుట్లు తిరిగినవో చెప్పలేను. ఆ సుందర వదనం, ఆ పాలబుగ్గలు శాశ్వతంగా నా వస్తువులని భ్రమించాను. ఈ లోకంలో పవిత్రమైన ప్రతిదానికీ శాశ్వతమయ్యే హక్కు కలుగకుండా చేయడానికి కొన్ని మానవహృదయాలు తమ శాయశక్తులా పని చేస్తూంటాయని ఎరుగలేకపోయాను. ఎంత నిర్మలమైన దానిపైనకూడా దాడిసల్పుటకు మానవ దురహంకారం, స్వార్థపరత్వం వెనుకంజవేయవని తరువాత తెల్సుకున్నాను. స్వార్థంలో వున్న తాత్కాలిక సుఖంపైగల ఆశతో మానవుడు లోకద్రోహ కార్యములకుకూడ సిద్ధపడగలడు. మా ప్రణయ సమాచారమును కొంచెంగా పసిగట్టిన మా మామయ్య ఒకప్రక్కన తన కూతుర్ని తప్పకుండా ఆ మాఘమాసంలోనే వివాహం చేసుకోవాలని పట్టుబట్టి కూర్చున్నాడు. మరోకప్రక్కన ఆమె అన్నకు ఏవేవో బోధలుచేసి అంత తక్కువ వ్యవధిలో ఎక్కడా సంబంధం దొరక్కపోవుసరికి చివరకు, స్కూలు ఫైనల్ ప్యాసై ఎక్కటో నలభైరూపాయలు తెచ్చుకుంటూన్న తన బావమరిదిచేతనే ఒక ముహూర్తాన నా సుమిత్రకు ఆమూడు ముళ్ళూ వేయించి యిక తన కూతురికి పోటీరాకుండా చూసుకున్నాడు. సుమిత్రకా వివాహాన్ని తప్పించాలని ఎంతో ప్రయత్నించాను. ఆమెకూడా తక్కువ కృషిచేయలేదు. మా ప్రార్థనలన్నిటిని అరణ్యరోదనములుగా మార్చి భగవంతుడు నాసుమిత్రను నానుండి వేరుచేశాడని ఎంతగానో దుఃఖించాను. కాని ఇప్పుడుమాత్రం భగవంతునిపై అనిందమోపను. లోకానికి యీనాయీ అనే కురూతినుండి [illegible] ఒక విధమైన సేవ అవసరమై వుంటే ఆ పని జరిగిందేమో అనుకుంటాను. లోకానికి పనికివచ్చేవ్యక్తులు భోగాల్లో మునిగిపోవుటకు ఆ సర్వవ్యాపి అంగీకరించలేడేమో! వెన్నెలరాత్రులలో చల్లని జాబిల్లి సాక్షిగా మే మిరువురం చేసుకున్న ప్రతిజ్ఞలన్నీ యీ విధంగా దుఃఖయాతనలుగా పరిణమించటంతో సుమిత్ర వివాహం జరిగిన మర్నాడే చింతాభరితమైన హృదయంతో దేశాటనకు బయల్దేరాను. ఎక్కడెక్కడో తిరిగాను. ఎంతమంది స్నేహితుల ఇండ్లలోనో వున్నాను. ఎన్నో రకాల విద్యల నభ్యసించాను. ఇటు న్యాయశాస్త్రంలోను, అటు ఉపాధ్యాయ విషయికంగానూ పెద్ద డిగ్రీలు పొందాను. కాని యీ భగ్నప్రణయ వృత్తాంతము మాత్రం నా మనసును క్రుంగదీస్తూనే వుంది. ముఖ్యమైన ఆనందం జీవితంలో లోపించిన తరువాత, యీ ఉన్నతోద్యోగాలేవి సుఖప్రదములు కాలేవనీ, మనసును నిరంతరం కాటు వేస్తూండిన యీ విషాదసర్పం ఏవుకోర్ధగ విర్వాణను జయప్రదం కానివ్వలేదనీ ఒక నిర్ణయానికి రాగలిగాను. ఈ విధంగా అస్థిమితహృదయంతో, అనాలోచితంగా, న్యాయ, విద్యావిషయిక శాస్త్రాలలో గొప్పగా ప్రతిభ కలిగిన యీ వున్నత విద్యావంతుడు వూళ్ళవెంబడి తిరగటం ప్రారంభించాడు. ఇలా జరుగుతూండగా ఒకతడవ యీ బస్తీలో మురికిపేటలో తిరగటం సంభవించింది. ఈ రోడ్ల ప్రక్కల్న పేవుమెంట్లపై పడివున్న ఆకలిజీవుల దీన దృష్టులు నా గుండెలో రుధిరాన్ని చిలికించినయ్. సమస్త దుర్వ్యాధులకు ఆలవాలమై గాలికి గజగజలాడే యీ నిర్భాగ్య కార్మిక సోదర జీవుల గృహాలు నా శరీరాన్ని కంపరమెత్తించినాయి. చింపిరి పేలికగుడ్డల చాటున మానాభిమానాలు దాచుకుంటూ లోకంలో మానవులమే అనిపించుకుంటూన్నవాళ్ళ సతీమణులయొక్క బక్కచిక్కిన దేహాలు నాలోగల ఉన్నత విద్యాగంధాన్ని నిలబెట్టి అడిగినయ్. 'నీవలన మాకు కలుగనున్న ప్రయోజనం ఏమిటి?' అని. వారిబిడ్డల పసిముఖాలు నన్ను దీనంగా దేనికోసరమో అర్థిస్తున్నట్లుగా కన్పించినయ్. సంఘంలో అధఃపతనత పొందిన యీ జీవుల ముందు తరాలవారు కూడా యీ హైన్యజీవితాలు గడుపవలసినదేనా అని ఆలోచిస్తున్నాను రోడ్డు ప్రక్కన పేవుమెంటుపై ఆకలిబాధకు నోరు తెరచి పడివున్న ఒక అభాగ్యుని ప్రక్కన కూర్చుని. 'లే! నిలబడు. ముందటిని దీక్షాకంకణం ధరించి కార్యరంగంలోకి దూకి లోకం వేపుకు ఆశగా మాస్తోన్న ఆ అమాయిక ముఖా

లను విద్యాభిక్ష పెట్టు. స్వార్థప్రయోజనాలకై అమృత వర్షం కురిపించకు. ఉపయోగించేరీతి తెలియకుండా అపసవ్యంగా వాడితే త్యాగమే మానవునికి అరిష్టదాయకం కాగలదు. ఎన్నడో పరులపాలైపోయిన సుమిత్రపైహృదయం నిల్పుకుని నీ ప్రేమశక్తిని బూడిదపాలు చేసుకోకు. అంత దృఢహృదయంతో నీ లోకకళ్యాణం కోరి యీ నిరుపేదజీవులపైకి ఆ పవిత్రప్రేమను మళ్ళించుకో. ఈ మహత్తర సేవావిధానంలో నీ సర్వశక్తుల్నీ లగ్నంచేసి చవిటినేలగామారిన నీ జీవితక్షేత్రాన్ని సస్యశ్యామలం చేసుకో అని అంటూ ఏదో అనంతత్వం నన్ను ముందుకుతరిమి కొడుతూన్నట్లుగా తోచింది. వెంటనే కార్యరంగంలోకి ప్రవేశించాను. నా స్వగ్రామంవెళ్ళి నా పిత్రార్జితపు ఆస్తిలో కొంతభాగాన్ని విక్రయించి డబ్బు తీసుకునివచ్చి యీ భవంతి కొన్నాను. ఉచిత పాఠశాలకు కావల్సిన వసతులన్నిటినీ సమకూర్చాను. ఇంకనూ మిగిలివున్న రెండులక్షల విలువగల పిత్రార్జితపు ఆస్తిలో ఫలసాయమును యీ పాఠశాలా నిర్వహణ కొరకు వినియోగిస్తున్నాను. మూడుసంవత్సరాలనుంచీ కేంద్రప్రభుత్వం కొంత గ్రాంటు కూడా యిస్తోంది. అప్పటినుంచీ విద్యార్థుల కూడూ గుడ్డా బాధ్యతనుకూడా విద్యాలయమే తనపైన వేసుకున్నది. పెద్దవారికోసం కూడా కొన్ని గంజి కేంద్రాలు నిర్వహిస్తోంది. ఈ సేవానురక్తి సుమిత్రపైగల విశ్వలప్రేమకు ఒక క్రొత్తబాట కల్పించింది. ఈనాడు సుమిత్రను నేను ఒక ఆడదానిని మాదిరిగా ఏ భావంతోనూ ప్రేమించటం లేదు. ఉత్తమ కార్యాచరణను ఉన్నత దృష్టినీ ప్రసాదించింది. ఆమెను ఒక దేవతగా భావించి రోజూ పరమేశ్వరారాధన పూర్తిచేసుకున్న తరువాత ఆమె ఫోటోను ఒక్కతడవ చూసుకుని దానియెడల నాకుగల భక్తిప్రపత్తులను వెల్లడిచేసుకుంటూ వుంటాను. ఆఫోటో ఎప్పుడూ ఆలెదర్ బేగ్ లోనే వుంటూవుంటుంది. ప్రయాణ సమయాలలోకూడాఅది నావెంట వుండే అలవాటు. ఈతడవ ఆఫోటో నాకుదూరమై పది దినాలైంది. మనసులో గుబులుగావుంది. ఇది నా సుమిత్ర జీవితానికి ఏదైనా అశుభశకునమేమో నని భయపడుతున్నాను. తనకు ఉపయోగపడనంత మాత్రాన, తాను ప్రేమించినవస్తువు నశించిపోవాలనిగాని బాధపడాలనిగాని కోరేవ్యక్తి పరమనీచుడు! నే నెప్పుడూ నా సుమిత్రక్షేమాన్నే కోరుతూంటాను. స్త్రీకి జీవితమంతా ఒకే భర్త అని ఎలా శాసించినదో, ఆరీతిగనే పురుషుని జీవితానికి కూడా ఒకేభార్యఅని నిర్ధారించివుంటే మన ధర్మశాస్త్రాలు యింకా పరమపవిత్రంగా పరిగణింపబడే వనుకుంటాను. నా మానసపథంలో ధ్రువతారగా వెలుగుతూన్న సుమిత్రకు అర్పించిన యీ హృదయాన్ని మరొకరికి ధారపోయటం నాకు చేతగానిపని. జీవం ఎగిరిపోయిన తరువాత నా బొందెవలనకూడా ఆపని ఎవరూ చేయించలేరేమో? అందుచే బాహ్యలోకానికి బ్రహ్మచారిగానే వుండిపోయాను.

ఇంతసేపూ లలితాదేవి చాలా ఓర్పుగా విని చివరకు కొంచెం వెటకారంగా అన్నది. "బాగుంది! నీ గాథ చాలాబాగుంది అన్నాయ్! ఇంత వున్నత విద్యావంతుడవయ్యీ కూడా వంశాన్ని నిలుపలేకపోయావ్. టాక్సీలో నన్ను నాబసకు పంపండి. తరువాత ఒక గంట లోపల మిమ్మల్ని తిరిగికల్సుకుంటాను. అప్పుడు మీ లెదర్ బేగ్ మీకు అప్పచెప్పగలను."

"అలాగే. ఈ దీనుడియొక్క మరియొక ప్రార్థనను కూడా తప్పకుండా మన్నించి తీరగలరని తలుస్తాను. మీ జ్యోతిష పాండిత్యము నుపయోగించి నా చెల్లెలి సమాచారం వెల్లడిచేయడమే గాకుండా నా భవిష్యత్తుని గురించి కూడా కొంచెం ఆలోచించి చూడండి. ముఖ్యంగా మా చెల్లెలిసమాచారం మీ జ్యోతిష్య ప్రకారం జరిగితే జ్యోతిషమార్తాండ, జ్యోతిషరత్న మొదలగు బిరుదు లిప్పించి గొప్పగా సన్మానించగలను."

దుఃఖభారంతో వివర్ణమైపోయిన లలితాదేవి లేచి నిలబడి ఉక్రోశంగా అన్నది "నీబిరుద ప్రదానాలూ నాకక్కర్లేదు. నీ సన్మానాలూ నాకవసరంలేదు."

లలితాదేవి ముందుకు సాగిపోతూన్నది. ఆమె మాటలు సరిగా అర్థంగాక కలవరపడి పోతూన్న రాయ్ ఆమె వెనకనే వచ్చి గేటులో నిలబడి 'తప్పకుండా గంటలోపల రాండి' అని చెప్పి లోపలకు వెళ్ళిపోయాడు. తాను కారులో ఎక్కబోతూండగా ఎదుటి ఇంటి కిటికీ సందుల్లో నుంచి రెండు నేత్రాలు సూటిగా తనపై దృష్టి బఱపినట్లు లలితాదేవి గమనించలేదు. వెంటనే ఒక కుఱ్ఱవాడు కారు బయల్దేరబోతూండగా వచ్చి "ఏమండీ, మా అమ్మగారికి మీరు తెల్సునట. ఒక తడవవచ్చి వెళ్ళమన్నారండి" అని చెప్పాడు. లలితాదేవి కారునుంచి దిగి కుఱ్ఱవాడి వెనకనే నడిచి అత్యుణ్ణగృహంలోకి ప్రవేశించింది.

తలుపు రెక్క చాటు నుంచి ఇలా ధ్వనించింది "ఏమే లలితా? కులాసాగా వున్నావా? నిన్ను ఎంత కాలానికి చూడగలిగాను?

ఆ కంఠ స్వరం ఎన్నడో విన్నట్టు చాలా సుపరిచితమైనట్టు తోచింది లలితాదేవికి. మరల అదే ప్రదేశాన్నుండి యీ విధంగా మాటలు వెలువడినాయి "బాగా ఇంగ్లీషు చదువు చదివినట్లున్నావు. ఏదైనా ఉద్యోగం కూడా చేస్తున్నావా? అదృష్టవంతురాలివి!"

ఆ వెంటనే తలుపుని గుసగుస పరుకుంటూ అసలు స్వరూపమే ప్రత్యక్షమైంది. "నన్ను గుర్తుపట్టలేదా? నేను సుమిత్రను కదే!"

లలితాదేవి నివ్వెరపోయి చూస్తోంది. ఒక నిమిష కాలంపాటు ఆమె మనసు పనిచేయటం మానేసింది.

"ఏమిటే ఆ వెఱ్ఱిచూపులూ నువ్వూను! నేను "సుమిత్రను లలితా."

"నువ్వు ఆ గురూజీ నన్ను నిజంగానే వెఱ్ఱిదాన్ని చేస్తున్నారు సుమిత్రా. నువ్విక్కడ వుంటున్నావా ఏం? నీకు వైధవ్యం వచ్చిందా? అసలిలా మారిపోయినావేమిటె?"

"అవును. నాకు వైధవ్యం వచ్చి నాలుగేండ్లయింది లలితా. వీడు నా ఏకైక సంతానం. అసలువారు పిత్రార్జితపు ఆస్తిపాస్తులు కలవారు కారు. బ్రతికివున్నన్నాళ్ళూ మంచి వుద్యోగమే చేశారు. జీవనానికి లోటు లేకుండా గడిచిపోయింది. ఆయన మరణించిన మర్నాటి నుండీ నా కష్టదశ ప్రారంభమైంది. అన్నలు మనవాళ్ళయితే వదినెలు మనవాళ్ళు కారుకదా! నీకు తోబుట్టిన వాళ్ళెవరూ లేకపోవటం చేత ఆ గొడవలు నీకు తెలియవు......వెంటనే లలితాదేవి కలవరపడుతూ సుమిత్ర మాటలకు అడ్డుతగిలి 'సుమిత్రా అట్లా అనకు. నాకూ నా తండ్రివంశాంకురంగా ఒకతోబుట్టిన వాడున్నాడు. వాడు ఎవరో నీవు కొన్ని నిమిషాలలోనే తెలిసికోగలవు' అన్నది.

'అట్లాగా. ఆ సంగతి నాకు తెలియదుకదా! ఎన్నో అవస్థలుపడ్డాను. ఎన్నో దూషణ వాక్యాల్ని గుండెల్లో దాచుకున్నాను. అన్నగారి ఇంట్లో నుంచి గెంటింపబడ్డాను. చివరకు నాకు యీ మురికిపేటను గమ్యస్థానంగా చూపింది విధి. మా కుఱ్ఱవాని ప్రార్థనలు ఆ గురూజీ గారికి మా పై కరుణ కలుగజేసినవట్. వాణ్ణి స్కూల్లో జేర్చుకున్నారు. మాకు యీ నివాసస్థానం చూపించారు. ఇక్కడి నుంచే భోజనం వారికి మావాడు ప్రతిరోజూ తీసుకువెళుతూంటాడు. అందుకుగాను ముష్టి ప్రతిఫలంతో నా కడుపుగడుస్తోంది కుఱ్ఱవాడు అక్కడే భోజనం చేస్తూంటాడు. దైవస్మరణ చేసుకుంటూ ఈ వైధవ్య జీవితం గడుపుకుంటున్నాను.

"అయితే, నీవు ఇక్కడకు వచ్చిన తర్వాత ఎన్నడూ గురూజీని చూడలేదా సుమిత్రా?

"లేదు. ఒక్క గురూజీనే కాదు. ఏ పురుషవ్యక్తి కంటనూ పడకుండా కాలం గడుపుకుంటున్నాను. కాని ఆ మహనీయుణ్ణి గురించి మావాడి వల్ల విన్నాను. వారి దయారసమును గూర్చి యీ పేటలోని ప్రజలు అనేక కథలు చెప్పుకుంటారు. ఆయన వారి దృష్టిలో లోకాతీతులు. నేను భగవద్గీత చదివి వినిపిస్తున్నప్పుడు ఇక్కడి అమ్మలక్కలు అందులోని శ్రీకృష్ణపరమాత్మని పాత్రే అద్భుతంగా గురూజీని జ్ఞాపకం చేస్తోందంటారు......" మాటలకు అడ్డు తగిలి ఇలా ప్రశ్నించింది లలితాదేవి.

"భగవద్గీత కూడా చదువుతున్నావా ఏం? ఏది చూద్దాం ఆ గ్రంథం ఒకసారి యిటు తీసుకురా."

"పదిహేను రోజుల క్రితం పెన్న ఒడ్డున మర్చిపోయాను లలితా. దానితో బాటు అందులో వుంచి వున్న ఒక అమూల్యవస్తువుకూడా కోల్పోయాను" అని అన్నది సుమిత్ర విషాదంగా.

వెంటనే లలిత తన జాకెట్ జేబులో నుంచి తీసి రెండు చేతుల్లో రెండింటినీ పట్టుకుని చూపిస్తూ చిరునవ్వుతో అడిగింది "ఇదేనా నీ భగవద్గీత? ఈ ఫోటోయేనా ఆ అమూల్యవస్తువు?"

అత్యంతవిస్మయం ప్రదర్శిస్తూ సుమిత్ర అన్నది "అవును. అవే నా జీవిత" అమూల్య వస్తువులు లలితా. నన్ను భగవంతుడు ఎంతో కరుణించాడు. గుండెల్లో దాచుకోగల్గిన ఆ పత్తిగల బాల్య స్నేహితురాలి హస్తాల్లోనే నా మానాభిమానములకు మూలకందమైన దాన్ని విసిరి వేశాడు. బ్రతికి పోయాను!" అని అంటూ కళ్ళు మూసుకుంది. ఆ కండ్ల మూతలనుండి జలబిందువులు జలజలా రాలుతున్నాయి.

"సుమిత్రా! యీ ఫోటోలో వున్న వారితో నీకు గల సంబంధాన్ని గూర్చి ముక్తసరిగా మూడు ముక్కల్లో చెప్పవింటాను."

"నేను చాలా దురదృష్టవంతురాల్ని లలితా. మనసు ఒకరితో, మనువు ఒకరితో సంఘటించింది. నా అనుమతితో అవసరం లేకుండానే బలవంతంగా, ముష్కరంగా నా చేతుల్లో నాయుడన్ రాయికి ఇతరులు ద్రోహం చేయించారు. నా యీ శరీరాన్ని ఇతరుల కౌగిళ్లలో కులికించి సంసార జీవితాన్ని నిర్వహించానుగాని అతను మటుకు తన ప్రతిజ్ఞా పరిపాలన అక్షరాలా జరుపుతున్నాడు. నేను హిందూ స్త్రీని కావటంచేత మనసును చాలా అదుపులో వుంచుకుని కట్టుకున్న వారికి చాలా విధేయురాలుగా వుండి కాలక్షేపం చేశాను. కాని సృష్టి ధర్మాలను ఎవరూ అతిక్రమించలేరు కదా! ఆత్మ అనేది లేకపోతే వెనక చూపు లేకుండా మానవుడు ఎన్ని పనులైనా చేసుకుని పోతూ వుండేవాడు! మంగళసూత్రమే మనసును తన పాదాల క్రింద అణచిపెట్టివుంచగలదనుకునే వాళ్లువట్టి పిచ్చివాళ్లు సుమా! ఎంత ప్రయత్నించి నప్పటికీ నాకు సూత్రధారణ చేసిన భర్తను నేను హృదయంనిండా ప్రేమించలేకపోయాను. ఆయన చాలా మంచివారు. నాయందు చాలా ప్రేమగా వుండేవారు. ఈ విధంగా ఆరు సంవత్సరాల పాటు కాలక్షేపం జరిగింది. తరువాత ఆయన దైవంయొక్క ఆదేశం ప్రకారం పరలోకానికి వెళ్ళిపోయారు. నా తొలివలపును పొందిన మదన్‌రాయ్ నాకోసం చేసిన త్యాగాలన్నీ నా హృదయంలో ఆయనకు అత్యున్నత స్థానాన్ని యిచ్చినయ్. కామవాంఛల మాలిన్యం అపవిత్రత మనసుకి అంట చేయకూడదనుకున్నాను. ఆయన్ని దైవంగా ఎంచుకుని ఆయన ఫోటోను శ్రీ కృష్ణపరమాత్ముని ప్రతిమ ప్రక్కగా వుంచి పూజిస్తూంటాను.

"మదనరాయ్‌కూడా నిన్ను దేవతగానే భావించుకుని ఆరాధించుకుంటున్నాడు. నీవియోగాగ్ని అపవ్యస్థిత మనస్సుతో దేశద్రిమ్మరిగా తిప్పినప్పటికీ లోకంలో పీడితప్రజలపాలిట ఒక మాణిక్యంగా మార్చివేసింది. కాని ఇక్కడి విచిత్రమేమంటే, ఎదురుబదురు ఇళ్లల్లో రెండు సంవత్సరాలనుంచీ వుంటూ ఒకర్ని ఒకరు గుర్తించుకోలేక దొంగచాటున మాదిరిగా ఒకర్నొకరు ఆరాధించుకుంటున్నారు."

"ఏమిటంటున్నావ్ లలితా? నువ్వు చెప్పేది నాకర్థం కావటం లేదు." లలిత లెదర్ బేగ్ తెరిచి సుమిత్రకు చూపి అడిగింది. "ఇది నీవు బాగా పడుచుతనంలో వున్నపుడు తీయించుకున్న ఫోటో కదూ?"

అవును. మాకడసారి సమావేశంలో తన చేతికెమెరాతో యీ ఫోటో తీసి రాయ్ తన దగ్గిర వుంచుకున్నాడు. తనఫోటో ఒకటి నాకు యిచ్చి 'సుమిత్రా? ఇవే మనకు యిక దివ్యస్మృతులు' అన్నాడు. ఆసమయంలో నా రాయ్ నాకు ఇంకా చెప్పిన కొన్ని మాటలు ఇప్పటికీ నామనసులో ఖంగున ధ్వనిస్తూనే వుంటాయి: 'సుమిత్రా? యిది నలుగురికీ తెలిసిన చరిత్ర. ఈ వూరు హద్దుల వరకు యిది రహస్య విషయమేమీ కాదు. నీవు గృహస్థాశ్రమాన్ని సరిగా నిర్వహించలేకపోతే, లోకులు యీ మదనరాయ్ వెనక దాని కాపురాన్ని కొస్తా పాటన పెట్టుకున్నాడని నన్ను దూషిస్తారు. అసలే అశాంతితో కుళ్ళిపోయే యీ దౌర్భాగ్య జీవియొక్క శిరస్సుపై అనిందా భారం ఒకటి మోపబోకు. ధర్మశాస్త్రాలను గౌరవించే వాడినే వాటిని చూపి ఇతరులు చెవికొరుకుతూంటారు. నిన్ను ఇప్పుడున్న దాన్ని ఉన్నట్టుగా యిక్కడ్నుంచి తప్పించి నా భార్యగా చేసుకోదగు ధైర్యం నాకు లేకపోలేదు. ఉపాయం తెలియక కాదు. ఈ సందర్భంలో స్వేచ్ఛావిహార విధానం అవలంబించి నీపవిత్ర జీవితాన్ని అపఖ్యాతి పాలు చేయటం నాకు ఇష్టంలేదు. ఇతరులు నిందాస్పదంగా చూచే ప్రేమను నేను భరించలేను. సుగుణాలరాశివైన నిన్నుకూడా అటువంటి హేయస్థితిలో దింపుటకు నాకు ఏమాత్రమూ ఇష్టంలేదు.' అన్నాడు- కాని యీఫోటో నీ చేతికి ఎలా వచ్చింది లలితా?"

"నీ మాదిరిగానే రాయికూడా నీఫోటో పోగొట్టుకున్నాడు. అది నా చేతికి చిక్కింది. దాన్ని గురూజీకి అప్పచెప్పి పోదామని వచ్చాను."

"ఆ దేమిటి లలితా, గురూజీకి అప్పచెప్పటం దేనికి?"

"గురూజీ, మదనరాయి-యీ రెండు పేర్లూ ఒకరివే గనుక. ఓసి పిచ్చిదానా! అతను నీమనసైన రాయ్..."

వేడెక్కిపోయిన తలను రెండు చేతుల్తోనూ నొక్కి పట్టుకుని కూర్చుంది సుమిత్ర. ఆమె నేత్రాలలో వేగంగా అశ్రువు లూరుతున్నాయి. రెండు నిముషాల పాటు వూరుకుని తరువాత అన్నది. "అయితే, ఇపుడు యీ తృణగృహంలో తన ఆదరణక్రింద జీవిస్తూన్న మనిషి, సుమిత్ర అని ఆయనకు తెలుసా?"

"తెలియదు"

వెంటనే సుమిత్ర లలితకు దగ్గరగా జరిగి ఆమె రెండు చేతులూ పట్టుకుని యిలా ప్రార్థించింది. "బాల్య స్నేహితురాలవు-లలితా! నీ నుండి నాకు ఒక వరం కావాలి. అందుకు నీవు సమ్మతించకపోతే, యీ బట్టకొంగుతో నా కంఠానికి ఉరిబిగించుకుని ఈ ప్రాణాన్ని విడిచేస్తాను."

"అంత పని ఎందుకు సుమిత్రా? వర మేమిటో ఆదేశించు."

"నీ ఎదుటి యింట్లో వుంటూ నీ ఆదరణ క్రింద జీవిస్తూన్న మనిషి సుమిత్రే అనిగాని, ఆమె నిన్ను దైవంగా ఎందుకని ఆరాధిస్తోందనిగాని ఎన్నడూ ఆయనకు తెలియజేయ వని నీ నుండి నాకు వాగ్దానం కావాలి."

"ఆవిధంగా నే చేయగల నని నీకు అభయమిస్తున్నాను. ఇక శలవు తీసుకుంటాను సుమిత్రా" అని అంటూ లలితాదేవి బయటకు వచ్చేసి గబగబా నడుస్తూ ఒక్క అంగలో సురూజీ గదిలోకి వెళ్ళింది. వార్తాపత్రిక చూచుకుంటూ యీజీచైర్ లో కూర్చున్న సురూజీ దాన్ని మేజాబల్లపైకి విసిరి 'కూర్చోండి లలితాదేవిగారు' అన్నాడు.

కాని లలితాదేవి కూర్చోకుండానే సురూజీకి చాలా దగ్గరకు వెళ్ళి నిలబడి "సరే కాని, నీ చెల్లెలు నీకిప్పుడు కన్పిస్తే ఏమిచేస్తావ్?" అని అడిగింది గంభీరంగా.

అతను చిరునవ్వుతో జవాబు చెప్పాడు. "చాలా ఆనందిస్తాను."

"అట్లాగా? అని అంటూ లలితాదేవి తన జాకెట్ నుండీ వూడతీసి తన వక్షస్థలంపైనగల పెద్ద పుట్టుమచ్చను చూపి, తరువాత తన మెళ్లో వున్న చంద్రహారం గొలుసు అతని చేతిలో వుంచింది. దానికిగల బిళ్ళపై 'డి. చంద్రమతీదేవి' అనే పేరుగల అక్షరాలు మిలమిలా మెరుస్తున్నాయి. రెండు నిమిషాలకాలం గడిచినాక తన విషయం యీవిధంగా చెప్పింది లలితాదేవి.

"నేను మద్రాసులో కేథలిక్ చర్చికి చెందిన ఒక క్రైస్తవ ప్రతినిధి చేతులలో పెరిగి పెద్దదాన్నయినాను. నీవు చెప్పిన విధంగా నేను తప్పిపోయిన తరువాత ఇసుక తిన్నెల్లో నిర్మానుష్యమైనచోట శోష వచ్చి పడిపోయి వుండగా చూచి ఆయన నన్ను తీసుకునివెళ్ళి శీతిలోపచారములు చేసి రక్షించాడు. ఆయన నాతో ఆ మాట ఒకప్పుడు చెప్పాడు. ఆయన నాయందు పితృప్రేమతో మెలగుతూ చదువు సంధ్యలు చేర్పించాడు. ఆయన బ్రహ్మచారి. 'నాకు క్రీస్తు దేవు డిచ్చిన కుమార్తెవమ్మా నీవు' అని అంటూండే వాడు. ఒక ఇంటిదాన్ని చెయ్యాలని ఆయన ఎంత ప్రయత్నించినప్పటికీ అవివాహితగానే వుండిపోగల నని దీక్ష వహించాను. నేను వైద్య విద్యలో పట్టా పొంది ప్రాక్టీసు ప్రారంభించిన కొంత కాలానికే ఆయన కాలం చేశాడు. హిందూ నామధేయం వుంచుకునే ఏసుక్రీస్తు దేవుని ఆరాధనకు ఆయన నాకు అనుజ్ఞ యిచ్చాను. నేను ఆయనకు దొరికిన కొన్ని గంటలకు నాకు తెలివి వచ్చిన తర్వాత 'నీ పేరు ఏమిటమ్మా' అని ఆయన అనగానే, వచ్చీరాని ముద్దుమాటలలో 'లలితాదేవి' అని బదులు చెప్పానట. ఇక మిగతా సమాచార మేమీ చెప్పలేకపోయానట. అందుచేత ఆ పేరుతోనే ఆయన నన్ను పిలుస్తూ వచ్చాడు. మద్రాసులోనే కొంతకాలం ప్రాక్టీసు పెట్టుకున్నాను. తరువాత వరంగల్ లో మా చర్చికి సంబంధించిన కొన్ని విషయాలను చూడవలసి వచ్చినందువల్ల ప్రాక్టీసు అక్కడకు మార్చుకున్నాను. ఈ క్రైస్తవ లలితాదేవి యీ హిందూ మదనశాయి, అన్నా చెల్లెళ్ళుగా యిప్పటికైనా తెల్సుకోగలిగినందువలన స్వర్గవాసులకు మన తల్లిదండ్రులకు ఆత్మశాంతి చేకూరగలదనుకుంటాను."

లలితాదేవి వెళ్ళిపోయిన తరువాత సుమిత్ర ఒక అరగంటసేపు దీర్ఘంగా ఆలోచించి తరువాత తనకుగల ఆకొద్ది సామానూ ఒక సంచీలో సర్దుకుని కూర్చుంది.

ఆనాటి అర్ధరాత్రి పన్నెండుగంటల సమయాన గాఢనిద్రలో మునిగివున్న తన కుమారుణ్ణిలేపి కూర్చోపెట్టి "ఇక వెళదాం లేనాయనా" అన్నది.

"ఎక్కడికమ్మా?" అని అడిగాడు జీవన్ కండ్లు నలుపుకుంటూ.

"ముందు యీవూరునుంచి బయల్దేరుదాం. ఆ తరువాత ఎక్కడికి భగవంతుడు దారి చూపిస్తే అక్కడకు వెళదాం."

"అంత అవసర మేమి వచ్చిందమ్మా? ఇక్కడ సురూజీ దయవల్ల సుఖంగా గడుస్తోంది కదా! నాకు పరీక్షలు కూడా సమీపిస్తున్నయ్." అని తన తల్లి రెండు చేతులూ పట్టుకుని దీనంగా బ్రతిమాలుతూ అగి వాడు ముక్కుపచ్చలారని మాతృభక్తిపరుడైన ఆ పసికందు. దుఃఖభారంతో కంఠం గద్గద మవుతూండగా సుమిత్ర ఇలా అన్నది. "జీవన్! నీవు కొంచెం పెద్దవాడివై నీకు రెక్కలు వచ్చేదాకా నేను చావ దల్చుకోలేదు. నా మరణ వ్యథని చూచినా ప్రతి క్షణమూ గంటలు వినిపిస్తూన్న యీ భయంకర వాతావరణమును నేను భరించలేనురా" ఆ మాటల్లోని తాత్పర్యాన్ని ఆ లేత మనసు గ్రహించలేక పోయినప్పటికీ మాతృదేవియొక్క విషాదవదనం వాని గుండెల్లో అదురుతీగలు ప్రాకించింది. "అట్లాగేనమ్మా" అని అంటూ నిలబడాడు జీవన్. ఒక సంచీ వానినెత్తిపై కెత్తింది. మరొక దాన్ని తాను చేత్తో తీసుకుంది. ముందు సుమిత్ర ఆమె వెనుక జీవన్—వారిరువురూ గమ్యస్థాన నిర్ణయం లేకుండానే ఆ నిశీథకాళరాత్రిలో ఎక్కడికో ఆ వరిపొలాలగట్ల వెంట నడిచి పోతూన్నారు.

# ఆంధ్రాంగ్లభాషలలో అర్థవిపరిణామము

శ్రీ క్రొవ్విడి రామమ్

భాషను ఒక మహాస్రవంతితో విజ్ఞులు పరిపోలుస్తారు. భాష సంతతమూ మారుతూ వుంటుంది. దానికి మార్పు సహజం. నన్నయకాలంలో ప్రవహించిన గోదావరి నదే నేడు కూడా ప్రవహిస్తోంది. కాని దానిలో ప్రవహించే జలాలు అనుక్షణమూ మారిపోతూ వుంటాయి. ఆవిధంగానే ప్రాచీనకాలంనుంచీ వస్తూన్న ఆంధ్రభాషాస్రవంతిలో నిరంతరమూ మనకు మార్పులు గోచరిస్తూనే వున్నాయి.

ఆంగ్లభాషాతత్వవేత్తలు భాషావ్యాప్తికి “వొకాబ్యులరీ” [శబ్దజాలం] “సిమేంటిక్స్” [అర్థవిపరిణామము] “సింటేక్స్” [వాక్యమునందలి వివిధ పదములకూర్పు] “ఫోనోలజీ” [శబ్దోచ్చారణావిధానం] ముఖ్య కారణాలని చెప్తారు. ఈ నాలుగు విధాలలోనూ వొకటైన అర్థవిపరిణామపద్ధతి ఆంధ్ర, ఆంగ్ల భాషలలో యేవిధంగా రూపొందిందో స్థాలీపులాకన్యాయంగా యీ వ్యాసంలో సూచిస్తాను.

కొన్ని పదాల అర్థాలు కాలక్రమేణ విచిత్రంగా మారుతూ వుంటాయి. శబ్దాలతోపాటు అర్థం కూడా మారిపోతూ వుంటుంది. పండితులనక, పామరులనక అందరూ ఆశబ్దాన్ని నిరంతరంగా ఒక విశిష్టమైన అర్థంలో వ్యవహరించడమే యిట్టి మార్పుకి కారణం. ఇలాంటి మార్పులు కలుగుతున్న భాషే సజీవమైన భాష.

(1) అర్థ సంకోచం:—సామాన్యవాచికి విశేష పరత్వం సంభవించడం అర్థవిపరిణామ మార్గములలో ప్రధానమైనది. దీనికే “అర్థ సంకోచ” మని. పేరు. ఈ పద్ధతినే ఆంగ్ల భాషలో “స్పెషలైజేషన్” అని అంటారు. ఆంగ్లంలో, ప్రాచీనకాలంలో FOUL అనే పదాన్ని “పక్షి” అనే అర్థంలో వాడేవారు. అంటే పక్షి అనే సామాన్యార్థాన్ని సూచించడానికి యీ పదం వ్యవహృత మయ్యేది. నేడు “కోడి” అనే పక్షిని మాత్రమే సూచించడానికి యీ పదం ఉపచరిస్తున్నాది.

ఈ విధంగానే DEER అనే పదం పూర్వం ఏ మృగాన్నయినా సూచించేది. నేడు “లేడి” అనే అర్థాన్ని సూచించడానికి మాత్రమే యీ పదం వుపయోగపడుతున్నాది. SHROUD అనే పదాన్ని పూర్వం “బట్ట”కి పర్యాయపదంగా వాడేవారు. కాని నేడు దాన్ని శవంమీద కప్పే బట్టకి మాత్రమే వ్యవహరిస్తున్నారు. WED అనే పదానికి PLEDGE (వాగ్దానం) అనే అర్థమే రూఢిగా వుండేది. కాని ప్రస్తుతం వైవాహికమైన ప్రతినకే యీ పదాన్ని వ్యవహరిస్తున్నారు. Weded to a cause మొదలైన ప్రయోగాలలో Wed అనే పదానికి “కట్టుబడి వుండుట” అనే అర్థం వున్నట్లు నేటికీకూడా ప్రయోగాలవల్ల మనకు తెలుస్తున్నాది.

ఆంధ్రభాషలో యీ “స్పెషలైజేషన్” అనే పద్ధతి అర్థవిపరిణామంలో యెలా గోచరమౌతుందో యిప్పుడు మనవి చేస్తాను. పథ్యము అనే పదానికి హితము లేక మేలు కలిగించునది అని అర్థం. కాని తెనుగులో యీ పదం, రోగనివృత్త్యంతరం రోగికి యిచ్చే ఆహారాన్ని నిర్దేశించడానికిగాని, శిశువు జన్మించిన తర్వాత మాతకు మూడవరోజున యిచ్చే ఆహారాన్ని సూచించడానికిగాని ప్రయోగిస్తున్నారు.

ఉదా: (i) ఉష్ణం వదిలినా నాకు పథ్యం పెట్టలేదు.

(ii) మూడవరోజున బాలెంతరాలికి పథ్యం పెడతారు.

ప్రాచీన గ్రంథాలలో చీర అనే పదం బట్టకు పర్యాయపదంగా వాడేవారు. తలపాగాకు తలచీర అనే ప్రయోగం భారతాది గ్రంథాలలో కనిపిస్తుంది, కాని నేడు ఆ పదం స్త్రీలు కట్టుకునే బట్టకు మాత్రం పరిమితమైవుంది.

కుశలము: కుశల అనే శబ్దానికి సంస్కృతంలో నేర్పు అని అర్థం. ఉదా: అయ మతీవ కుశలః అంటే

యితడు మిగుల నేర్పరి అని అర్థం. కాని తెలుగులో కుశలము అనే శబ్దానికి ఇరుకు అనే అర్థం సంక్రమించింది.

ఉదా: మాయిల్లు కుశలంగా వుండడంచేత దేవాలయంలో పెళ్లి చేశాము. ఇరుకుగా వున్న ప్రదేశాలలో కాలక్షేపం చెయ్యడానికి కొంత నేర్పు అవసరం. గనక, కాలక్రమేణా కుశల శబ్దానికి తెలుగులో ఇరుకు అనే అర్థం సంక్రమించి వుంటుంది. సంస్కృతంలో యీ శబ్దానికి క్షేమము అనే అర్థం కూడా వుంది. "ఉభయకుశలోపరి" వంటి ప్రయోగాలలో ఆ అర్థం నేటికి కూడా తెలుగులో చెలామణీలో వుంది.

ప్రియము: సంస్కృతంలో యీ పదానికి యిష్టమైనది అని అర్థం. నలుగురికీ యిష్టమైన వస్తువు ఎక్కువగా కావాలి గనుక, దానియొక్క ధర పెరగడం సంభవం. కనుక ప్రియశబ్దానికి తెలుగులో "యెక్కువ వెల" అనే అర్థం రూఢమైవుంది.

ఉదా: ఈ సంవత్సరం మామిడిపళ్లు చాలా ప్రియంగా వున్నాయి.

(II) ఒకప్పుడు ప్రత్యేకమైన అర్థంలో రూఢమైన శబ్దం కాలక్రమేణ సాధారణవాచిగా మారిపోతుంది. దీనినే ఆంగ్లంలో "జనరలైజేషన్" అని అంటారు. ఈ పద్ధతి వుభయ భాషలలోనూ విస్పష్టంగా వ్యక్తమవుతుంది.

పలహారం: ఈ మాటకు ఫలములతో కూడిన సాత్వికాహారము అని అర్థమై వుండగా, నేడు అన్నానికి బదులుగా తీసుకునే ఏ ఆహారానికైనా యీ పదం వర్తిస్తున్నది.

ఉదా: ఈరోజు ఆదివారం గనుక రాత్రి నేను అట్లు ఫలహారం చేస్తాను.

తైలం: పూర్వం తిలలనుండి తీసిన నూనెకే యీ పదాన్ని వాడేవారు. తిలలనుంచి వచ్చినది కనుక నే తైలం అయింది. నేడిది ఏ నూనెకైనా పర్యాయ పదంగా వాడుతున్నారు. ఉ॥ భృంగామలక తైలం. నేటి యంత్రయుగంలో పురోగమనానికి తైలం అవసరం గనుక, లోకంలోని సర్వవ్యవహారాలనూ నడిపించే ధనానికి కూడా తైలం అని విద్యార్థిలోకం నామకరణం చేసింది.

చెంబు: చెన్ అనేపదం ఎఱుపుధాతువును సూచిస్తుంది, గనుక పూర్వం రాగిపాత్రకు గాని, ఎఱ్ఱని పాత్రకుగాని చెంబు అనే పదం వ్యవహృతమయేది. కాని చెంబు నేడు పాత్రకు పర్యాయ పదంగా వినియోగపడుతున్నది.

ఉదా: వెండిచెంబు, యిత్తడిచెంబు; కంచు చెంబు మొదలైనవి.

ఆంగ్లభాషలో కూడా "జనరలైజేషన్" అనే అర్థవిపరిణామ పద్ధతి అమలులో వుంది. JOURNEY అనేపదం పూర్వం ఒక రోజుచేసే ప్రయాణానికి మాత్రమే రూఢమై వుండేది. నేడు వివిధమైన ప్రయాణాన్నయినా యీ పదం సూచిస్తున్నది.

COMPANION : ఈ పదానికి "One who eats bread with another" అని అర్థం. చెలికాడు అనే సామాన్యార్థంలో నేడీ పదం చెలామణీ అవుతున్నది.

CARRY : బండిమీద వేసి తీసుకువెళ్లే సందర్భంలోనే ఒకప్పుడీ క్రియను వుపయోగించేవారు. కాని తీసుకొని పోవుట అనే సామాన్యార్థంలో నేడీ పదం వుపయోగపడుతున్నది.

Ex : The boy Carries a bag.

(III) ఒకప్పుడు వుత్కృష్టమైన అర్థాన్ని బోధించే పదాలు కొంతకాలం అయినతర్వాత నీచార్థ బోధకాలుగా మారిపోతాయి. ఈపద్ధతికి "డీజనరేషన్" అని పేరు పెట్టారు. ఈ పరిణామం రెండు భాషలలోనూ యెలా వ్యక్తమవుతున్నదీ తెలియజేస్తాను.

SILLY అనేపదానికొకప్పుడు BLESSED అని అర్థం వుండేది. అందుచేతనే SILLY PEOPLE, INNOCENT PEOPLE గా, అంటే అమాయికులుగా వుండగలిగేవారు. ఒకప్పుడు ఋషులకు యీ పదం విశేషంగా వుండేది. Ex : Silly saints : కాని యీనాడు యీ పదం FOOLISH అనే పదానికి పర్యాయ పదంగా వాడుకలో వుంది.

కృష్ణదేవరాయలు సింహాచలంలో వేయించిన శాసనంలో మూరురాయరగండడు అనే బిరుదవాచకం కనబడుతుంది. ఈ పదప్రయోగాన్నిబట్టి పూర్వం గండడు అనే శబ్దం గొప్ప గౌరవసూచకంగా విజేత అనే అర్థంలో వాడేవారని స్పష్టమౌతుంది. కాని నేడది నీచులు వుపయోగించే దుర్భాషాపరంపరలలో ఒకటిగా మాత్రమే వుపయోగించబడుతున్నది.

(IV) ఒకానొకప్పుడు నీచమైన అర్థాన్ని బోధించే పదాలు, యిప్పుడు ఉన్నతభావసంబోధకాలుగా పరిణమించేయి. దీనికి యింగ్లీషులో "ఎలివేషన్ ఆఫ్ మీనింగ్" అని అంటారు. అంటే కాలక్రమేణ ఆ పదాల లోకవిస్తమైన గౌరవం చేకూరిందన్నమాట. ప్రాచీనకాలంలో "సభికులు" అనే పదానికి జూదగాండ్రు అనే అర్థం ఉండేది. మృచ్ఛకటిక నాటకంలో యీ పదం జూదరులు అనే అర్థంలోనే వాడబడింది. కాని నేడు సభ్యులు అనే అర్థంలోనే యీ పదాన్ని వాడుతున్నారు.

NICE : చాసర్ మహాకవి యీ పదాన్ని FOOLISH అనే అర్థంలో వాడేడు, క్షుద్రాలకు కూడా పట్టుపట్టేవారు మూర్ఖులు గనుక NICITIES ని రొష్టువగా పరిగణించేవారు. ఆరోజుల్లో FOOLISH PEOPLE గా జమకట్టబడ్డారు. కాని నేడు NICE అనే పదానికి సున్నితమైన, చక్కని అనే అర్థాలు వాడుకలోనికొచ్చాయి.

(V) ఒక పదానికి సన్నిహితంగా వుండే వివిధమైన అర్థాలనుబట్టి కూడా ఆ పదం రకరకాలుగా మారుతూ వుంటుంది. ఈ పద్ధతికి "ఎసోసియేషన్ ఆఫ్ ఐడియాస్" అని నామకరణం చేయవచ్చు. HEATHEN ఈ పదానికి HEATH లేక అడవి పొదలలో కప్పబడి వుండేవాడు అని అర్థం. అడవి పొదలలో కప్పబడి వుండేవాడుగనుకనే అనాగరికుడైనాడు. క్రిస్టియన్లు కానివారంతా అనాగరికులని పాశ్చాత్యుల భావం. అందుచేత HEATHEN అనే పదానికి అనాగరికుడు, క్రైస్తవమతాన్ని స్వీకరించనివాడు అనే అర్థం కాలక్రమేణ వచ్చింది.

FINE అనేపదానికి Highly finished, అంటే "మంచి పనివాడితనంగల" అని అర్థం. మంచి పనివాడితనంగల వస్తువు పల్చగా లేక అర్భకంగా వుండడం తటస్థిస్తుంది గనుక Fine అనే పదానికి SLENDER అనే అర్థం సంక్రమించింది. ఉదా: Fine grains, Fine needle. పనివాడితనంగల వస్తువు ఆకర్షణీయంగా వుంటుంది గనుక Fine అనే పదానికి ఆకర్షణీయమైన అనే అర్థంకూడా వచ్చింది. ఉ॥ A Fine picture. పనివాడితనం చూపించినప్పుడు అతిసూక్ష్మవిషయాలను కూడా రూపొందిస్తారు. గనుక FINE అనే పదానికి "సూక్ష్మమైన" అనే అర్థంకూడా వాడుకలోకి వచ్చింది. ఉదా: "The lawer draws fine distinctions between this section and the other section of the T. P. act." ఇక్కడ సూక్ష్మమైన అని అర్థం.

తెలుగులోకూడా యీ పద్ధతి మనకు వ్యక్తమవుతుంది. అధ్వాన్నము అనగా "మార్గమధ్యమందైన అన్నం" అన్నమాట. మార్గమధ్యంలో వండుకు తినే తిండి తృప్తికరంగా వుండదు. గనుక అసంతృప్తికరమైన జీవితవిధానాన్ని సూచించడానికూడా యీ పదం వుపయోగించబడుతున్నాది. ఉదా॥ అతని వృత్తి విడిచిపెట్టినదగ్గరనుంచి అతని బ్రతుకు బొత్తిగా అధ్వాన్నమయిపోయింది.

(VI) అర్థవిపరిణామ పద్ధతిలో "ట్రాన్స్‌ఫరెన్స్ ఆఫ్ మీనింగ్" అని మరొక విధానంకూడా గోచరమౌతుంది. పరస్పరవిరుద్ధమైన అర్థాలు ఒకేపదంలో మనకి గోచరిస్తాయి. ఈసంప్రదాయం ఉభయభాషలలోనూ కూడా మనకు కనబడుతుంది.

కంపు అనే పదానికి "సువాసన" అర్థం పూర్వం వుండేది. కమ్మని అనేశబ్దం కంపు అనే శబ్దంలోంచి వచ్చినదే. "పణ్యారంపు పుణ్యంపు కంపులు" అంటే అపూపసంబంధమైన సువాసనలు అనే అర్థంలో కంపు అనే పదాన్ని ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయలు వాడేడు. కాని కంపు అనే పదానికి దుర్గంధం అనే అర్థం నేడు రూఢమై వుంది. ఆంగ్లంలో మొదట Fast అనే పదానికి Immovable or Firm అనే అర్థం ఉండేది. Ex: Casabianca stood fast on the burning deck. త్వరితత్వంలో కూడా ఈ నిర్విరామత్వం వ్యక్తమవడంచేత, అనగా ఒకేవిధమైన వేగంలో గమనాన్ని సాగించడంచేత FAST అనే పదానికి RAPIDITY అనే అర్థం సంక్రమించింది. ఆ అర్థంలోనే యీ పదం వ్యవహృతమౌతోంది. Ex: My watch is running fast.

ఉభయభాషలలోనూ అర్థవిపరిణామ పద్ధతుల వలన విచిత్రమైన మార్పులను పొందిన మరికొన్ని పదాలను సూచించి యీ వ్యాసాన్ని ముగిస్తాను.

అనుమానము—పరోక్షనిశ్చయము. ధూమాత్ వహ్ని అనుమానమ్. పొగనుబట్టి నిప్పుగలదని నిశ్చయించుట. కాని తెలుగులోమాత్రం యీ పదాన్ని సంశయము అనే అర్థంలో వాడుతారు.

ఉదా:
మన పిటవ కౌ దయ్య
ర్థమునకు పరివింటివాని జూపగ లోకం
బున పెండు లేమి దిల్లం
బనుమానము లేదు తోడరచను నే వానిన్.
[భార-ఉద్యోగ-2 ఆ, 166 వ పద్యం...

అవసన్యులు: సంస్కృతంలో యీ శబ్దానికి "దంపతిగనివారు" అని అర్థం. యుద్ధభూమినుండి పారిపోతున్నవారు, తలపాగా జారినవారు, స్త్రీలు, శరణన్న

వారు అదృష్టులు. కాని తెలుగులో (గుడ్డి, కుంటి మొదలైన అంగవైకల్యం కలవారికి యీ శబ్దాన్ని అన్వయిస్తున్నారు.

అసహ్యము : సహింపశక్యముగానిది. "అసహ్య శిరో వేదనా" దీనికి సంస్కృతంలో భరించరాని తలనొప్పి అని అర్థం. కాని రోత, ఏవగింపు అనే అర్థంలో తెలుగులో యీ పదం వాడబడుతున్నది.

గీర్వాణం : గీర్వాణాః అంటే దేవతలు అని సంస్కృతంలో అర్థం. "గీ రేవ వాణః బాణః ఏషాం తే" అని దీని వ్యుత్పత్తి. తెలుగున గీర్వాణం అంటే గర్వము లేక ఔద్ధత్యము అనే అర్థం వుంది. ఉదా॥ ఏవో నాలుగు యింగ్లీషుముక్కలు వచ్చినంత మాత్రాన అంతగీర్వాణం పనికిరాదు.

ఉచితము : తగినది అని సంస్కృతంలో ఈ పదానికి అర్థం వుంది. కాని డబ్బు పుచ్చుకోకుండా వోక వస్తువుతో యిచ్చినదానిని ఉచితంగా యిచ్చినట్టు తెలుగుప్రజలు వాడుతున్నారు.

ఉదా॥ మూడు వాసననూనె సీసాలు కొన్నవారికి సావిత్రి బొమ్మగల కేలండరు ఉచితంగా యివ్వబడును. (ఒక ప్రకటన !)

దక్షత = సామర్థ్యం. కాలక్రమేణ దక్షత లేకుండుట అంటే యింట్లో వృద్ధులు లేకుండుట అనే అర్థం వచ్చింది. దక్షత లేని యిల్లు అంటే పెద్దవాడు, లేక సమర్థుడు లేని యిలు అని భావం.

ఛాందసుడు : ఛాందసు డనగా ఛందస్సు లేక వేదములు తెలిసినవాడు అని అర్థం. కాని నాగరికత లేకుండా మందంగా వ్యవహరించేవారిని తెలుగులు "ఛాందసులు" లేక "ఛాదస్తులు" అని వ్యవహరిస్తారు. ఈ అర్థంలోనే పాండురంగమహాత్మ్యంలో "సారథి ఛాందసుండు" అని ప్రయోగించాడు రామకృష్ణుడు.

ముష్టి అనే పదానికి పిడికిలి అని అర్థం. గుడ్డివానికి ముష్టివేయండి అనే సందర్భంలో, బిచ్చగాండ్రకు పెట్టే పిడికెడు బియ్యం అని అర్థంవచ్చింది.

ఆంగ్లంలో కూడా యిటువంటి విశిష్టమైన అర్థవిపరిణామాన్ని సూచించే కొన్నిపదాలు యిప్పుడు మనవిచేస్తాను.

Glad : ఈ పదం ఓల్డ్ జర్మన్ Glatt అనే పదంతో సమానమైన అర్థం గలది. ఓల్డ్ జర్మన్ భాషలో దీనికి Smooth లేక నున్నని అనే అర్థం వుండేది. ఈ అర్థం ఆంగ్లంలో old English period లోనే అంతరించి పోయింది. కాని నున్నగావున్నది కాంతివంతంగా వుంటుంది కనుక Glad అనే పదానికి కాంతివంతమైన అనే అర్థం క్రమేణ సంక్రమించింది. "poets speak of a glad spirit" ఇచ్చట Glad అనగా కాంతివంతమైన లేక తేజస్సుతో కూడిన అని అర్థం. కాని నవీన సాహిత్యంలో ఆనందాన్ని సూచించడానికి మాత్రమే యీపదం ఉపయోగపడుతుంది.

Fellow: ఈ పదానికి business partner లేక భాగస్వామి అనిఅర్థం. తర్వాత క్రమేణ Comrade అనే అర్థం ఈ పదానికి సంక్రమించింది. pope మహాకవి "Worth makes a man and want of it a fellow" అని ప్రయోగించడంచేత Fellow అనే పదానికి అయోగ్యుడు అనే అర్థంకూడా సంభవించింది.

Feond (O. E.); Fiend (N. E.) ఈపదం ప్రాచీనాంగ్లభాషలో Feon అనే క్రియకు Past participle గా ఉండేది. ఓల్డు యింగ్లీష్ లోనూ మిడిల్ యింగ్లీషులోనూ అనగా 14 వ శతాబ్దంవరకు Friend అనే పదానికి వ్యతిరేకార్థాన్ని సూచించె పదంగా దీన్ని ఉపయోగించారు. మిడిల్ యింగ్లీష్ పీరియడ్ లో ఫ్రెంచి భాషలోంచి Enemy అనేపదం ఆంగ్లేయులు తీసుకున్న తర్వాత ఈ పదప్రాచుర్యం తగ్గిపోయింది. క్రమేణ ఆత్మకు శత్రువులైనవారిని సూచించడానికి మాత్రమే మతదర్పులలో ఈపదాన్ని వాడేవారు. ఇప్పుడు Devils కి పర్యాయపదంగా విపరీతమైన దుర్మార్గాన్ని సాగించేవ్యక్తులను సూచించడానికే యీపదం వినియోగపడుతున్నది.

పదజాలం భావాన్ని వ్యక్తీకరించటానికి నిర్దేశింపబడినప్పటికీ అసంఖ్యాకమైన భావాలను, భావశబలతను వ్యక్తీకరించడానికి పరిమితమైన పదజాలం చాలదు. అందుచేత వోక్కొక్క పదానికి అనేక అర్థాలు ఆపాదింపబడుతూ ఉంటాయి. సజీవమైన భాషలో యీ అర్థవిపరిణామం అనుక్షణం సంభవిస్తూ ఉంటుంది. ప్రసిద్ధమైన ఆంధ్ర, ఆంగ్లభాషలలో వ్యక్తమయే అర్థవిపరిణామపద్ధతులను యిక్కడ మనవి చేశాను.

శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు గిడుగు రామమూర్తిపంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవం నాడు వెలువడిన వ్యాససంగ్రహంలో తెలుగులో జరిగిన అర్థవిపరిణామాన్ని గురించి చక్కగా ముచ్చటించారు. ఈ నా రచనకు వారి వ్యాసం చాలా తోడ్పడింది. అందుకు వారికి నాధన్యవాదాలు. "Brodley's History of English Language" ఆంగ్లంలో అర్థవిపరిణామపద్ధతినిగూర్చి తెలుసుకోడానికి నాకు తోడ్పడింది.

ఉభయ భాషలలోనూ ఉండే విపరిణామపద్ధతులను ఒకచోట కూర్చి సమన్వయమార్గాన్ని సూచించడమే యీ రచనయొక్క ప్రధానలక్ష్యం.

# అంతరాలు

'కావ్యశ్రీ'

ఆ యింటికి వెళ్ళినతర్వాతకూడా యింకా వెళ్ళకూడదనే అనుకొంటున్నాడు జగన్నాథం. "విశ్వం తన కెంత ప్రాణస్నేహితుడయితే మాత్రం అతను చేసిన పనిని తానెలా అంగీకరించగలడు? ఆ అమ్మాయి యెంత అపురూప సౌందర్యవతి అయితే మాత్రం లేవదీసుకొచ్చి కాపురం పెడతాడా? పేరు పొందిన కళారాధకుడై కూడా అంత అవినీతిగా ప్రవర్తించాడనేగా తానింతవరకూ అతని ముఖం చూడకుండా వూరుకొన్నాడు! అతని చిత్రాలు ప్రపంచాన్నే ఉర్రూతలూగిస్తున్నాయని మురిసిపోదామంటే ప్రాణమిత్రుడు చేసిన యీ సిగ్గులేని పనికి తానెలా సిగ్గుపడకుండా వుండగలడు? ఆదర్శజీవితాన్ని గడుపుతాడనుకొన్న ఆప్తమిత్రుడు—తోటి కళారాధకుడు అంత అవినీతికరంగా ప్రవర్తించినందుకు నిజంగా తానెంత బాధపడ్డాడు!" అని అనుకొంటూనే ఆ యింటి ముందాగిన జగన్నాథానికి "విశ్వం—ఆర్టిస్టు" అన్న సైనుబోర్డు చిరునవ్వుతో స్వాగతం చెప్పింది. ఇక జన్మలో విశ్వం ముఖం చూడకూడ దనుకొన్న జగన్నాథం వేరే పని మీద ఆ వూరు వచ్చి విశ్వం యింటికి రాకుండా వుండలేకపోయాడు! మెట్లు ఎక్కి, వేసివున్న తలుపు తట్టాడు! జవాబు లేదు. "విశ్వం" అని గొంతెత్తి పిలవటానికి యెందుకో బిడియపడి చివరకు తప్పని సరిగా పిలిచాడు. ఎవరూ పలకలేదు. నిరుత్సాహంతో బోర్డు వంక చూచి మెట్లు దిగుతున్నాడు: తలుపులు తెరచిన చప్పుడు విని వెనక్కి చూశాడు, వెంటనే ఆశుకవిత్వంలో ఓ పద్యం చెప్పాలనిపించింది జగన్నాథానికి. తెరచిన తలుపులు పట్టుకొని గుమ్మం మధ్యగా నిలబడి కాటుకళ్ళతో చిరునవ్వు నవ్వుతూ వున్న ఆ ప్రాణమున్న చిత్రపటాన్ని చూచేటప్పటికి "విశ్వం" పొరపడలేదేమో అనిపించింది జగన్నాథానికి! భర్తను విడిచి మరొకడిని వలచిన స్త్రీ యెంత అందకత్తె అయితే మాత్రం తానెలా హర్షిస్తాడు. ఆదర్శాలు, ఆశయాలు అందానికి ఆనందానికి బలిచేసేటంత పిరికివాడా తను? మరి తనకంటె ధీరుడనుకొన్న విశ్వం యెలా పాల్పడ్డాడీ అవినీతికి! తన గుండెనుండు అతనికుండె యెంత పిరికిదో అని సన్నగా నవ్వుకొన్నాడు జగన్నాథం!

ఇంకా మాట్లాడుతాడు ఇంకా మాట్లాడుతాడు అని చూస్తున్న ఆ అమ్మాయికి జగన్నాథం నవ్వు వింతగానే వుంది. అయినా ముక్కూ మొహమూ తెలియని పెద్దమనిషి—అందులోనూ తన యింటికివచ్చి, తన భర్తను చనువుగా పేరుపెట్టి పిలవగలిగిన భర్తస్నేహితుని మరోలా భావించటం భావ్యంకాదని తాను కూడా చిరునవ్వులోనే అడిగింది.

"ఎవరికోసమండీ?"

"విశ్వం లేడా?"

"లేరు; బందరు వెళ్లారు"

"ఎప్పుడొస్తాడు?"

"శివరాత్రికి"

అతను మాట్లాడకుండానే మరో మెట్టుదిగాడు. ఆమె అనుమానిస్తూ అడిగింది.

"మీ పేరు?"

"జగన్నాథం"

ఇంకా అతని సమాధానం పూర్తికాకుండానే ఆమె కాటుక కళ్ళు తళుక్కుమన్నాయి.

"నమస్కారం"

తామరకళికవంటి ముకుళిత హస్తాంజలి చూచి—వినీలరోదసీకుహర విభాసితవినిర్మల తారకాద్యుతుల్లాంటి నేత్రాలు చూచి కవితాభావాలతో కవ్విపోతూవుంది జగన్నాథం మనసు.

"లోపలకురండి"

ముందు నడిచిందావిడ! ఆలోచించకుండానే అనుసరించాడు. నల్లద్దాల కళ్ళజోడుతీసి ఖద్దరులాల్చీ ప్రక్క జేబులో పెట్టి పంచె కుచ్చెళ్ళు సవరించుకొని తోలుసంచీ ప్రక్కను పెట్టుకొని సోఫాలో కూర్చున్నాడు జగన్నాథం!

"మిమ్మల్ని ఎప్పుడూ చూడకపోయినా బాగానే పోల్చుకోగలిగాను." కిలకిలా నవ్వింది.

"ఎలాగ?" విస్తుపోతూ అడిగాడు.

"మీగురించి మావారు చాలా చెప్పారు. రోజూ చెపుతూనే వుంటారు. నా గురించే నటగా రావటం మానేశారట. మీరు మీ స్నేహితుని తిడుతూ వ్రాసిన ఉత్తరం యింకా నా దగ్గర జాగ్రత్తగానే వుంది" వయ్యారంగా నవ్వింది. కానీ జగన్నాథానికి బాధగానే వుంది. రాకుండావుంటే బావుండుననుకొన్నాడు. కాని వచ్చేశాడుగా! బలవంతంగా వెకిలిగానవ్వాడు. "కూర్చోండి — కాఫీ కలుపుకొస్తాను" అంటూ వంటయింట్లోకి నడిచిందావిడ! తనకున్న అభిప్రాయాలు పూర్తిగా మార్చుకోవాలేమో అనుకొంటున్నాడు జగన్నాథం! అంత సంస్కృతి ఆ సౌందర్యం విశ్వంచేతి యింటే కాదు ఇంకెంత పనికైనా చేయించగలవనుకొన్నాడు కాని ఆమెపతిత! పైగా పెళ్లాడినభర్తకు ద్రోహం చేసి లేచివచ్చిన నిందిత! అందుకు ఆమెను గాని విశ్వాన్ని గానీ తాను క్షమించలేడు! కళ ద్వారా లోకంలోని కుళ్ళును కళంకాన్నీ కడిగివేయాలని దృఢసంకల్పంగల విశ్వం యింత పిరికిగుండెవాడని తానెప్పుడైనా అనుకొన్నాడా? ఇంకొకింత అందముంటే మాత్రం తానలా చేస్తాడా? ఎన్నడూ చేయడు.

ఆలోచనలకు అంతరాయం కలిగించేయి ఆమె పలుకులు. "కాఫీ తీసికోండి" కాఫీ కప్పు అందించి యెదురుగావున్న సోఫాలో కూర్చుంది.

"చూస్తారేం? త్రాగండి! నాచేత్తో యిచ్చింది త్రాగరా" యెగతాళిగా చూచి నవ్వింది. ఆమాపులో వాడిదనం జగన్నాథానికి అర్థమైనట్లుంది. మాట్లాడకుండా కప్పు కాళీచేశాడు.

"అర్జంటుగా రమ్మని టెలిగ్రాం వస్తే బందరు వెళ్లారు. రేపు వచ్చేస్తారు. మీ స్నేహితులు లేరుకదా అని మీ రేమీ అనుమానించ నక్కరలేదు. నేనూ మీ స్నేహితురాలినే" అంటూ కులాసాగా నవ్వి — వంగి జారిన పైటను సర్దుకొంటూ తాను కాళీచేసిన కాఫీ కప్పును అందుకొంటూ తనవంక అదోలా చూచి లేచి వెళ్ళిపోతూవున్న ఆమెను చూస్తే జగన్నాథానికి యెందుకో అసహ్య మనిపించింది. చక్కటి శృంగార ప్రబంధంలో కథానాయిక కుంటి దయినట్లుగా బాధపడ్డాడు. అంతలోనే ఆవిడ తిరిగివచ్చి కూర్చుంది.

"మీ కథలన్నీ చాలా చిత్రంగా వుంటాయండీ"

"ఏమిటి చిత్రం?"

"మీ కథల్లోని ఆడవాళ్ళంతా యెరిగివున్న వాళ్ళులా కనిపిస్తారు"

"ఎరిగివున్న వాళ్ళగురించే వ్రాస్తాం గనుక"

ఆవిడ ఒకసారి పైట సర్దుకొని గట్టిగా నిట్టూర్చింది.

"క్రిందటివారం మీ "అనుభూతులు" కథలోని నాయిక — 'రత్న'ను మీ రెరుగుదురా?" వెలవెల పోయిం దావిడముఖం.

"ఫలానావ్యక్తి అని నే నెప్పుడూ యే పాత్రనూ సృష్టించను. కానీ చూచిన వ్యక్తుల అభిరుచులు అలవాట్లు నైతికవిలువలు ఆధారంగా కథలు వ్రాస్తుంటాను. అంతే"

ఆమె ఒకసారి అతని కళ్లల్లోనికి సూటిగా చూచి ముఖం త్రిప్పుకొని చాటుగా నవ్వింది.

"మీ పేరు చెప్పారుకారు" సంకోచిస్తూ అడిగాడు.

"అడగకుండా నే చెప్పమంటారా?" ఆ నవ్వులోని వెటకారాన్ని చూచి సిగ్గుపడ్డాడు జగన్నాథం.

"నా పేరు రత్నకుమారి. మొన్న మీ కథలోని రత్నను చూచినప్పటినుంచీ మా వారు నన్ను రత్నా అనే పిలుస్తున్నారు" చిన్నగా నవ్వి మళ్లా అంది."
"చూశారా మీ కథ ప్రభావం యెంతబలంగా పనిచేస్తూ వుందో. ఈ సారి జగన్నాథంకూడా ఆమెతోపాటు గొంతు కలిపి నవ్వాడు.

"మీ కథ మా గురించే వ్రాశారేమో అనుకొన్నాం"

"అలాగని చాలమంది అనుకొంటూ వుంటారట,"

"మీ కథలంటే నాకు చాల యిష్టం"

"సంతోషం"

మూడు వారాలక్రితం వచ్చిన కథ "ఒక రాత్రి"లో కథానాయికను అంత తేలిగ్గా చూపించారేం?

"ఎందుకలా అనుకుంటున్నారు?

"అంతకుముందు కేమాత్రం పరిచయమైనా లేకుండా ఒక రాత్రి తన యింట్లో పడుకొన్న మగాడితో యెంత యెటువంటి ఆడదైతే మాత్రం అంత అలా ప్రవర్తిస్తుందంటారా?"

"ఇటువంటి విషయాలు మన మిద్దరం చర్చించటం సమంజసం కాదనుకుంటాను."

"ఫరవాలేదు చెప్పండి. సాహిత్య చర్చకు స్త్రీ పురుషభేదాలేమిటి? మీరు పొరపడ్డారని నా అభిప్రాయం"

"ఆ నాయిక అలా చేయదని యెలా చెప్పగలరు"?

"అలాగే చేస్తుందని మీ రెలా చెప్పగలరు?"

"అందుకనే మానవ ప్రవృత్తులకు కారణం పరిస్థితుల ప్రభావం మూలం అన్నాను. వాతావరణం పాత్రలను నడిపిస్తుంది. వాతావరణ శక్తి పాత్ర యొక్క మానసిక విలువనుబట్టి ప్రవృత్తి బలాన్నిబట్టి పనిచేస్తుంది."

రత్న మాట్లాడకుండా నవ్వింది. అతను ముందే నవ్వాడు.

"మీ నాటకల్లోని నాయకుని పాత్రలను చాలా ఉదాత్తంగా సృష్టించారు. అటువంటి ఆదర్శాలు ఆశయాలు ఆచరణలో పెట్టగల సహృదయులు—అటువంటి మహత్తర త్యాగశీలాలుగల ఉన్నతులు వున్నారనుకొనేకంటే—వూహించుకొన్నారనటం సహజమేమో!"

రత్న చేసిన విమర్శనకు ఆమెకుగల సాహిత్య ప్రియత్వానికి అబ్బురపోయాడు జగన్నాథం. విశ్వం అదృష్టాన్ని తలచుకొని లోలోపల కొద్దికొద్దిగా అసూయపడటం ప్రారంభించాడు.

"మీ కథల్లోని నాయకులకు మీ రంటగట్టిన మంచిగుణాలన్నీ మీ సొంతగుణాలే అంటారు మా వారు." ముత్యాల తొలకరిగా నవ్వింది రత్న. ఆమె నవ్వులు చూపులు క్రమంగా మరోలా అర్థంకావటం ప్రారంభించాయి జగన్నాథానికి. అటువంటి నీచ భావన చేసినందుకు మొదట కించపడ్డాడు. కాని ఒక వాస్తవిక రచయితగా ప్రకృతి వ్యక్తులను శక్తులను అర్థంచేసికోగల కవిగా — పేరుపొందిన మానసిక రచయితగా, రత్నను అర్థంచేసికోవటం ప్రారంభించాడు.

"రండి! మా మిత్రులు యీ మధ్య వ్రాసిన చిత్రాలు చూద్దురుగాని" అంటూ లేచింది. వెనకాలే బయలుదేరాడు. ప్రపంచంచేత ప్రశంస లందిన ప్రఖ్యాత చిత్రకారుడు విశ్వం. అతని లేఖినిలో రేఖాప్రఫుల్లత-భావగాంభీర్యం-వర్ణలావణ్యం చూచి యెంతో మురిసిపోతాడు జగన్నాథం. ఆబాల్యమిత్రు లయిన ఆ యిద్దరూ కళాకారులు కావటం అదృష్టం అంది రత్న. అవు నన్నాడతను.

వర్ణచిత్రాలు - తైలచిత్రాలు - పూర్తయినవీ కానివీ-అల్బమ్స్-అన్నీ చూపించింది. మురిసిపోతూ పరీక్షించాడు జగన్నాథం.

"మీ కథల్లోని మగాళ్ళచేత అలా వాగిస్తారు. మీరు మాట్లాడరేమండీ?"

"నా కథల్లోని ఆడవాళ్ళు మీలాగ యెప్పుడూ యేమగాడినీ యిలా ప్రశ్నించలేదు"

"అందుకని—"

"—అనేక తరహాలవ్యక్తు లుంటారు"

పెట్టెలోనుంచి ఒక అసంపూర్ణ తైలవర్ణ చిత్రాన్ని తీసి "ఇది పోటీకోసం వ్రాస్తున్నారు" అని చూపించింది. జగన్నాథం శరీరం నిలువునా గగుర్పొడిచింది. ఆ చిత్రంలో నగ్నంగా వున్న స్త్రీమూర్తిని చూస్తూ తాను ప్రత్యక్షంగా వున్న రత్ననే నగ్నంగా చూస్తున్నట్లు సిగ్గుపడ్డాడు. ఈ చిత్రానికి యీమెనే మోడలుగా తీసుకొన్నాడా ఆర్టిస్టు? ఇందుకేనా యీమెను లేవదీసుకొచ్చాడు? అతని ముఖంవంక చూచి నవ్వింది రత్న. ఆ నగ్నచిత్రాన్ని చూచి మగాడైన తానే అంత సిగ్గుపడుతూ వుంటే తా నలా నవ్వటం ఏమిటి? పైగా పరాయిమగవాడి ప్రక్కను నిలబడి చూస్తూనా? కంగారుపడ్డాడు జగన్నాథం.

"ఇది చూడండి! వరూధిని ప్రవరుని దారి నడ్డగిస్తూవుంది" అంటూ మరొక చిత్రం చూపించింది. ఈసారి ఆమె భుజం అతని జబ్బకు ఆనుకొని వుంది. ఆ సంగతి ఆమెకు తెలిసికూడా ఆమె దూరంగా జరగలేదని జగన్నాథం నమ్మకం. ఇక బొమ్మలు చూచే పరిస్థితిలో లేడతను. అక్కడనుంచి యెప్పుడు బయటపడదామా అని తహతహలాడిపోతున్నాడు. చిత్రాలు చూడటం పూర్తయి

బయటకు వచ్చేస్తూ వుండగా అరటిపండు తొక్క మీద అడుగు వేసి కాలుజారి వెనకాలే వున్న జగన్నాథం మీద పడ్డదామె. కాలుజారిపడ్డ అబలను-అందులోనూ తనమీద పడ్డ నిస్సహాయను పట్టుకోకుండా యేమగాడుంటాడు? అలాగే పట్టుకొన్నాడు జగన్నాథం. మరొక అయిదు నిమిషాల్లో హోటల్లోకి తిరిగి వచ్చాక సోఫాలో వున్న తన తోలుసంచీ తీసికొని "సెలవు" అన్నాడు జగన్నాథం తడబడుతూ!

"ఎక్కడికి వెళతారు?"

"విశ్వం వచ్చాక మళ్లా వస్తాను"

"అంతవరకూ—?"

"హోటల్లో—"

"వీల్లేదు. ఇక్కడే వుండాలి" పటుక్కున అతని చేయిపట్టుకొని సంచీ లాక్కుంది. "మిమ్మల్ని యిలా వెళ్లిపోనివ్వటమే! ఆయన కోప్పడరూ? నా యింటికి వచ్చి హోటల్లో వుంటారా? ఛలేవారే!" అంటూ యింత లేసి కన్నులు చేసి వెటకారంగా చూచింది రత్న. జగన్నాథం మాట్లాడలేదు.

"ఒక్క గంటసేపలా బీచీకి వెళ్ళిరండి. ఇంతలో వంటచేస్తాను." అంటూ అతని సమాధానంకోసం ఎదురుచూడకుండానే వంటయింట్లోకి నడిచింది రత్న. జగన్నాథం వీధి వెంట నడుస్తూ పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు. ఆ రాత్రికి యే హోటల్లోనో గడిపివేయాలనుకొన్నాడు. కానీ హృదయంలోని యే మూలనుంచో యేదో శక్తి బలవంతంగా వ్యతిరేకిస్తూవుంది. మనస్తత్వాన్ని పరీక్షించాలని అటువంటి విచిత్రపాత్ర ద్వారా యెన్నో నేర్చుకోవాలని పైగా తన ధైర్యం మీద నిగ్రహంమీద తనకు చాలా నమ్మకముందని యింకా యేమేమో ఆలోచిస్తూ తిరిగి తిరిగి రాత్రి యెనిమిదింటికి యింటికి వచ్చాడు జగన్నాథం. అప్సరసలా అలంకరించుకొని తనకోసం యెదురు చూస్తున్న రత్నను చూస్తేగాని తాను తిరిగి అక్కడికి వచ్చానన్న సంగతి గుర్తించలేకపోయాడు జగన్నాథం.

"అబ్బా! యింతసేపు యెక్కడున్నారండి. తువ్వాలు కట్టుకోండి. స్నానం చేద్దురుగాని" అంటూ తువ్వాలందించి మరో తువాలు సబ్బుతొట్టె పట్టుకొని బాత్ రూమ్‌కు నడిచింది. జగన్నాథం రక్తనాళాలు అవయవాలు అతను గాకుండా ఆమె చెప్పినట్లుగానే పనిచేయటం ప్రారంభించాయి. ఆసంగతి గుర్తించి కూడా తెలియనట్లుగా వూరుకున్నాడతను.

భోజనందగ్గర మరీ అల్లరిచేసింది రత్నకుమారి, వద్దంటున్నా వినకుండా చేయిపట్టుకుని ఆపినా ఆగకుండా యేమిటావడ్డన? జగన్నాథం విసుక్కున్నాడు. అతని మనసుమాత్రం నవ్వుకుంది. భోజనా లయ్యాక చిలుకలు చుట్టి తమలపాకు లందించింది.

దశమిచంద్రుడు వెన్నెల పన్నీరు చల్లచల్లగా జల్లుతున్నాడు. అతను వరండాలో పడుకొన్నాడు. ఆమె గదిలో పడుకొంది. మధ్య తలుపులు తెరచే వున్నాయి. అయినా ఒకరికొకరు కనిపించరు. లైటు లన్నీ ఆర్పేసింది. బయట వెన్నెల; ఇంట్లో మందమైన చీకటి.

"ఏమండీ నిద్రపట్టిందా?"

"లేదు."

నవ్వింది. అతని గుండెలు దడదడ లాడాయి.

"మీకథలు నాకు బాగా నచ్చుతాయి."

"ధన్యవాదాలు"

"మీకథల్లో అర్థంకాని ఆకర్షణవుంది."

అతను మాట్లాడలేదు. ఆమెకూడా కాస్సేపు వూరుకొని మరలా అంది.

"మీరు స్త్రీ హృదయాన్ని బాగా అర్థం చేసుకున్నారు. ఇదంతా మీ అనుభవమా?"

అతను మాట్లాడలేదు.

"మీరు మీస్నేహితుని తిడుతూ వ్రాసిన ఉత్తరం మీకు జ్ఞాపక ముందా?"

"ఉంది."

"అన్నినీతులు మీ కెలా తెలిశాయండీ?"

అతను మాట్లాడలేదు.

"మీ రచనలను బట్టి మీ ఉత్తరాన్ని బట్టీ చూస్తూ వుంటే మీరు సాక్షాత్తూ ఋషిపుంగవుడిలా కనుపిస్తారు. ఎంత నిగ్రహం. యెంత ధైర్యం—యెంత పట్టుదల. అందుకనే యెన్నాళ్లనుంచో మిమ్మల్ని చూడాలని—మాట్లాడాలని యెదురుచూస్తున్నాను. మేమిద్దరం పిరికివాళ్లం. కాబట్టే మనసును అదుపులో పెట్టలేక యిలా చేశాం. మీరయితే...అబ్బో మీకథల్లోని నాయకుల్లాగ సాక్షాత్తూ బ్రహ్మపదార్థమేగా!"

అతను మాట్లాడలేదు.

"రాక రాక మీరు రావటం — మీ మిత్రులు లేకపోవటం — మీ కిష్టం లేని చేసొక్కర్తె నే వుండటం విచిత్రంగా వుందికదూ."

ఈసారి కూడా అతను మాట్లాడలేదు.

"ఈ ప్రశ్నలను మీరెలా తర్కిస్తారు ?"

అతను మాట్లాడలేదు.

"నిద్రపట్టిందా ?"

"అవును !"

అతని సమాధానం పచ్చి అబద్ధమని యిద్దరకూ తెలుసు. నిద్రపోయేవాడు నిద్రపోతున్నా నని సమాధానం యెలా చెపుతాడు ! అందుకనే నవ్వింది రత్న. మలేరియాజ్వరం వచ్చినవాడిలా గడగడ లాడాడు జగన్నాథం. నిజానికి యెంత ప్రయత్నించినా రెప్ప వాలటంలేదు జగన్నాథానికి.

"ఏమిటి యీ మనిషి ప్రకృతి ? యేమిటి యీ ప్రవృత్తి ! లేచివచ్చినదాని బుద్ధి... అయినా రస వత్తర కళాఖండానికి కథానాయిక కాదగిన లక్షణా లన్నీ వున్నాయి రత్నకుమారికి ! అయితే యీ సన్ని వేశం యెలాముగుస్తుంది — యీ సంయోగంయొక్క ఫలిత మేమిటి ?" ఇలా యెంతసేపు ఆలోచించాడో తెలియదు. మాగన్నుగా కునుకు పట్టింది.

సుమారు రాత్రి రెండుగంటలవేళ జగన్నాథం త్రుళ్లిపడి లేచాడు. చూశాడు. ఏమీ లేదు. లేచి మంచంమీద కూర్చుని చుట్టూవెదికాడు. ఎవ్వరూ లేరు. అప్పటికే చంద్రుడ స్తమించటంవల్ల అంతా చీకటిగావుంది. ఉన్నట్టుండి ఒక్కసారిగా రత్న జ్ఞాపకంవచ్చింది. ఉద్వేగంగా లేచి మంచందిగి మత్తుమత్తుగానే తిన్నగా రత్నకుమారి మంచందగ్గరకు వెళ్లాడు. ఆమె మైమరచి నిద్రపోతూవుంది. మీద చేయివేశాడు. ఆమె మాట్లాడలేదు. రెండు చెంపలనూ అరచేతుల్లోకి తీసుకొని ముందుకువంగాడు ! అప్పటికీ ఆమెలో చలనం కలగలేదు. ఆ నాలుగు పెదవులకు మధ్య యింక ఒక్క అంగుళం అంతరం వుండనగా "ఎవరూ" అంటూ త్రుళ్లిపడి లేచికూర్చుంది రత్న. బిత్తరపోయి "నేను రత్నా" అని చాలినంత మెల్లగా అన్నాడు జగన్నాథం.

"ఆఁ ! మీరా ! ఏమిటిపని ?"

గడగడలాడి పోతున్నాడు జగన్నాథం !

"అన్నయ్యా ! జీవితానికీ రచనలకూ యింత వ్యత్యాసముంటుం దని యెప్పుడూ అనుకోలేదు. మీరు మీ మిత్రుని తిడుతూ వ్రాసిన పదిపేజీల ఉత్తరంలో మేమిద్దరం మనసు పడుసుకొని బలహీనుల మన్నారు. మాకు కావలసింది మేము నిర్భయంగా చేశాం. నిజాయితీగా బ్రతుకుతున్నాం ! ఎవరు బలహీనులు మీరా మీ స్నేహితులా ? మీ ఉత్తరంలో మీరు బోధించిన నీతు లన్నీ మాపిల్లలకు బోధించాలని ఆ వుత్తరాన్ని ప్రాణప్రదంగా దాచాం ! ఇంత బలహీనమైన హృదయంలోని ఆశయాలు మా కెందుకు ! మీ ఉత్తరాన్ని మీరే పట్టుకువెళ్లండి" అంటూ ట్రంకుపెట్టెదగ్గరకు వెళ్లి లైటువేసి ట్రంకు తెరచి ఉత్తరం తీసి ఇటుతిరిగి "యిదిగో" అంది. కానీ అక్కడ జగన్నాథం లేడు. వరండాలోనూ హాల్లోనూ వెదికింది యెక్కడా లేడు. వీధితలుపులు తెరచివున్నాయి. త్వరత్వరగా వెళ్లి చూచింది. వీధిలో కూడా లేడు. మెట్లుదిగి రోడ్డుమీదికి వచ్చి చూచింది. వీధి చివర మలుపులోవున్న వీధి లైటు కాంతిలో స్పష్టంగా కనుపించాడు జగన్నాథం ! లాల్చీ తొడుక్కోకుండా భుజంమీద వేసికొని — లోలుసంచీ చంక పెట్టుకొని తలవంచుకొని చటుక్కున మలుపు తిరిగిపోయాడు జగన్నాథం.

# దూతమత్తేభము

కళాదాస

* ఉత్తరమేఘము *

మెఱుపుల్ తేలు మెలంతలన్ — సురధనుః సందీప్త చిత్రంబులన్,
మురజావర్త సహాయగేయముల — మంద్రామంత్రణా ఘోషణన్
తరళాంతర్జల పానశాలల — దివిన్ ముద్దాడు ప్రాసాద పం
క్తులు నీతో తుల వచ్చు నయ్యలకయం దాయా విశేషంబులన్

ముఖ బింబంబులు మంచి లొద్దుగల పుప్పొళ్ళన్ విసాళింప, కే
లను లీలాకమలంబు — ముంగురులలోనన్ బాల కుందంబు — క
ర్ణములన్ కాంత శిరీషపుష్పములు — చూడాపాళి గోరంట పు
వ్వులు — సీమంతమునన్ కదంబకుసుమంబుల్ దాల్తు, రచ్చో సతుల్.

నిరతంబున్ స్రవియించు వృక్షముల మాద్యద్భృంగముల్ మూఁగ, ప్ర
త్యహమున్ పూచు సరోజినీతతికి హంసల్ మేఖలల్ కూర్పు, ఎ
ల్లపుడున్ కంఠము లెత్తి యింటి నెమిళుల్ పింఛంబులన్, విప్పు, ర
మ్యము లా రేలును నిత్యచంద్రికలు చీకట్లార్పగా నప్పురిన్.

కనులన్ నీ రుదయింప దే కతన నానందోద్ధతిన్ గాని, ఇ
ష్టరతిన్ దీఱిన కామ తాపమునకంటెన్ వేఱు లే దేదియున్;
పోలయల్కన్ బడి గాక దుర్విరహతాపం బన్యథా రాదు, త
త్పురవిత్తేశుల కొక్క జవ్వనము తక్కన్, లే వవస్థాదులున్.

అచటన్ యక్షులు మత్తకాశినుల జోడుంగూడి, వజ్రాల మే
డలపై చుక్కలు పూలు చల్ల, భవదల్పానల్పగర్జోప వ
ర్జనగా మీటుచు పుష్కరాది సురవాద్యంబుల్ — నిషేవింత్రు క
ల్పకజాతాసవ మిచ్చలున్ — రతిఫలోపాదేయ పేయంబుగన్.

తనుపన్ గాంగపయస్సుశీతమరుదంకూరంబు, లత్తీర వ
ర్ధిత మందారము లెండవేడిమి నివారింపన్ నిజచ్ఛాయలన్,
తమ గుప్పిళ్ల సువర్ణవాలుకను కెంపుం దాచి—పోయించి కు
ప్పలు—దానిన్ వెదకింత్రు క్రమ్మర సురల్ కామింప కన్యామణుల్.

సడలన్ నీవి గగుర్చు హస్తముల చీరల్లాగ చిల్లాడు ప్రే
యసులన్ సిగ్గున చూచి—మూఢ లయి—రత్నజ్వాలికాదీపికా
వళి నార్పన్ తమకించి, కుంకుమను గుప్పిళ్లాదిగా చల్లియున్,
విఫలప్రేరణకండ్లు మూతు—రలకా శుద్ధాంతబింబాధరల్

నడురేలన్ ప్రియు లల్లనల్లన కవుంగిండ్లన్ సడల్పన్, రతో
త్సవన క్లాంత లతాంగనామణుల ఆయాసంబులన్ తీర్పు—నీ
యవరోధంబు తొలంగి వెన్నెలలు కాయన్—తద్విమానాత్మ తం
తువులన్ జాఱు సితోపలద్రవకణంబుల్, సన్నగా ధారలై.

పురి యంతస్తుల మేడలన్ పయర ప్రేరేపింపగా దూఱి, అ
చ్చటి చిత్రంబుల వన్నెలాఱ తడిచిన్కుల్ రాల్చి—శం కొన్నదుం
బలె—నీవంటి ఘనుల్ బయల్పడుదు, రేతత్ జాలక ద్వార సం
ధుల—ధూమానుకృతిప్రవీణు లయి ఛిద్రచ్ఛిన్న రూపంబులన్,

నిధులెల్లన్ భవనాంతరాళముల నక్షీణంబులైయుండ, నా
పురభోగుల్ తనివో సుఖించెదరు బాహ్యోద్యాన విభ్రాజ వీ
ధుల, ముచ్చట్లు పెనంగ నచ్చరలు వోలెన్ వారముఖ్యాంగనల్;
సరసన్ కంఠము లెత్తి పాడగ కుబేరశ్లోకముల్ కిన్నరుల్.

రవిరాకన్ పొడకట్టు జాడ—లలకాంతస్రస్తమందారముల్—
స్తనభార త్రుటితాంకసూత్రములు—ముక్తాజాలముల్—కర్ణని
ర్గళితస్వర్ణ సరోజపత్రశకలంబుల్—తత్పురీకామినుల్
గతికంపోత్కలు తోచు పోయిన నిశామార్గంబు లమ్మై యెడన్.

ధనద స్నేహితుడై త్రినేత్రుడచటన్ సాక్షాత్కృతుం డౌటచే,
మదనుం డెక్కిడ లేదు భీతి భ్రమర జ్యా చాపమున్; కాని తత్
పురభామల్—బొమవిండ్లు వంచి—తరితీపుం జూపులన్ చిమ్మగా—
స్మరయత్నంబు ఫలింప తాకు ప్రణయాంతర్మర్మముల్ సూటిగన్.

పలువన్నెల్ గల చీరెలుఁ—నయనలీలా విభ్రమంబుల్ నయిం
చు మధుస్వాదనముఁ—లతాంతములతో విప్పారు పుష్పంబులున్—
బహుభూషాభరణంబులుఁ—చరణశోభా లేప లాక్షారసా
దులు—నిచ్చుఁ వనితాప్రసాధనల కచ్చో కల్పకం బొక్కటే.

కల దస్మత్ గృహ, మా కుబేరుని సుఖావాసాంతికం బం—దుదీ
చిని—కానంబడు తోరణంబు సురచాపం బట్లు మున్ముందె అం
దముగా—దత్తుని బోలె పొంత శిశుమందారంబు మత్కాంత పెం
చిన దింపారును—చేతి కందు పువుగుత్తుల్ భారమై వంచగన్.

త దళిందంబునకుఁ హరిన్మణుల సోపానీయమై బావి యు
న్నది—వైడూర్యమృణాలముల్ కనకకంజాతంబులఁ కప్ప—తత్
జలముల్ దుర్దిన దోషసంకులము కామిఁ—కాపురం బున్న యం
చలు దాపైనను మానసాభిముఖ చింతఁ బోవు నిఁ చూచియున్.

శిఖరశ్రేణిక స్నిగ్ధనీలమణులఁ జెన్నొందు, చుట్టుఁ బసిం
డి యనంటుల్ తలపాగయ క్లైదిగి చూడంజక్కనౌ మత్సఖి
ప్రియ కేళీనగముఁ స్మరించి, సఖుడా! సందీప్త సౌదామినీ
నికటశ్యాముని నిన్ను చూచి, —అది నీవంచుఁ—ప్రకంపించెదన్

పసిగోరంటలు చుట్టికొన్న నవవాసంతీనికుంజంబు పొ
త్తున—పుష్పించిన వంజళంబు—కిసలా లోలారుణాశోకమున్—
కల; వం దొక్కటి—నావలెఁ—వలచు కాంతాపాదపాథోజతా
డన—మిం కొక్కటి తన్ముఖాసవ రసంబుఁ—దోహదవ్యాజతన్

మఱియుఁ, తత్తరుమధ్య నొప్పు కనకస్తంభంబు— తన్మూలవే
దిక లేలేత వెదుళ్ల వన్నెమణులఁ జెక్కంబడెఁ—కొమ్మపై
నమరుఁ సుస్ఫటికాలపీట—పగలాడింపంగ మత్కాంత గా
జులతాళంబుల నీ మయూరసఖు డెక్కుఁ సందెలఁ దానిపై.

మది నాచెప్పిన చిహ్న లేమఱక మాయింటిఁ విచక్షింపు మో
కుశలగ్రామణి! శంఖచక్రముల రూపుల్ ద్వారపార్శ్వంబులన్
గల; వన్మద్విరహాతిరేకమున క్షామచ్ఛాయతో లేమయుం
డును—శోభిల్లునె పద్మినీప్రభలు మిత్రాపాయ వేధసితిన్

తనుపన్ గాంగపయస్సుశీతమరుదంకూరంబు, లత్తీర వ
ర్ధిత మందారము లెండవేడిమి నివారింపన్ నిజచ్ఛాయలన్,
తమ గుప్పిళ్ల సువర్ణవాలుకను కెంపుం దాచి—పోయించి కు
ప్పలు—దానిన్ వెదకింత్రు క్రమ్మర సురల్ కామింప కన్యామణుల్.

నడలన్ నీవి గగుర్చు హస్తముల చీరల్ లాగ చిల్లాడు ప్రే
యసులన్ సిగ్గున చూచి—మూఢ లయి—రత్నజ్వాలికాదీపికా
వళి నార్పన్ తమకించి, కుంకుమను గుప్పిళ్లాదిగా చల్లియున్,
విఫలప్రేరణకండ్లు మూతు—రలకా శుద్ధాంతబింబాధరల్

నడురేలన్ ప్రియు లల్లనల్లన కవుంగిండ్లన్ సడల్పన్, రతో
త్సవన క్లాంత లతాంగనామణుల ఆయాసంబులన్ దీర్పు—నీ
యవరోధంబు తోలంగి వెన్నెలలు కాయన్—తద్విమానాత్మ తం
తువులన్ జాఱు సితోపలద్రవకణంబుల్, సన్నగా ధారలై.

పురి యంతస్తుల మేడలన్ పయర ప్రేరేపింపగా దూఱి, అ
చ్చటి చిత్రంబుల వన్నెలాఱ తడిచిన్కుల్ రాల్చి—శం కాస్పదం
బలె—మీవంటి ఘనుల్ బయల్పడుదు, రేతత్ జాలక ద్వార సం
ధుల—ధూమానుకృతిప్రవీణు లయి ఛిద్రచ్ఛిన్న రూపంబులన్,

నిధులెల్లన్ భవనాంతరాళముల నక్షీణంబులైయుండ, నా
పురభోగుల్ తనివో సుఖంచెదరు బాహ్యోద్యాన విభ్రాజ వీ
థుల, ముచ్చట్ల పెనంగ నచ్చరలు వోలెన్ వారముఖ్యాంగనల్ ;
నరసన్ కంఠము లెత్తి పాడగ కుబేరశ్లోకముల్ కిన్నరుల్.

రవిరాకన్ పొడకట్టు జాడ—లలకాంతస్రస్తమందారముల్—
స్తనభార త్రుటితాంకసూత్రములు—ముక్తాజాలముల్—కర్ణ ని
ర్గళితస్వర్ణ సరోజపత్రశకలంబుల్—తత్పురీకామినుల్
గతికంపోత్కలు లౌచు పోయిన నిశామార్గంబు లయ్యె మెడన్.

ధనద స్నేహితుడై త్రినేత్రు డచటన్ సాక్షాత్కృతుం డౌటచే,
మదనుం డిక్కడలేడు భీతి భ్రమర జ్యా చాపమున్ ; కాని తత్
పురభామల్—బొమవిండ్లు వంచి—తరితీపుం జూపులన్ చిమ్మగా—
స్మరయత్నంబు ఫలింప తాకు ప్రణయాంతర్మర్మముల్ సూటిగన్.

పలువన్నెల్ గల చీరెలున్—నయనలీలా విభ్రమంబుల్ నయిం
చు మధుస్వాదనమున్—లతాంతములతో విప్పారు పుష్పంబులున్—
బహురూపాభరణంబులున్—చరణశోభాలేప లాక్షారసా
దులు—నిచ్చున్ వనితాప్రసాధనల కచ్చో కల్పకం బొక్కటే.

కల దస్మత్ గృహ, మా కుబేరుని సుఖావాసాంతికం బం—దుదీ
చిని—కానంబడు తోరణంబు సురచాపం బట్లు మున్ముందె అం
దముగా—దత్తుని బోలె పొంత శిశుమందారంబు మత్కాంత పెం
చిన దింపారును—చేతి కందు పువుగుత్తుల్ భారమై వంచగన్.

త దళిందంబునకున్ హరిన్మణుల సోపానీయమై బావి యు
న్నది—వైడూర్యమృణాలముల్ కనకకంజాతంబులన్ కప్ప—తత్
జలముల్ దుర్దిన దోపసంకులము కామిన్—కాపురం బున్న యం
చలు దాపైనను మానసాభిముఖ చింతన్ పోవు నిన్ చూచియున్

శిఖరశ్రేణిక స్నిగ్ధనీలమణులన్ చెన్నొంద, చుట్టున్ పసిం
డి యనంటుల్ తలపాగయ ల్లెదిగి చూడంజక్కనౌ మత్సఖి
ప్రియ కేళీనగమున్ స్మరించి, సఖుడా! సందీప్త సౌదామినీ
నికటశ్యాముని నిన్నుచూచి, —అది నీవంచున్—ప్రకంపించెదన్

పసిగోరంటలు చుట్టికొన్న నవవాసంతీనికుంజంబు పొ
త్తున—పుష్పించిన వంజళంబు—కిసలాలోలారుణాశోకమున్—
కల; వం దొక్కటి—నావలెన్—వలచు కాంతాపాదపాథోజతా
డన—మిం కొక్కటి తన్ముఖాసవ రసంబున్—దోహదవ్యాజతన్

మఱియున్, తత్తరుమధ్య నొప్పు కనకస్తంభంబు— తన్మూలవే
దిక తేలేత వెదుళ్ల వన్నెమణులన్ చెక్కంబడెన్—కొమ్మపై
నమరున్ సుస్ఫటికాలపీట—పగలాడింపంగ మత్కాంత గా
జులతాళంబుల నీ మయూరసఖు డెక్కున్ సందెలన్ దానిపై.

మది నాచెప్పిన చిహ్న లేమఱక మాయింటిన్ విచక్షింపు మో
కుశలగ్రామణి! శంఖచక్రముల రూపుల్ ద్వారపార్శ్వంబులన్
గల; వస్మద్విరహాతిరేకమున క్షామచ్ఛాయతో లేమయుం
డును—శోభిల్లునె పద్మినీప్రభలు మిత్రాపాయ వేధసిలిన్

సులభం బౌను ప్రవేశ మందు గజశాబం బంత రూపీవు తా
ల్చిన—నే చెప్పిన రమ్యసానువులలో క్రీడాద్రి గూర్చుండి—పి
మ్మట నంతఃపుర శాలలన్ బఱపు మల్పాల్పంబుగా—క్రొమ్మిణుం
గురుబంతుల్ బలె—నీకటాక్ష తటిదంశుస్నిగ్ధజాలంబులన్—

అజు డాదిన్ సృజియించినట్టి లలనాలంకార మాలేమ—ప
ల్చనిమైచాయల చాన—పల్కుదురు మొగ్గల్ గుల్కు బింబోష్ఠి—సు
స్తనభారానత సుందరాంగి—నతనాభి ప్రభజితాద్యష్టశా
లిని—శ్రోణీభరమందయాన—చకితైణీ లోచనాపాంగయుక్.

నను దూరంబుగ బాసి—భగ్నసహవాస క్లేశయా చక్రవా
కివలెన్—భాషలు మాని—ఒంటరిగ నింటన్ మద్బహిఃప్రాణము
న్నది గుర్తింపుము; కాని దీర్ఘదివసోత్కంఠన్ కళల్ మాసెనో?—
శిశిరోత్పీడిత పద్మినిన్ బలె—నటంచున్ సందియం బందెదన్.

చెలి కన్నుంగవ యేడ్చియేడ్చి పొర లుబ్బన్, మోవి నిట్టూర్పు కా
కలలో కంద, నఖముఖంబు అఱచేతన్ వ్రాలి—వ్రేలాడు ముం
గురులన్ జిక్కి—సమగ్రశోభల కనన్ రాదేమొ? యుష్మన్నిరో
ధమునన్ మాసిన చందమామ పగిదిన్—దుర్వేద నాధీనతన్.

సఖ! నా జాయను చూతువీవు—బలిపూజా మగ్నగానో—వియో
గమునన్ క్రుస్సిన నాదుపోలికల నూహన్ వ్రాయగానో—సుబా
షిణి మాపంజరశారికన్ "రసిక! నీ నాథున్ స్మరింతే ప్రియా
స్పద మీ వానాయన కంచు" లాలితరుతిన్ పృచ్ఛించు చుండంగనో.

మలిన ప్రావృత మైన అంకమున వీణన్ బెట్టి గాంధార సం
గతి మద్గోత్రపదాంక గేయములు పాడన్ బోయి, కన్నీటితో
తడిసై మ్రోగని తీగలన్ తుడిచియున్ పయ్యంట, తన్మూర్ఛనా
క్రమభంగుల్ మఱచున్ స్వయంకృతము లయ్యున్ మాటికిన్ మాటికిన్.

విరహారంభము నుండియున్ మిగత శాపావశ్య మాసంబులన్,—
గడపన్ పువ్వులు పెట్టి—తీసి భువి నిక్షేపించి లెక్కించు చున్;
హృదయాస్వాద రతిప్రతీతిని మనంగా జూతు వన్మత్ సఖిన్;
సఖుడా! ఇట్టి వినోదముల్ విరహిణీ ప్రావృత్తికంబుల్ గదా.

సశేషము

# నృత్తనాట్యములు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

నాట్యంలో కరణాలు కొన్ని వివరింపబడ్డవి. హస్త పాద సమాయోగాన్ని తెలిపే నృత్తక్రియను కరణ మంటారు. హస్తమునకు పూర్వకాయ మని, పాదమునకు అపరకాయ మని అర్థము చెప్పుకోవాలి. ఈ హస్త పాద సమాయోగంవలన కలిగే కరణాలద్వారా సవిలాసత్వ మనబడే సౌందర్యం నృత్తానికి వస్తుంది. అందుచేత నృత్తశబ్దానికి నృత్తకరణ మనే అర్థం చెప్పుకోవాలి.

ప్రతికరణంలోను అవస్థానము, గతి అనే రెంటిని నిర్వర్తించాలి. అవస్థానానికి కరణోపయోగి ఐనది స్థానకము. గతిలో ఉపకరించేది చారీ. పూర్వకాయంలో చేయబడేవి నృత్త హస్తాలు, దృష్టులు. స్థితిలో వచ్చేవి పతాకాదులు. స్థానము, చారీ, నృత్త హస్తము అనేవి కరణానికి మాతృకవంటివి. వీటి అన్నింటి సంయోగంతో కరణం సిద్ధిస్తుంది. కరణాలను పట్టేటప్పుడు సౌష్ఠవాంగ ముండాలి. కటి ప్రదేశము చెవితో సమరేఖలో ఉండగా, బుజాలమధ్య తిన్నగా వంపులేని తలను ఉంచాలి. అప్పుడు వక్షము సమున్నతమైతే వచ్చేది సౌష్ఠవాంగము. ఇట్టి కరణాలతో సిద్ధించేవాటిని అంగహారా లంటారు.

ఇరువదిరెండవదైన చిత్రాభినయాధ్యాయములో నీ కరణములకు విశేష వినియోగములను చెప్పుచు, ఇవిగాక అనేక నృత్తవిషయాలు గలవని, వాటిని లోకానుశీలనముచేసి గ్రహించవలె నని భరతుడు చెప్పినాడు. లోకము, వేదము, అధ్యాత్మము అను మూడు ప్రమాణములున్నవి. ఈ మూటిని ఆశ్రయించుకొని నాట్యము బయలుదేరుచున్నది. "లోకసిద్ధాని ప్రత్యక్షానుమానాగమ ప్రమాణాని లోకశబ్దేనోచ్యతే" అని అభినవగుప్తుడు లోకశబ్దమునకు చిత్రాభినయాధ్యాయమున అర్థము చెప్పినాడు. ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అను ప్రమాణముల ద్వారా సిద్ధమైన నాట్యము లోకసిద్ధము. వేద మనగా "యథా స్వనియతిరూపో లోకప్రసిద్ధో ఒప్యాగమో యథా న్యాయేషు ధనుర్వేద స్వర తాలాదౌ గాంధర్వవేద ఇత్యాది" అని ఆ అధ్యాయమునందే నిర్వచించుచు, వేదశబ్దానికి గాంధర్వాద్యుపవేదములను అర్థమును అభినవగుప్తుడు చెప్పియున్నాడు. అధ్యాత్మ మనగా స్వసంవేదనము. ఈ మూటిలోను లోకసిద్ధమైనది ప్రధానము. లోకసిద్ధము నాట్యమును పరిత్యజించ వీలులేదు గనుక చిత్రాభినయాధ్యాయమున "న హి లోకప్రసిద్ధి మపహ్నోతుం కశ్చిత్సమర్థః, సువిప్రతిపన్నా హ్యసౌ తదపహ్నవే కాష్ఠపాషాణతాపత్తి ప్రసంగాత్" అని అభినవగుప్తు డనినాడు.

ఇట్లు సిద్ధించు కరణములు, తద్వినియోగములు అనేక విధాలుగా కల్పించగలవు. భిన్న భిన్న నాట్యాచార్యు లధికవినియోగములను చెప్పియున్నారు. ఈ అధికపాఠములను చెప్పినవారిలో కోహల, రాహుల, కీర్తిధరులు ప్రధానులు. వీరి పాఠములను అప్రామాణికము లని త్రోసివేయరాదు. చిత్రాభినయాధ్యాయమున "కోహలాది శాస్త్రలక్ష్య ప్రవాహసిద్ధ మపి చిత్రాభినయం సూచయతి తతశ్చోదాహరణం సంవర్త్య యామో మాభూత్ సంప్రదాయప్రవాహవిచ్ఛేదః" అని అభినవగుప్తు డనినాడు. కోహలాదులు పఠించిన విశేషవిధులుకూడ సాంప్రదాయికములే నని అంగీకరించుచు ఆపై తన్మతానుసారములగు శ్లోకములను కూడ చెప్పినాడు.

లయతాలాదులు నృత్తమున కంగములు. వర్తమానాది గీతప్రయోగమునకు, ఉపకరణసహితమైన నృత్తప్రయోగమునకు లయతాలాదులు అదృష్టఫలమును సంపాదించునవి. వీని యొక్కడ ప్రధానమో ఆప్రయోగమున మిగిలిన సన్నివేశములు దాని అంగములుగా స్వీకరింపబడవలెను. కాగా నృత్తమున కదృష్టఫల సంపాదనను ప్రధానముగా పెట్టుకొనిన చోట గీతకాదులు నృత్తము నాశ్రయించుకొని యుండును. కావుననే ఐదవ అధ్యాయమున తాండవము

ప్రధానముగా నున్నచోట గీతకాదు లంగములని చెప్పబడినది (ర. 13) నాట్యమున కంగముగా గీతికమును గ్రహింపవలెను. ఈ అంగాంగీభావమును యోగ్యత్వము ననుసరించి కూర్పవలెను. ప్రధాన విషయముతో అంగములు సంవిధాన యోగ్యములై ప్రయోగింపబడ వలయునని భావము.

నృత్తము నాట్యముకన్న భిన్నమైనదా కాదా, భిన్నమైనచో ప్రయోజనముతో కూడి యున్నదా, లేదా? అంగ విక్షేప నృత్తగీతాదులు నృత్త నాట్యములలో రెంటియందును కన్పించుటచే నివి భిన్నములన వీలు లేదు. నృత్తమున పాడబడు గీతములలోని పదార్థ వాక్యార్థములు నాట్యార్థమున లీనమగుచున్నవి. నృత్తమునగల ఏకపాత్రాహార్యము నాట్యమున కూడ ఆకాశ భాషితాదులయందు, భాణ రూపకమునగలదు. ఉభయత్ర అభినయము వాచ్యానుగతమై గాత్ర విక్షేపాల ద్వారా అర్థము ప్రతిపాదితమగుచున్నది కావున నృత్త నాట్యములకు భేదము లేదని వార్తిక కారుడు సిద్ధాంతించినాడు.

"ప్రియతిమునుగ కీర్తన పరయై నృత్యము చేయుచున్నది" "కలహాంతరిత నృత్యము చేయుచున్నది," "ఖండిత నృత్యము చేయుచున్నది" అను ప్రయోగముల ద్వారా నాట్యమున సాక్షాత్కార బుద్ధి కలదని తెలియగలదు. కాని గీతమూల రూపకాభినయ నిర్మాణము నాట్యముకన్న విలక్షణమైనది. నాట్యము భావరస సంప్రయుక్తము. నాట్యమున కథయుత రూపకము వాద్యాభినయములలో గీతము ఉపరంజకము కాగలదు. ఏనను ఆసీన పాఠ్యాదులయందు వాచికాభినయము కన్పించుటచేత ఆహార్య సాత్త్విక ఆంగికాభినయములు కూడ ఉభయత్ర కన్పించుటచేతను నృత్తనాట్యము లభిన్నములని సిద్ధమగు చున్నది.

నృత్త స్వభావము లౌకికమా అలౌకికమా? నృత్త స్వభావము ఘటాది వస్తుతుల్యముగాని తదను కారము గాని, తత్ప్రతి బింబాది రూపముగాని కావలెను. ఈమూడు విధములలో నృత్తము నాట్యచ్ఛాయ ఔతుంది. కాని నృత్తస్వభావము లోకోత్తరమైనచో నృత్తము నాట్యంలోని అవాంతర భేద మౌతుంది. అవాంతర భేద మైనా నిష్ప్రయోజనం కాజాలదు.

నృత్తనాట్యముల స్వభావప్రయోజనాలు తుల్యము లగుటచేత నాట్యముకన్న నృత్తము భిన్నమైనది కాదు. రాఘవవిజయాది రాగకావ్యాది ప్రయోగముల నాట్యముతో నే అభినయము జరగాలి. చలనము, ఆవర్తనము, భ్రూక్షేపము, తారాచలనము, చరణ, ధారణ, కంప, స్ఫురిత, కటీభేద, రేచకాదులు మాత్రమే కలిగి అభినయశూన్యమైనచో నాట్యము ఉండదు. కాని ఇటిది నృత్తమని కూడ ఎవరును చెప్ప సాహసించ జాలరు.

గీతవాద్యముల వలె నృత్తాన్ని ఉపరంజకముగా గ్రహింప వీలులేదు. "కావ్యమున చెప్పబడని దానిని గీతముతో ననుసంధించవలయును"; "వాక్యముల నుచ్చరించనిచో గీతముచే" అని పలుమారులు చెప్పుట చేత గీతము ప్రకృతి చిత్తవృత్తి కథావస్థాది సూచకముగా గ్రహింపబడుచున్నది. గీతమున నుపయోగించు తాలోద్దీపకముగా వాద్యమును ప్రయోగించవలె ననుటచే వాద్యము సహితము కేవలము ఉపరంజకము కాదు.

నృత్తస్వభావము లౌకికమైనచో లోకధర్మితో చారీ మండలాదిక్రమమున నృత్తాంగములను నిరూపించ వలసియున్నది. అలౌకికమైనచో నృత్తమున నాట్య ధర్మికి అనుప్రవేశ ముంటుంది. ఉభయత్ర నృత్తము నాట్యముకన్న విలక్షణముగా కన్పించునట్లు తోచ గలదు. కాని పూర్వరంగప్రయోగమునకు వైచిత్ర్యము నాపాదించుటకై నృత్తము స్వీకరింపబడుచున్నదని జ్ఞాపక ముంచుకొనినచో ఈ భేదమును లెక్కచేయ నవసరము లేదు.

గీతకపదములలో చెప్పబడిన అర్థములను సామాజిక హృదయముల కభిముఖముగా తీసికొని పోవుటకై నృత్తాభిమతమైన అభినయము విధింపబడినది. ఇట్లు నాట్యముతో తుల్యమైన అభినయము కల్గియున్నను ఇది నాట్యమెందుకు కాదు? గీతకములలోని అర్థము నభినయించు నప్పుడు ఆంగిక హస్తకార్యాద్యభినయ వ్యతిరిక్తమగు స్వభావమును నృత్త మపేక్షించుట లేదు.

గీతకార్థములు తదారంభకములగు వస్త్వంగాదులు. వీటితో సంబద్ధమైనదిగా నృత్తము పరిగణింపబడుటలేదు. గీతముకన్న విజాతీయమైనది నృత్తమగుటచే గీతకార్థములలో నృత్త పరిగణన ఉండదు. సుషిరాది వాద్యాంగముగాగాని, తదుపయోగిగా గాని

నృత్తము లేదు. గీతకాదులయందు నృత్తము ప్రధానముగా నిరూపింపబడుట లేదు. స్వరూప పద తాళాదులకు గూడ నృత్తము ప్రాపకము కాదు.

రాగకావ్యాది నృత్తము నాట్యముకన్న భిన్నమనుటలో అనైకాంతికదోషము కలదు. నాట్యమున పఠ్యమానము గాని అభినీయమానము గాని యగు పద జాలములోని అర్థము గాత్రవిక్షేపముతో అనుసంధింపబడి, సాక్షాత్క్రియాయోగ్యతను పొందుచున్నది. ఈ విషయము లౌకిక నృత్తమున, నాట్యమున గూడ స్ఫుటముగా కన్పించుచున్నది. గీతకాలాపమున పదార్థ సంవాదికృతిమైన తన్మయీభావముతో సాత్త్వికాంగత లోకమున కూడ కన్పించుచున్నది.

నృత్త కావ్యమున అభినయ కథయే లేనిచో, అక్కడ విచారింపబడే విషయ మేమి? కేవలము భావిత కావ్యార్థములోని అర్థత త్త్వ సౌకుమార్యముచే సిద్ధించు ఆనందావస్థ సన్నివేశమే నృత్తస్వభావమని చెప్పుట కెవడును సాహసించలేడు. ధారాపరిక్రమ పూర్వకముగు లయప్రయోగానుసరమున పాడబడు గీత మర్థరహితము కాదుగదా? గానాది సంక్రమితమైన వాక్యార్థము నభినయించు నర్తకిచే సాక్షాత్కారకల్పార్థముగా గావింపబడు సాక్షాత్కారకల్పానువ్యవసాయ గోచరీకార్యమే నాట్యమని నాట్యలక్షణము. కాగా అనావ్యపదిక గానాదిక్రమమున గాని, వస్తూద్బోధనకరముగా గాని, మనస్సులోని ప్రియతమ విషయమును స్వేచ్ఛగా నభివ్యక్తపరచుచు, పాడుచు, నృత్యము చేయుట మనకు తెలిసిన విషయమే. ఇట్టి నాట్యము డోంబికాది నృత్తమున సహితమున్నది. సంతోషమును కలించే కథను తెల్పు పదాలు గల గీతముతో నృత్తముతో మానసము నమరంజింప గోరి డోంబిక నృత్తమున కుద్యుక్తురాలగుచున్నది. వివిధ చేష్టలతో హృదయానుప్రవేశయోగ్యమగు నృత్యమును జూపి ధనార్జనాది స్వలాభములను నెరవేర్చుకొనుచున్నది. గాయనముఖసంక్రమిత నిజవచనమై, తద్గీయమాన రూపకగతి లయ తాళానుగుణ్యముగా నృత్యము చేయును. గీయమాన పదార్థము హృదయాలను ప్రవేశించునట్లుగా చూపుటకు లౌకిక వ్యవహారమున దూపబడు హస్త, భ్రూ, రోమాంచ, అక్షికర్మలను కన్పరచుచు, అంగవిన్యాసాదికమును చూపుచున్నది.

ఈ విధంగా రంజనప్రాధాన్యమగు గీతమును విధించి, తదుపయోగి యగు అంగవ్యాపారమును నృత్తముతో ప్రదర్శించి, చిత్తమును గ్రహించగల్గుచున్నది. ఇచట నృత్తము ప్రధానమైనది. నృత్తమున కంగముగా గీతము స్వీకరింపబడుచున్నది. కావున నే అభినయమును పరిత్యజించక, గీయమానాంగభావముచే ఆక్షిప్తమైన సముచితభావముతో కూడిన అంగవిక్షేపమును లయ పరిష్వక్త కరణాంగులయందు చేయుచున్నది.

డోంబికా నృత్తమున ఆహార్యాదికములో స్వాత్మరూప ప్రచ్ఛాదనము లేకపోవుటచే సాక్షాత్కారకల్పముగా నర్తకి భావమును చూపలేదు. కాని అభినయములో గూడిన నృత్తమును మాత్రము ప్రదర్శించుచున్నది. అందుచే నాట్యాంగము లగు పతాకాదులు దర్శనమాత్రముగా నిట గ్రహింపబడుచున్నవి. కావున నృత్తమునకు సంస్కారకమైనది నాట్యము. నాట్యమునకు ప్రస్తావనా ప్రాణప్రతిబింబకల్పమైనది. నృత్తమునవ్యవహారము కేవల మౌపచారికము. నాట్యమున సాక్షాత్కారకల్పానువ్యవసాయసంపత్తికి ఉపకరించు భాషానియమము, ఛందోఽలంకారాది నియమము, ఆహార్యాది నియమము మొదలగునవి కలవు. నృత్తమున భాషానియమ పూర్వకముగు పాత్రల సంభాషణగాయె కన్పించదు. గీతమున చెప్పబడిన అర్థమును గాని, ప్రశ్నను గాని, డోంబికా నృత్తమున స్వరూపాచ్ఛాదనతో నృత్తమున సమాధానపరచును. కావున నే 'ఈ నర్తకి కలహాంతరిత', 'ఈ నర్తకి ఖండిత' అను ప్రయోగములను, గీతము లందలి అర్థమును గీత వాద్యానుసారముగా చూపుట ఔపచారికముగా గ్రహింపబలెను. సాత్త్వికాది ప్రధానరసము ననుసరించి, లయతాళాది సహితముగా అర్థమూచని యోగ్యాభినయమును ప్రయోగించుటలో తదుచితార్థ పరిపూరణము ధ్రువాగానముతో జరుగుచున్నది. కావున డోంబికా నృత్తమునకు లౌకిక ప్రయోజనము చెప్పికొనినచో నాట్యమని దీనిని పిలువరాదు.

లౌకిక ప్రయోజనమున సామాజికులను తృప్తిపరచుటయే కన్పించును. కాని నర్తకియొక్క ఫలము కేవలా పరితోషణమే అని తెలియవలెను. లాస్యప్రయోగమున మహేశ్వరి, తాండవ ప్రయోగమున మహేశ్వరుడు సంతోషము నందగలరని సంప్రదాయవచనము. నృత్త నాట్యములకు అలౌకిక ప్రయోజనము చెప్పిననే నృత్తమున అభినయాదికము సిద్ధించగలదు. నృత్తమునకు నాట్యలక్షణ ప్రయోజనాభేదము గలదని చెప్పికొనవలెను.

ప్రధానముగా నున్నచోట గీతకాదు లంగములని చెప్పబడినది (ద. 13) నాట్యమున కంగముగా గీతికమును గ్రహింపవలెను. ఈ అంగాంగీభావమును యోగ్యత్వము ననుసరించి కూర్పవలెను. ప్రధాన విషయముతో అంగములు సంమీలన యోగ్యములై ప్రయోగింపబడవలయునని భావము.

నృత్తము నాట్యముకన్న భిన్నమైనదా కాదా, భిన్నమైనచో ప్రయోజనముతో కూడి యున్నదా, లేదా? అంగ విక్షేప నృత్తగీతాదులు నృత్త నాట్యములలో రెంటియందును కల్పించుటచే నివి భిన్నములన వీలులేదు. నృత్తమున పాడబడు గీతములలోని పదార్థ వాక్యార్థములు నాట్యార్థమున లీనములగుచున్నవి. నృత్తమునగల ఏకపాత్రాహార్యము నాట్యమున కూడ ఆకాశ భాషితాదులయందు, భాణ రూపకమునగలదు. ఉభయత్ర అభినయము వాచ్యానుగతమై గాత్రవిక్షేపాల ద్వారా అర్థము ప్రతిపాదితమగుచున్నది. కావున నృత్త నాట్యములకు భేదము లేదని వార్తికకారుడు సిద్ధాంతించినాడు.

"ప్రియతమునుగూర్చి కీర్తన పరయై నృత్యము చేయుచున్నది" "కలహాంతరిత నృత్యము చేయుచున్నది," "ఖండిత నృత్యము చేయుచున్నది" అను ప్రయోగముల ద్వారా నాట్యమున సాక్షాత్కార బుద్ధి కలదని తెలియగలదు. కాని గీయమాన రూపకాభినయ దర్శనము నాట్యముకన్న విలక్షణమైనది. నాట్యము భావరస సంప్రయుక్తము. నాట్యమున కవయవ రూపకము వాద్యాభినయములలో గీతము ఉపరంజకము కాగలదు. ఐనను ఆసీన పాఠ్యాదులయందు వాచికాభినయము కల్పించుటచేత ఆహార్య సాత్త్విక ఆంగికాభినయములు కూడ ఉభయత్ర కల్పించుటచేతను నృత్తనాట్యము లభిన్నములని సిద్ధమగుచున్నది.

నృత్త స్వభావము లౌకికమా అలౌకికమా? నృత్త స్వభావము ఘటాది వస్తుతుల్యముగాని తదనుకారము గాని, చిత్రిత బింబాది రూపముగాని కావలెను. ఈమూడు విధములలో నృత్తము నాట్యచ్ఛాయ ఔతుంది. కాని నృత్తస్వభావము లోకోత్తరమైనచో నృత్తము నాట్యంలోని అవాంతర భేద మౌతుంది. అవాంతర భేద మైనా నిష్ప్రయోజనం కాజాలదు.

నృత్తనాట్యముల స్వభావప్రయోజనాలు తుల్యము లగుటచేత నాట్యముకన్న నృత్తము భిన్నమైనది కాదు. రాఘవవిజయాది రాగకావ్యాది ప్రయోగమున నాట్యముతోనే అభినయము జరగాలి. కలనము, ఆవర్తనము, భ్రూక్షేపము, తారాచలనము, చరణ, ధారణ, కంప, స్ఫురిత, కటీభేద, రేచకాదులు మాత్రమే కలిగి అభినయశూన్యమైనచో నాట్యము ఉండదు. కాని ఇట్టిది నృత్తమని కూడ ఎవరును చెప్ప సాహసించజాలరు.

గీతవాద్యాదుల వలె నృత్తాన్ని ఉపరంజకముగా గ్రహింప వీలులేదు. "కావ్యమున చెప్పబడని దానిని గీతముతో ననుసంధించవలయును"; "వాక్యముల నుచ్చరించనిచో గీతమున" అని పలుమారులు చెప్పుట చేత గీతము ప్రకృతి చిత్తవృత్తి కథావస్థాది సూచకముగా గ్రహింపబడుచున్నది. గీతమున నుపయోగించు తాలోద్దీపకముగా వాద్యమును ప్రయోగించవలెననుటచే వాద్యము సహితము కేవలము ఉపరంజకము కాదు.

నృత్తస్వభావము లౌకికమైనచో లోకధర్మితో చారీ మండలాదిక్రమమున నృత్తాంగములను నిరూపించవలసియున్నది. అలౌకికమైనచో నృత్తమున నాట్యధర్మికి అనుప్రవేశ ముంటుంది. ఉభయత్ర నృత్తము నాట్యముకన్న విలక్షణముగా కల్పించునట్లు తోచగలదు. కాని పూర్వరంగప్రయోగమునకు వైచిత్ర్యము నాపాదించుటకై నృత్తము స్వీకరింపబడుచున్నదని జ్ఞాపకముంచుకొనినచో ఈ భేదమును లెక్కచేయ నవసరము లేదు.

గీతకపదములలో చెప్పబడిన అర్థములను సామాజిక హృదయముల కభిముఖముగా తీసికొని పోవుటకై నృత్తాభిమతమైన అభినయము విధింపబడినది. ఇట్లు నాట్యముతో తుల్యమైన అభినయము కల్గియున్నను ఇది నాట్యమెందుకు కాదు? గీతకములలోని అర్థము నభినయించు నప్పుడు ఆంగిక హస్తకార్యాద్యభినయ వ్యతిరిక్తముగు స్వభావమును నృత్త మపేక్షించుట లేదు.

గీతకార్థములు తదారంభకములగు వస్త్వంగాదులు. వీటితో సంబద్ధమైనదిగా నృత్తము పరిగణింపబడుటలేదు. గీతముకన్న విజాతీయమైనది నృత్తమగుటచే గీతకార్థములలో నృత్త పరిగణన ఉండదు. సుషిరాది వాద్యాంగముగాగాని, తదుపయోగిగాగాని

సాక్షాత్కారమును పొందింపజేయు అర్థమును, నాట్యముకన్న భిన్నమగు అర్థమును, నృత్త మపేక్షించదు. అపేక్షించినచో లక్షణ భేదము కలుగగలదు. సామాజికుల నుద్దేశించి వ్యుత్పాదనీయ మగు ధర్మాద్యుపాయములకంటె భిన్నమైన అర్థమును నృత్త మపేక్షించజాలదు. అట్లు కానిచో ప్రయోజన భేదము కూడ రాగలదు. నాట్యలక్షణము, నాట్య ప్రయోజనము నృత్తమున నుండునట్లుగా నృత్తము ప్రవర్తింపబడినది.

కలనావర్తనాదులుగల నృత్తము నాట్యమున కంతరంగముగా ఉపయోగించును. నృత్తరహితమైన నాట్యము అలాత చక్రమువలె బుద్ధి గ్రాహ్యము కాజాలదు. అందుచే విమలమైన అభినయమను మాణిక్యముతో పొదుగబడిన సూత్రమువంటి నాట్యము సర్వ వ్యాపియగుచున్నది. కలనాది రూపమగు నృత్తమునకు సజాతీయమై, అంతరంగ గీతాదులలో కూడ అంతర్యామిగా నుండునది నాట్యము. నాట్యరహితమైన నృత్తము లేనే లేదు.

వర్ణనావిలాస కలనాది లక్షణములు కలిగి కావ్యమునకు కావ్యావయవములకు విలాసచేష్టావస్థాపనాత్మకమైన నృత్తము ప్రకృష్టముగా, అత్రుటితముగా ప్రవర్తితమైనది. గానాదికముతో రంజనయోగ్యమై ప్రకృష్టమగు చమత్కార మనబడు లోకోత్తరానందమును చేకూర్చుటకు నృత్తము ప్రవర్తితమైనది.

హిమాలయపర్వతముపై సంధ్యాకాలమున శివుడు నృత్యము చేయుచుండగా నారదుడు భక్తితో త్రిపురోన్మాథ గీతము నాలాపించెను. ఆ గీతమును వినుచుండగా శివుని చిత్తము ప్రీతిని జెంది అభినయమును గావించెను. అప్పుడు శివుడు తండు అను నందీశ్వరుని బిలిచి 'నాట్యోక్తితో, అభినయముతో నీ తాండవమును యోజించుము' అని పలికెను. అప్పుడు తాండవ విధి నిష్పన్నమైన దని కోహలుడు వచించినాడు.

తాండవ విధి సాధారణముగా దేవస్తుతిని ఆశ్రయించుకొని యుండును. తాండవ శబ్దము నిచట సర్వ నృత్తమునకు ఉపలక్షకముగా గ్రహించవలెను. నృత్తమును విధించునది విధి. విధీయమానమైనది దేవస్తుతిగల కావ్యము. కాగా ధర్మవీర ప్రధానమైన దీ కావ్యమని చెప్పుటలో ఉద్ధత రూపతా సూచనముతో అవ్యరస పరిగ్రహముకలదు. కావ్యమునుండి నాట్యము నిష్పన్నమగును.

శృంగారరస సంభవమైనది సుకుమార నాట్యప్రయోగము. పూర్ణాపూర్ణ రూపమైన శృంగార రసముతోనున్న మసృణప్రయోగ మిచట నిర్దేశింపబడుచున్నది. డోంబికా నృత్తమున శుద్ధమైన సుకుమార నృత్తమే కానవచ్చును. భాణకములయందు ఉద్ధత మగు నృసింహాది చరిత వర్ణన ముండును. మసృణ ప్రయోగము కూడ ఉద్ధతము, ఉద్ధతమిశ్రము మొదలగు భేదములతో నుండగా షిద్గకాది భేదములు వచ్చుచున్నవి. భాణికము ఉద్ధత మసృణమైనది. రామాక్రీడక, రాసక, హల్లీసకాది భేదము లిట్లే రాగలవు.

భవ్యానురాగ గర్భితములైన మాటలచే మానసము నాకర్షించు మసృణప్రయోగమును డోంబికా అందురు. వరాహనృసింహాది వర్ణనములను నర్తకి జల్పించు ఉద్ధతాంగ ప్రవర్తితమైనది భాణము. గజాదుల గతిని, ప్రవసనమును అనుకరించు అల్పావిద్ధమైన మసృణప్రయోగము ప్రస్థానము. సఖీ సమక్షమున భర్త యొక్క ఉద్ధత వృత్తమును చెప్పుచు, కొంచెము ధూర్త చరితము కూడ చెప్పునట్టి మసృణప్రయోగమును షిద్గక మందురు. సూకరసింహ జనితమైన బాలక్రీడా నియుద్ధాదికమును ధ్వజాదికముతో గానించుచో భాణికయందురు. ప్రహేలికతో, ఋతువర్ణన సంయుక్తమైన హాస్యప్రాయమగు ప్రేరణ రామాక్రీడమగును. గోపస్త్రీలతో కృష్ణు డొక్కడే నర్తించినట్లు ఏకనాయకునితో మండల నృత్తము జరుగుచో దానిని హల్లీసక మందురు. అనేక నర్తకురాండ్రతో, చిత్రతాల లయాన్వితమైన మసృణోద్ధత నృత్తమును రాసక మందురు.

ఈ ప్రబంధములు నృత్తాత్మకములు, ఇవి నాట్యాత్మకములైన నాటకాదులకంటె విలక్షణములైనవి కావు. కావుననే రాఘవవిజయం, మారీచవధ మొదలగునవి రాగకావ్యము లని పిలువబడుచున్నవి. లయాంతర ప్రయోగముతో, రాగములతో, నానారసములతో నుండి, సునిర్వాహ్యమైన కథగలది కావ్యమని కోహలుడు సహితము నిర్వచించినాడు. గీతము నాశ్రయించుకొని లయయుండుటచే గీతమునకే ప్రాధాన్యముకలదు. రాఘవవిజయమున విచిత్ర వర్ణనీయ విషయమున్నను ఒక్క రాగముచేతనే నిర్వహణము సిద్ధమగుచున్నది.

మాతీవడషలో కకుభగ్రామరాగముతో నిర్వాహము కలదు. కావున వీటిని రాగకావ్యములనినారు. గీతాత్మకము, గీతము నాధారము చేసికొనినదియు నగు రాగములతో నున్న కావ్యము లివియని భావము.

సప్తకృతి ప్రకారములలో శివునిచే నీ విధమైన నృత్తము ప్రచారములోనికి తీసికొనిరాబడినది. శుద్ధమైన నృత్తము కేవల కరణాంగహారాత్మకము. నృత్తము గీతికాద్యభినయోన్ముఖము, గాన క్రియామాత్రానుసారి, వాద్యతాలానుసారి కూడ నగుచున్నది. బాహుప్రేంఖణము, ఉరఃకంపము, పార్శ్వనమనోన్నమనములు, చరణపరణము, స్ఫురితకంపిత భ్రూతారాపరిస్పందము, కటిచ్ఛేదము, అంగవలనము అను రూపములతో వ్యక్తమగునది నృత్తము.

ఉద్ధతము, మసృణమిశ్రము ఉద్ధతము, సుకుమారము, ఉద్ధత మిశ్రము సుకుమారము, అను నాల్గువిధముల కావ్యార్థముల ననుసరించి ప్రయోగములు నాల్గురకములు రాగలవు. లౌకిక మగు స్వతంత్ర నృత్తమునగాని, దేవతాపరితోషణమునగాని మొదటి విధము ఉద్ధత నృత్తము వచ్చును. పూర్వరంగ విధియందు పరిశిష్ట నృత్తలక్ష్యముల ననుసరించి తాండవాది నృత్తకలాపము కలదు. ఇది రెండవది.

సామాజికులకువలె నాట్య ప్రయోక్తకు కూడ సంభవించు తన్మయీభావమునకై నాట్య సంస్కారము నపేక్షించి అభినయవిధి నిర్మింపబడినది. సాక్షాత్కారకల్ప నాట్యరూపత్వ మిచట లేదు. చతుర్విధాభినయ యోగము, రసభావప్రాధాన్యము, ఇచట కన్పించక పోవుటచే నీప్రయోగమునకు నాట్యత్వము సిద్ధించుట లేదు. గీతవాద్యనృత్తములకు యథేష్టముగా ప్రాధాన్యము వర్తకీవృద్ధి ననుసరించి కావ్యవస్తు నిర్మాణము కన్పించుటచే నీప్రయోగము నాట్యప్రస్తావనా ప్రాణ ప్రతిబింబాత్మక మగుచున్నది. గీతాది ప్రాధాన్యము ననుసరించి, కులకాచ్ఛేద్యాత్మకము కావ్యము గీతాధారము కాగా, పిండీబంధప్రకారమున వైచిత్ర్యముతో నృత్తముమాత్రమే గావింపబడెను. కాగా నాట్యము కన్న నృత్తము కొంతవరకు విలక్షణమైనదే యగుచున్న దని తౌతభట్టు సిద్ధాంతించినాడు. తుల్యానుకారము నృత్తనాట్యములలో నున్నను రసభావదృష్టి హస్తశిరస్సుల నాశ్రయించుకొని యున్నది. అందుచే ఇవి భిన్నము లగుచున్నవని హర్షుడు వార్తికమున చెప్పియున్నాడు. శిక్షకు తగిన స్వేచ్ఛతో నాట్యాంగముగా నున్న నృత్తమున కభ్యాసఫలమును మాత్రమే భట్టయంత్రుడు విధించినాడు. వివాహాది మంగళప్రద కాలములయందే నృత్తమును ప్రయోగింపవలెనని లొల్లటభట్టుయొక్క సిద్ధాంతము.

కాని దశరూపకభేదములవలె లాస్యతాండవ ప్రయోగములు నాట్యభేదములే అని నిశ్చయింపవలెను. ఉభయత్ర పూర్ణానుకార రూపము కన్పించుటచే నృత్తము నాట్యమునకన్న విలక్షణమైనదని చెప్ప వీలు లేదు. అశ్వత్థామ ప్రవేశించుచు మాచీనిద్దము, ఊర్ధ్వజానువు మొదలగు కరణాంగహారముల నభినయించును. పురూరవసుడు అలపల్లవసూచీతో వచ్చును. గరుడుడు గరుడప్లుతికమున, రావణుని పుష్పకవిమానము వైశాఖరేచితమున, వత్సరాజుయొక్క అగ్నిసంభ్రమము అతిక్రాంతకరణమున, జటాయుగమనము గృధ్రావలీనకమునగాని పలకాక్రీడితమునగాని జరుగును. దీనినిబట్టి నృత్తనాట్యములకు వైలక్షణ్యము లేదని, నృత్తము నాట్యములోనిదని చెప్ప వీలున్నది.

# నిజా నిజాలు

శ్రీ పంతుల కృష్ణారావు

**పాత్రలు:** లక్ష్మీపతి, శీతారామయ్య, చంద్రయ్య, శంకరం, శాంత, లలిత.

## రంగము: 1

** లక్ష్మీపతి ఇల్లు, సమయం: రాత్రి పదిగంటలు, తెర లేవగానే ఇంటి నౌకరు చంద్రయ్య ఒక సోఫాలో గుర్రు పెట్టి నిద్రపోతూ కన్పిస్తాడు, సమీపంలో రెండు కుర్చీలు ఖాళీగా వుంటాయి. గది ఫొటోలతో అలంకరింపబడి వుంటుంది. రెండు అద్దాల బీరువాలు పుస్తకాలతో నిండి ద్వారాని కిరుపైపులా వుంటాయి. టేబిల్ మీద కొన్ని లా పుస్తకాలు సిరాబుడ్లు, కలాలు, పేపర్ వెయిటు, ఏవో కొన్ని కాగితాలు వుంటాయి. దగ్గర మరెవ్వరూ వుండరు. రెండు నిమిషాలు గడిచాక లక్ష్మీపతి ప్రవేశిస్తాడు. ట్వీడ్ సూటు, నెక్ టయ్, కళ్లకిజోడు, కాళ్లకి బూట్లు వుంటాయి. చేతిలో ఏవో కాగితాలు వుంటాయి. వస్తూనే ఆశ్చర్యంగా గది నాలుగు మూలలూ చూసి నిద్రపోతున్న చంద్రయ్యవద్దకు వెడతాడు:

లక్ష్మీపతి: చంద్రయ్యా! చంద్రయ్యా!

చంద్రయ్య: (పలుకకుండా గుర్రు పెట్టి నిద్రపోతూ వుంటాడు)

లక్ష్మీపతి: (కొంచెం బిగ్గరగా) చంద్రయ్యా!

చంద్రయ్య: (అప్పటికీ పలుకడు)

లక్ష్మీపతి: (సోఫా పైకి కొంచెం వంగి) చంద్రయ్యా!

చంద్రయ్య: (ఒక్కసారి పెద్ద గుర్రు పెడతాడు)

లక్ష్మీపతి: (చంద్రయ్యని గట్టిగా కుదిపి లేపుతూ) చంద్రయ్యా! లేలే!—తలుపులన్నీ తీసుకొని ఏమిటీ మొద్దు నిద్ర?

చంద్రయ్య: (లేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని ఆవలించి, కళ్ళు నులుపుకొని లక్ష్మీపతిని చూసి ఉలిక్కిపడి లేచి నిల్చొని) మీరా బాబూ?

లక్ష్మీపతి: ఇంతసేపట్నుంచీ పిలుస్తూవుంటే ఇప్పుడు తెలిసిందా నీకు? అర్ధరాత్రి వేళ తలుపులన్నీ తీసుకొని ఏమిటీ మొద్దు నిద్ర?—ఇంట్లో ఎవరు దూరినా ఇంతే?

చంద్రయ్య: లేదు బాబూ!—శంకరం బాబుగారొచ్చి పిలిస్తే తలుపు తీయమని శాంతమ్మగారు చెప్పేరు. అందుకని...

లక్ష్మీపతి: అందుకని వాడు రావడానికి వీలుగా తలుపులన్నీ తెరిచి పడుకున్నావ్!

చంద్రయ్య: అది కాదండి! — చాలా రాత్రయి పోయింది, ఇంకొచ్చేస్తారు, తలుపు వెందుకేయ్యడం అని చెప్పి తీసుంచి సోఫాలో ఇలా పేరబడ్డానండి!—అంతే! — దావమ్మ ముండ మోసిన నిద్ర ఎప్పుడొచ్చేసిందో ఒచ్చేసిందండి!

లక్ష్మీపతి: నీ తెలివి తేటలేవిటిలే!—అఘాయిత్యం!... సరే!—అయితే ఇంకా శంకరం రాలేదన్న మాట!

చంద్రయ్య: ఒచ్చినట్టు లేదండి!

లక్ష్మీపతి: రాలేదని నీకేం తెలుసు?

చంద్రయ్య: ఇప్పటిదాకా చూసి ఇంకా ఇప్పుడే ఇలా కళ్ళుమూశానండి!—ఇంతలో మీరూ వచ్చారు.

లక్ష్మీపతి : నువ్వు కళ్ళుమూసి తెరిచేలోగా మహాప్రళయాలు కూడా పుట్టి చల్లారిపోతాయి ; శంకరం ఒస్తే నీకేం తెలుస్తుంది?

చంద్రయ్య : రాలేదు బాబూ! — గేరంటీగా చెప్తున్నాను నామాట నమ్మండి!

[ఇంతలో శాంత ప్రవేశించి లక్ష్మీపతిని చూచి ద్వారంవద్ద నిల్చుంటుంది.]

లక్ష్మీపతి : ఏమమ్మా, శంకరం ఇంకా ఇంటికి రాలేదు?

శాంత : రాలేదు!

లక్ష్మీపతి : (కోపంగా)—ఎందుకొస్తాడు?—ఒక వేళ వీడు వద్దామనుకున్నా అది వీడిని రానిస్తుందీ? నెలకొచ్చిన జీతమంతా దాని దోసిట్లో నే పోస్తున్నాడుగా?

చంద్రయ్య : పొద్దుటనగా ఎళిపోయారు బాబూ!— మద్దేన్నం భోజనానిక్కూడా రాలేదు!—అమ్మగారు మద్దేన్నం, ఈ పూట భోజనం సేయకుండా కాసుక్కూకున్నారు ఆరికోసం!

లక్ష్మీపతి : దానివలలో పడి ఇంటికిరానివాడి కోసం భోజనం మానుకొని ఎంతకాలం కూచుంటావమ్మా!—వాడి గురించి చూడకు!— వెళ్ళి భోజనం చెయ్యి!

చంద్రయ్య : నేనూ ఈ మాటే సెప్పేనుబాబూ!— ఇనకుండా వున్నారు. మంచినీళ్లేనా తాగడం లేదు. ఉదయంనించీ — అలాగే ఏడుస్తూ కూకున్నారు.

లక్ష్మీపతి : భార్యనైనందుకు బాగా సుఖపడుతున్నావమ్మా వాడివల్ల!

చంద్రయ్య : రాను రాను ఇంటికేరాకుండా వున్నారు బాబూ!

లక్ష్మీపతి : మరీ మితిమీరిపోతున్నాడు. మునుపు నేనేమాటన్నప్పటికీ కాదనేవాడుకాదు! ఇప్పుడు నాకే ఎదురు తిరుగుతున్నాడు.

చంద్రయ్య: అదే బాబూ!- మునుపు శాంతమ్మగారన్నా ఎంతో యిదిగా వుండేవారు!- అదేం మందుపెట్టి మనసిరిసిందో కాని పూర్తిగా మారిపోయారు.

లక్ష్మీపతి: మందూ మాకూ!- పిడిలో జ్ఞానం నశించిన తర్వాత దాన్నని యేం ప్రయోజనం?- లోకం అంతా ఇంతలాగ అనుకుంటున్నారన్న సిగ్గులేదు తల్లిదండ్రులు, భార్య ఎంత బాధపడతారోఅన్న ఆలోచనలేదు, ఎవరెన్ని చెప్పినా లక్ష్యంలేదు.

చంద్రయ్య: అంతా రాత బాబూ!

లక్ష్మీపతి: అయినావీడికేం దుర్బుద్ధి?- ఇంట్లో లక్ష్మీదేవిలాంటి భార్య వుంటూంటే ఆ నుంటని పెట్టుకొనివుండడ మేమిటి?

చంద్రయ్య: అయ్యాళ డాక్టరు ప్రసాదరావుగారింట టీపార్టీ అప్పుడు దానినిసూడడమే ఆరంభం బాబూ దాని వలలో పడడానికి!

లక్ష్మీపతి: ఇంకెంత కాలం వలలో వేసుకుంటుందిలే వీడిని?- ఇదిగో ఈ దావాలు పరిష్కారం అయి కొంచెం తీరిక అయేదాకా చూస్తున్నాను!- దానంతు తేల్చనూ?

శాంత: చంద్రయ్యా, భోజనానికి లేస్తారేమోకనుక్కో బాబుగారిని!

లక్ష్మీపతి: నేనిక్కడే హోటల్లో భోంచేశానమ్మా!- ఇదిగో ఈ దావాల గురించి కొన్ని అర్జెంటు పనులుండడంవల్ల ఇంటికొచ్చి భోంచేయడానికి అవకాశం లేకపోయింది. మళ్ళీ తెల్లారగట్ల బండిలో గుంటూరు వెళ్ళాలి!

శాంత: మళ్ళీ గుంటూరు వెళ్లాలా?

లక్ష్మీపతి: అవునమ్మా!- రేపు గుంటూరులో ఒక కేసుకి వాయిదావుంది. దానిగురించే వెళ్ళాను. తీరా అక్కడికి వెళ్ళాక ఒక ముఖ్యవిషయం మరిచి రావల సొచ్చింది.

శాంత: అయితే తెనాలి వెళ్ళలేదా?

లక్ష్మీపతి: లేదమ్మా!- ఏదీ?- వెళ్ళడానికి తీరికెక్కడ? తలమునకలైనపనులు!- ఊపిరిపీల్చుకోవడానికేనా అవకాశం వుంటేనా?- అంచేత బెజవాడలో దిగి బస్సుమీద వెళ్ళేను గుంటూరు.

శాంత: అత్తగారెప్పుడొస్తారో తెలీదా?

లక్ష్మీపతి: ఆ!- మీ అత్తగారొచ్చేసరికి మరో నెల పడుతుందమ్మా!- వాళ్ళ తమ్ముడికింకా జబ్బు బాగా నయంకాలేదుట!- నెలరోజులాగి కొంచెం నయమయాక వస్తానని రాశింది.

చంద్రయ్య: పెద్దమ్మగారుంటే ఈ అమ్మగారికి నిబ్బరంగావుణ్ణు బాబూ!- మీరు కమాసెలిపోతారు.

ఆ బాబు ఇంటికేరారు. ఇంతింట్లోనీ దిక్కు దిక్కుమంటూ ఒక్కరే వుంటున్నారు.

లక్ష్మీపతి: ఇంకకొద్ది రోజులేస్లే!- వాడాటలు, దానాటలు కట్టిపోతాయి !

[ఇంతలో గడియారం పన్నెండు గంటలు కొడుతుంది.]

లక్ష్మీపతి: అప్పుడే పన్నెండయింది!- మళ్ళీ నాలుగు గంటలకి లేచి బండికందుకోవాలి!

చంద్రయ్య: పరవాలేదుబాబూ! మీరు నిద్రపొండి! నేను లేపుతాను!

లక్ష్మీపతి: ఓ! నిద్రలో పోటీలు పెడితే కుంభకర్ణుడిని కూడా ఓడించగలవ్ నువ్వు! నిన్ను లేపడానికి మరోమనిషి కావాలి!

చంద్రయ్య: అక్కర్లేదుబాబూ!

లక్ష్మీపతి: లేదు, అలారంపెట్టుకు పడుక్కుంటానులే! నిష్క్రమిస్తాడు) [తెర]

## రంగము: 2

* * లక్ష్మీపతిగారి ఇల్లు. సమయం: ఉదయం ఏడుగంటలు. శంకరం ప్రవేశిస్తాడు. వేషం సాదాగా వుంటుంది.

శంకరం: చంద్రయ్యా! చంద్రయ్యా!

చంద్రయ్య: (ప్రవేశించి) వచ్చారాబాబూ?

శంకరం: ఆఁ! వచ్చాను! శాంత ఎక్కడుంది?

చంద్రయ్య: శాంతమ్మగారు పెరట్లో వున్నారు బాబూ! నిన్నటికొన్నుంచీ మీకోసం తిండీ, నిద్రా మానుకుని కాసుక్కూకున్నారు!

శంకరం: ఉద్ధరించింది—నాకోసం కని పెట్టుక్కూచో మని ఎవరు చెప్పారు?

చంద్రయ్య: అయినా నేనోమాట చెప్తాను కోపగించు కోకండిబాబూ! మీ రిలాగ ఇంటికి రాకుండా దానింటే వుండిపోతావుంటే అమ్మగారికేం మనశ్శాంతి వుంటాది చెప్పండి!

శంకరం: చంద్రయ్యా! ఇలాటివిషయాలలో జోక్యం కలిగించుకోవద్దని నీ కెన్ని సార్లుచెప్పేను? అవన్నీ ఆలోచించుకొనేది నేను! నువ్వు నాకు బోధించేది?

[ఇంతలో శాంత ప్రవేశిస్తుంది]

శాంత: (ఆనందంతో) వచ్చారా!

శంకరం: ఆఁ! వచ్చాను—మళ్లీ ఇప్పుడే వెళ్లిపోవాలి!

శాంత: మళ్లీ వెళిపోతారా?—అదేమిటండీ?

శంకరం: రాధమ్మకి చాలా ప్రమాదంగావుంది. డాక్టరు అర్జంటుగా 'యుడికొలోన్' తెమ్మన్నాడు. బజారులో ఎక్కడా దొరకడంలేదు. మనింట్లో ఒకసీసా వుండాలి. ఇప్పుడు దానికోసమనే వచ్చాను. వెంటనే వెళ్లాలి!

శాంత: ఇప్పు డక్కడికివెళితే నేకాని కుదరదా?

శంకరం: వెళ్ళాలి—రాధమ్మ ప్రాణాపాయస్థితిలో వుంది. అక్కడెవ్వరూ లేరు!

శాంత: ఇక్కడే నాకు సాయం లావై పోతున్నారా? మీ నాన్నగారు కూడా కమానులో వున్నారు. ఇంట్లో ఎవరు దూరి ఏంచేసినా చూసేవారేనా లేరు!

శంకరం: చంద్రయ్య వున్నాడుగా?

శాంత: చంద్రయ్య సాయంకూడా ఒకసాయమే!— వాడు నిద్రలోవున్నాడంటే మూడులోకాలూ ముంచుకుపోయినా మెలకువరాదు వాడికి!

శంకరం: మరేమీ అంత ప్రమాదం రాదులే!

శాంత: పోనీ భోజనంచేసి వెళ్లకూడదా?

శంకరం: భోజనం చేసేవరకు టైంలేదు!—అర్జంటుగా పోవాలి!—అక్కడే భోజనంచేస్తాను.

శాంత: పోనీ రెండు నిమిషాలాగండి. కాఫీయేనా పెట్టియిస్తాను.

శంకరం: వ్యవధి లేదు!—వేగంపోవాలి!

శాంత: (గాద్గదికంగా)—మీరింత కఠినంగా ప్రవర్తించడానికి నేనేం తప్పుచేశాను చెప్పండి!—

శంకరం: ఇదిగో శాంతా, మరా సంగతులన్నీ మాటాడేవంటే శాశ్వతంగా నీకు కన్పించనని ఇదివరకు వెయ్యిసార్లు చెప్పాను, జ్ఞాపకంవుందా?

శాంత: పోనీయండి!—(కుర్చీలో కూలబడివిలపిస్తుంది. శంకరం లోనికిపోయి, నిమిషమయాక తిరిగివచ్చి దరదరా వీధిద్వారంగుండా వెళ్ళిపోతాడు.)

చంద్రయ్య: ఆఖరికి ఇంట్లో క్షణంకూడా వుండకుంటున్నారమ్మా!

శాంత: (వెక్కి వెక్కి ఏడుస్తుంది)

చంద్రయ్య: ఏడవకండి. తల్లీ! రోజులెప్పుడూ ఒకలాగే వుండవు. ఏదో కుర్రతనంకొద్దీ ఇలాగ తిరుగుతారు. వయస్సుతో బాటు అన్నీ తెలిసొస్తాయి. అంతా సర్దుకుంటాది.

శాంత: ఏం సర్దుకోవడమో యేమిటో చంద్రయ్యా!— లోకం అంతా ఈయనగురించే కోడై కూస్తోంది. ఎవరినోటంటవిన్నా ఇదేమాట!—ఒక్కొక్కప్పుడు ఈ సంగతి తెల్సుకుంటూంటే ఏదో చెప్పలేని భయం వేస్తోంది చంద్రయ్యా!

చంద్రయ్య: ఏమీ భయంలేదమ్మా!—తప్పకుండా దారికొస్తారు!

శాంత: ఏం దారికి రావడమో చంద్రయ్యా!—నువ్వే చూస్తున్నావుగా ఆయన ప్రవర్తన!

చంద్రయ్య: కుర్రతనంలో అంతా ఇలాగే వుంటారమ్మా. ఇంతెందుకు ఇప్పుడింతలాగ వుంటూ వున్న పెద్దబాబుగారుకూడ పెళ్ళికాకముందు చదువుకొనే రోజుల్లో ఈలాటి మాయలో పడ్డవారేనమ్మా!—మొదటిలో ఎవత్తో అమ్మాయిని పెళ్లాడుతానని దెబ్బలాడేవారు....

[ఇంతలో వీధిలోనుంచి 'మేష్టారూ!—మేష్టారూ' అని పిలుపు విన్పిస్తుంది.]

శాంత: చంద్రయ్యా, వీధిలోఎవరో పిలుస్తున్నట్టుంది చూడు!

చంద్రయ్య: (వెళ్ళి కొద్దిసేపటిలోనే తిరిగివచ్చి) ఎవరో కాలేజీ కుర్రాళ్ళమ్మా!—సినబాబుగారున్నారా? అని అడుగుతున్నారు.

శాంత: నువ్వేమని చెప్పేవు?

చంద్రయ్య: లేరని చెప్పేనమ్మా!

శాంత: వెళ్లిపోయారా?

చంద్రయ్య: లేదమ్మా!—ఎక్కడుంటారని అడుగుతున్నారు.

శాంత: ప్రతివాళ్ళూ ఏమీ ఎరగనట్టు ఇదో ప్రశ్న!—జవాబులు చెప్పేసరికి ప్రాణం పోతోంది. (చిరాకుగా చంద్రయ్యతో) ఆయనింకెక్కడుంటారు?—ఉందిగా ఆ రాధమ్మకూతురు?

చంద్రయ్య: అయితే అక్కడుంటారని చెప్తానమ్మా!—(వెళ్ళబోతాడు)

శాంత: చంద్రయ్యా!

(చంద్రయ్య వెనక్కి తిరిగి వస్తాడు): ఏమమ్మా?

శాంత: నీకింత బుద్ధిలేదేం?

[చంద్రయ్యజవాబు చెప్పకుండా తలగోక్కుంటాడు]

శాంత: అలాగ చెప్పొచ్చునా?

చంద్రయ్య: మరి మీరే అన్నారుకదమ్మా?

శాంత: నేనలాగ అంటేమాత్రం నువ్వు వెళ్ళి బాబుగారు దానింటిలో వున్నట్టు అందరితోనూ చెప్తావా?

చంద్రయ్య: (తలగోక్కుంటూ) అయితే మరేమని చెప్పమంటారమ్మా?

శాంత: బజారుకెళ్లేరని చెప్పు!

చంద్రయ్య: (వెళ్లి తిరుగొచ్చి) చెప్పేనమ్మా!

శాంత: పోయేరా?

చంద్రయ్య: లేదమ్మా. ఎంతసేపట్లో తిరిగివస్తారని అడుగుతున్నారమ్మా!

శాంత: (చిరాకుగా) తెలీదని చెప్పు!

చంద్రయ్య: (మళ్ళీతిరిగొచ్చి) ఇంటికొస్తే ఆయనగురించి ఎవరో కాలేజీ కుర్రాళ్లొచ్చారని చెప్పమన్నారమ్మా!

శాంత: చెబుతామని చెప్పు!

చంద్రయ్య: (వచ్చి) చెప్పేనమ్మా!—వెళ్ళిపోయారు!

శాంత: (చిరాకుగా) ఉద్ధరించేరు.

[చంద్రయ్య ఏదో పనిమీద వెళ్ళిపోతాడు. శాంత చిరాకుగా కుర్చీలోకూర్చొని ఏదో ఆలోచిస్తూ వుంటుంది. ఇంతలో సీతారామయ్య ఒకచేతిలోపంచి, చంకన గొడుగుతో ప్రవేశిస్తాడు.]

శాంత: (ఆనందంతో ఎదురుగావెళ్ళి)—ఏం నాన్నా ఇప్పుడేనా రావడం?—(పంచి, గొడుగు అందుకుంటూ) అమ్మా, తమ్ముడూ అంతా కులాసాగా వున్నారా?

సీతా: ఆఁఆఁ!—అంతా కులాసాగానే వున్నారు. (కుర్చీలో కూర్చొని ఆయాసంతీర్చుకుంటు

న్నట్టుగా వగరుస్తూ) ష్!—రామచంద్రప్రభో!—అమ్మాయ్, కొంచెం మంచినీళ్ళు తే అమ్మా!

శాంత: తెస్తానునాన్నా!—(లోనికివెళ్ళి ఒక చెంబుతో నీళ్ళుతెచ్చి ఇస్తుంది)

శీతా: (చెంబెడునీళ్ళు గటగట తాగేసి, పైమీది కండువాతో మూతి తుడుచుకొని, చెంబు టేబిల్ మీద పెట్టేసి) — హమ్మయ్యా!—ఏమమ్మా ఇంట్లో మరెవ్వరూ లేరేమిటి?

శాంత: లేరు నాన్నా, మా అత్తగారు తమ్ముడికి జబ్బుగావుందని పదిరోజుల కిందటే తెనాలి వెళ్లేరు. మా మామగారు ఇవాళ తెల్లార గట్ల బండిలో ఏదో కేసు వాయిదావుందని గుంటూరు వెళ్ళేరు.

శీతా: మరి శంకరమో?

శాంత: (మొదట కొంచెం గాభరాపడి వెంటనే అనుమానించనీయకుండా సర్దుకొని) ఆ!— ఆయన ఎవరో స్నేహితులొచ్చి పిలిస్తే పిక్ నిక్ కెళ్లేరు నాన్నా!

శీతా: అలాగా?—అయితే సరేగానీ అమ్మాయ్, ఈ మధ్య శంకరం గురించి చాలా వదంతులు పుడుతున్నాయ్; ఎవరినో వుంచుకున్నాడనీ ఒచ్చిన జీతమంతా దానికే ఇచ్చేస్తున్నాడనీ ఇంటికి రాకుండా దానింటే వుండిపోతున్నాడనీ నాతో చాలామంది అన్నారు. ఎంతవరకు నిజమేమిటి?

శాంత: లేదునాన్నా, ఎవరో కిట్టనివాళ్ళు కల్పించిన మాటలివి!—అటువంటిదేమీ లేదు.

శీతా: కిట్టని వాళ్లన్నమాటలైతే ఎవరో ఒకరిద్దరంటారు కాని కనబడిన వాళ్ళంతా ఈమాటే చెప్తారా? పిడిపరించి ఇలాగ లేనిపోనివి కల్పించి చెప్పడానికి ఎవరికేం అవసరం?—ఏమైనా నిప్పులేనిది పొగరాదమ్మాయ్!—ఈ వార్తలు నీవరకు ఇంకా రాలేదు కామోసు!—ఎవరు కనబడినా ఈసంగతే చెబుతున్నారు.

శాంత: అది కాదునాన్నా, ఆపిల్ల పాపం చాలా బీదది. దాని తల్లీ అదీ వీళ్లింటా వాళ్లింటా పని చేసుకొని బ్రతికేవారు. ఇప్పుడా తల్లి జబ్బుతో వుంది. ఎవ్వరూ సాయం చేయడం లేదు వాళ్ళకి. ఆతల్లీ కూతురూ ఎన్నో బాధలు పడుతున్నారు.

శీతా: అయితే ఏదో కొంతవరకు వుందన్నమాట!... కాని నేను తెలియక అడుగుతానూ వాళ్ళెంత బీద వాళ్లయి ఎన్నిబాధలు పడుతున్నా, వీడెంత జాలిగుండె గలవాడైనా నెలకొచ్చిన రెండు వందలేభై రూపాయిల జీతం దానికి ఇచ్చుకుంటాడా?—పోనీ ఆ సంగతొదిలీ!—ఈ ఇంటికి రాకుండా దానింటే వుండిపోవడం ఇదంతా యేమిటి?

శాంత: జీతం అంతా దానికే ఇస్తున్నారు, ఇంటికి రాకుండా దానింటే వుండిపోతున్నారూ అన్నది నిజం కాదు నాన్నా!—

శీతా: వాడినింకా వెనకేసుకు రాకమ్మాయ్!—ఈవీధి చివరింట్లో వున్న వెంకటేశం గారి భార్య వచ్చి మీ అమ్మతో అంతా చెప్పింది. అదివరలో మీ అత్తగారే అన్నీ చెప్పేరట!

శాంత: (మౌనంగా) ఊరుకుంటుంది)

శీతా: ఈమాట విన్నప్పట్నుంచీ మీ అమ్మకి ఒకటే దిగులు!—వెంటనే నిన్నిక్కడికి తీసుకొచ్చేస్తేనే కాని భోజనం చేయనని కూర్చుంది.

శాంత: ఇక్కడ నాకేమీ భయం లేదు నాన్నా!

శీతా: అదేమోతల్లీ, అంతమందీ నిన్నక్కడికి తీసుకువెళ్లిపొమ్మనే చెబుతున్నారు. నిన్నను అ తెలుగు మేస్టరు సుబ్బారావుగారు అక్కడ బజారులో కనిపించి మీ అల్లుడు దానివలలో పడి పూర్తిగా చెడిపోతున్నాడు, మీ అమ్మాయిని సరిగా చూడడం లేదు. ఇప్పుడేవెళ్లి మీపిల్లని ఇక్కడికి తెచ్చేసుకోండి, లేకపోతే ఆముండ మాటవిని మీ అమ్మాయి కేదైనా అఘాయిత్యం తలపెట్టొచ్చు? అని చెప్పేరు.

శాంత: ఫరవాలేదు నాన్నా!—ఇక్కడ నాకే ప్రమాదం రాదు!

శీతా: ఒద్దమ్మా, ఆదేవుడు చెప్పగలడు—ఇవాళ ఒచ్చిన జీతమంతా దానికేయిస్తూ, ఇల్లూవాకిలి విడిచిపెట్టిదానిచుట్టూ తిరుగుతూన్నవాడు రేపొద్దున్న అదేం చెప్తే అది చెయ్యడన్న నమ్మకం ఏమిటి?

శాంత: వారంతపని చెయ్యరు నాన్నా!—అదీగాక మామామగారున్నారుగా?—ఆయన చాలా మంచివారు!

సీతా: ఏం మామగారోతల్లి, ఇంత జరుగుతున్నా మాటాడకుండా నిమ్మకి నీరెత్తినట్టు ఊరుకుంటున్నాడు; ఆయన ఉద్దేశం ఏమిటోమరి!

శాంత: ఆయన ఊరుకోవడం లేదు నాన్నా!—తను చెబుతున్నారు, అందరిచేతా చెప్పిస్తున్నారు. ఈయనే వినడంలేదు ఇప్పుడు ఏవో దావాలున్నాయిట అందుచేత ఇప్పుడు దీన్నిగురించి ఆలోచించడానికి అవకాశం లేకుండావుంది. ఆదావాలు పరిష్కారం అవగానే దీని సంగతి చూస్తాను అన్నారు మామామగారు.

సీతా: బావుంది!—ఆదావాలు ముఖ్యమూ మరి?—అయినా దగ్గరదగ్గరగా ఏభైయేళ్ళ వయసొస్తుంటే ఇంత ఆస్తిపెట్టుకొని ఇంకా ఆయనకి తాపత్రయం ఎందుకో నాకర్థంకాదు.

శాంత: ఈ మాటే మా అత్తగారు కూడా అంటూంటారు నాన్నా!—ఇంత కోరితెచ్చి పెంచుకున్న వాడిని అధమం ఏభై వేల రూపాయిల ఆస్తిపరుడిగానేనా చెయ్యొద్దుటే? అని అంటారు మా మామగారు.

సీతా: హుఁ!—పాపం!—వాడిగురించి ఆయన ఇంత శ్రమపడుతున్నా ఆయన మాటంటేవాడికి లక్ష్యంలేకుండా వుంది. ఈతోవన ఆయనింత కష్టపడి సంపాదిస్తూంటే ఆతోవన వాడదంతా తీసుకెళ్ళి ఆముండకి పెడుతున్నాడు. పాపం, పిల్లలుపుట్టరని డాకరు చెప్పగానే మీమామగారు మద్రాసువెళ్ళి ఎక్కడో దిక్కూ మొక్కూ లేకుండా వున్న వీడిని తీసుకొచ్చారు. అప్పట్నుంచీ ఆభార్యాభర్త లిద్దరూ వీడివతి గారాబంతో పెంచి, పెద్దచదువు చెప్పించి ఇంతటివాడిని చేశారు. అయినా వీడు వారియందు ఆ విశ్వాసం, ఆ గౌరవం వుంచలేదు. లాయరు లక్ష్మీపతి అంటే ఎంతపేరు, ఎంత ప్రతిష్ఠ!—నిజంగా ఆయనలాటి ఉత్తముడు ఎవరున్నాడు? ఆయనపేరు ప్రతిష్ఠలన్నీ మంటగలుపుతున్నాడు వీడు—మళ్లీ అంత కాలేజీ లెక్చరర్ పని చేస్తున్నాడేమో ఈమాత్రం జ్ఞానం వుండొద్దూ? కట్టుకున్న భార్యని ఇలాగేనా హింసించడం?

శాంత: ఏమిటో తెలియదు నాన్నా!—లలితకీ తనకీ నీచమైన సంబంధం ఏమీ లేదంటారు.

శాంత: లేదంటే ఎవరు నమ్ముతారమ్మా?—లోకం అంతా కోడైకూస్తోంది ఎవరు కనబడినా ఇదే మాట!—లేనివన్నీ కల్పించి చెప్పుకోడానికి ఎవరికేం అవసరం?—మీమామగారి గురించి, నాగురించి చెప్పుకోకూడదూ!—వీడి గురించే ఎందుకు చెప్పుకోవాలి?—అవన్నీ ఒట్టిమాటలమ్మాయ్, ఆమాటలు నమ్మకు!—దానితో సంబంధం లేకపోతే వచ్చిన జీతమంతా దానికే ఎందుకిస్తాడు? దానింటే ఎందుకిలా వుండిపోతాడు?

శాంత: నేనీమాటే అడిగాను నాన్నా! దానికాయన చాల కోపం తెచ్చుకొని ఇక మీదట ఈ ఊసెత్తితే చాలు బ్రతికున్నంతకాలం నాకంటికే కన్పించకుండా పోతానని చెప్పేరు.

సీతా: హుఁ! నాకు కనిపించేను కాడు చెబ్దును!

శాంత: అయన్ని మీరేమీ అనకండి నాన్నా!—మా మామగారే తాపీగా చెప్పవలసిన రీతిలో చెప్పి దారికి తీసుకొస్తారు. ఇప్పుడు మీరు వెళ్ళి ఏమేనా అంటే నేను మీతో ఏమిటో చెప్పేననుకొని కోపంతో మరి రానేరారు!

సీతా: ఏదీ, ఆయన ఏమీ అనకుండా ఊరుకున్నాడు? ఆ దావాలు, తంటాలూ తీరే దాకా దీని సంగతే చూడనంటే ఎలాగవుతుంది?—ఇంక ఊరుకుంటే లాభం లేదు. ఆయన రానీ చెప్తాను.

శాంత: అలాగేలెండి నాన్నా, మా మామగారే రాత్రో స్తారు చెప్పుదురు గాని!—పొద్దుట స్నానానికి లేవండి!—వంటయింది. భోజనం చేద్దురుగాని!

[సీతారామయ్య కుర్చీలోనుంచీ లేస్తాడు. తెర]

## రంగము: 3

* * లక్ష్మీపతిగారి యిల్లు. లక్ష్మీపతి సీతారామయ్య కుర్చీలలో కూర్చొని మాటాడుకుంటూ వుంటారు.

లక్ష్మీపతి : మీరీ విషయంలో ఏమీ భయపడకండి బావగారూ!—బోనపరిచి, వాడ్డిని దారికి తీసుకు వచ్చే పూచీనాది!

శీతా : ఏం దారికి తీసుకువస్తారో బాబూ!—ఊరూ వాడా ఎక్కడ విన్నా ఇదే గోల!—కనబడిన వాళ్ళంతా ఇదే అడగడం!—

లక్ష్మీపతి : ఎవరెన్ని చెప్పినా మీరీ విషయం గురించి మరే ఆలోచనలూ పెట్టుకోకండి!—శాంతి మీ కెంతో మాకూ అంతే. ఆమె కేమీ అన్యాయం జరగకుండా చేసే బాధ్యతనాది. మీరింక నిర్భయంగా వుండండి!

శీతా : ఎలాగ నిర్భయంగా వుండగలం చెప్పండి!— అంత మందీ చూస్తే ఇలాగ చెబుతున్నారు, మీరు ఇంతవరకు ఈ విషయం గురించి ఆలోచించడమే లేదు.

లక్ష్మీపతి : ఇదిగో, ఈ దావాలూ వీటివల్ల అవకాశం లేకపోయింది. ఇక తప్పకుండా చూస్తాను.

శీతా : ఏమిటో బాబూ!—అంతా అయోమయంగా వుంది.

లక్ష్మీ : మీరు మరేమీ ఆందోళన చెందకండి!...వాడు ఇలాగ దానివలలో పడి చెడిపోవడం మాకు మాత్రం ఇష్టమా?—మేము మాత్రం చూస్తూ ఊరుకుంటామా?

శీతా : చూశారా, అంతమందీ ఎలా గంటున్నారంటే, "మీ అమ్మాయిని మరక్కడ ఉంచకండి, ఆ వుంచుకున్న దానిమాట విని మీ అల్లుడు ఏ అఘాయిత్యమేనా చెయ్యొచ్చు, అంచేత మీ అమ్మాయిని మీ యింటికి తీసుకువచ్చెయ్యండి!" అని చెబుతున్నారు. దానితో వాళ్ళమ్మ ఒకటే దిగులు పెట్టుకొని, "మన అమ్మాయిని మెందట ఇక్కడికి తీసుకువస్తే కాని భోజనం చేయను!" అని కూచుంది. దానితో ఇలాగ వచ్చేశాను.

లక్ష్మీ : (సీరియస్ గా) సరే, నే నింతలాగ చెబుతున్నా నా మాటమీద మీకు విశ్వాసం లేనపుడు మీ అమ్మాయిని తప్పకుండా తీసుకుపోవచ్చును.

శీతా : అఁహాఁ!-ఎంతమా టన్నారూ?-చూడండి!- కన్నప్రాణం అదిగాక ఒక్కతేపిల్ల! దానికి సుఖం లేకపోయిన తర్వాత మా కేం సుఖం వుంటుంది చెప్పండి!-అంచేత ఇంతలాగ చెప్ప వలసివస్తోంది.

లక్ష్మీ : అవునుకోండి!-అయినా నే నింతలాగ హామీ ఇచ్చికూడ చెబుతున్నా నే?—

శీతా : అయితే సరేబాబూ! ఇంక శాంత మా పిల్ల కాదు; మీ పిల్లే!-మిమ్మల్ని నమ్ముకుని దాని నిక్కడే ఒదిలేస్తున్నాను.

లక్ష్మీ : మీ రింతలాగ చెప్పాలటండీ!-ఇక్కడ మీ అమ్మాయి కే ప్రమాదం రాదు. ఈ పరిస్థితులన్నీ కొద్ది రోజులలో చక్కబడిపోతాయి. మీ అమ్మాయి కాపురం సవ్యంగా సాగుతుంది. మీరు మరి దిగులుపడి మనస్సు పాడు చేసుకోకండి!

[ఇంతలో శంకరం, లలిత ప్రవేశిస్తారు. లలిత కంగారుగా ద్వారంవద్దనే నిల్చుండిపోతుంది. శంకరం మొదట ఇది గమనించకుండా లక్ష్మీపతి, శీతారామయ్యల వంకనైనా చూడకుండా లోనికిపోతూ ఒకక్క తిరిగిచూచి లలిత ద్వారం వద్దనే వుండిపోయిందని గమనిస్తాడు. లలిత వెళ్ళిపోతుంది. శీతారామయ్య ఇప్పుడేం చెప్తాడ్? అన్నట్టు లక్ష్మీపతివంక కంగారుగా చూస్తాడు. లక్ష్మీపతి కోపంతో లేచి లలితకి అడ్డుగా నిలబడతాడు.]

లక్ష్మీ : ఆఁ!...శంకరం!—ఏమి టిదంతా?—

శంకరం : ఇదంతా ఏమిటో తర్వాత చెబుతాను. ఆమెను మొదట లోపలికి రానివ్వండి!

లక్ష్మీ : వీల్లేదు!-శంకరం!-ఇంతవరకు ఏ నాటికేనా నీ మనస్సు మార్చుకుంటా వేమోనని ఊరు కున్నాను. ఇంక సహించను.

శంకరం : ఈ మాటే నేనుకూడా మీ అందరికీ చెప్ప బోతున్నాను.

శీతా : అవును; కాని ఇదేమన్నా బాగుందా బాబూ?- వచ్చిన జీతమంతా దానికే ఇస్తూ దానింటే వుంటూ, కట్టుకున్న భార్యని ఇంతవరకు హింసిం చింది చాలక ఇప్పుడా ముండని తెచ్చి ఇంట్లో పెట్టుకుంటావంటా వే?

శంకరం : మామగారూ, మర్యాదగా మాటాడడం నేర్చుకోండి!

సీత : (లక్ష్మీపతితో) అయ్యా, విన్నారా ఆమాటలు?—వ్యవహారం ఇంతవరకు వస్తుందని నాకు ముందే తెలుసు.

లక్ష్మి : శంకరం, ఏమిటీ వేషం?—దానిని గుమ్మం ఎక్కనివ్వడానికి వీలులేదు.

శంకరం : నాన్నా, అనవసరంగా ఆవేశపడకండి!— ఈమెకీ నాకూ మీరూహిస్తున్న సంబంధం లేదు.

సీత : సంబంధం లేకపోతే మరి ఇదంతా యేమిటి?

శంక : మిమ్మల్ని మాటాడమనలేదు.

సీత : నువ్వు మాటాడమనకపోయినా కూతురికి అన్యాయం జరుగుతున్నపుడు మాటాడవలసిన అవసరం నాకుంది.

శంక : ఆమెకేమీ అన్యాయం జరగలేదు.

సీత : అన్యాయం కాకపోతే మరి ఏమిటిదంతా?— సంపాదిస్తున్న జీతమంతా దీనికే ఇస్తున్నావ్!- కట్టుకున్న పెళ్ళాం నిద్రాహారాలు మానుకొని నీకోసం పరితపిస్తూ వుంటే దీనంట కులుకుతూ కూర్చున్నావ్!—ఇదంతా చాలక ఇప్పుడు నా కూతురిచేత ఈ ముండకి ఊడిగం చేయించడానికని ఇంట్లో కూడా తెచ్చి పెట్టుకుంటానంటున్నావ్!

శంక : (కోపంగా) మామగారూ!—పెద్దవారన్న గౌరవంతో ఊరుకుంటున్న కొద్దీ మితిమీరి నోటికొచ్చినట్టు మాటాడుతున్నారు. మరోమారు ఇటువంటి మాటలు మీనోటివెంటవస్తే ఊరుకొనేది లేదు. జాగ్రత్త!

సీత : లక్ష్మీపతిగారూ!—విన్నారా మీ అబ్బాయి పలుకులు?—ఇంతవరకు మీ ముఖం చూచి సహించేను—ఇదేనా న్యాయం చెప్పండి!

లక్ష్మి : శంకరం!—ఊరుకుంటున్న కొద్దీ శ్రుతిమించుతోంది నీ వ్యవహారం!—దానిని బైటకు పొమ్మంటావా?—లేక ఆపని నన్నే చెయ్యమంటావా?

లలిత : అయ్యా, మీ కెందుకు శ్రమ?—నా గురించి మీరుతగువులు పడకండి;—నే నిప్పుడే వెళ్ళిపోతున్నాను (వెనక్కి తిరిగి వెళ్ళిపోతూవుంటుంది),

శంకరం : లలితా! (లలిత ద్వారంవద్ద ఆగిపోతుంది. శంకరం ముందుకు రెండడుగులు వేస్తాడు. ఇంతలో శాంతవచ్చి శంకరం చేయిపట్టుకొని ఆపుతుంది.)

శాంత : (గద్గదకంఠంతో) — ఏమండీ! — నన్నిలా బాధించడం న్యాయమే మీకు?— నేను ఏం నేరంచేశానని, నాలో ఏం లోపంవుందని ఇంత కఠినంగా ప్రవర్తిస్తున్నారు?—ఒక వేళ నాలో నాకు తెలియని తప్పేదైనావుంటే చెప్పి శిక్షించండి!—కాని ఏమీ చెప్పకుండా నన్నిలా చిత్రవధ చెయ్యడం భావ్యంగావుందా?—(లలితతో)—ఏమమ్మా, నువ్వుకూడా ఆడజన్మ ఎత్తేవు కదా? తోటి సంసారస్త్రీ కాపురాన్ని ఇలా గంగపాలు చేయడం నీకేమైనా బాగుందా?—సోదరస్త్రీ జీవితాన్ని నాశనం చేయడమే నీకు వినోదమా?—నీకు జాలి, దయా, దాక్షిణ్యం లేవా అమ్మా?

శంక : శాంతా!—అనవలసిన మాటలన్నీ అయిపోయాయా?—ఇంకేమైనా ఉన్నాయా ఉపన్యాసానికి?

లక్ష్మి : ఎన్ని ఉన్నా ఎన్నన్నా నీకేమైనా లక్ష్యమా?—దానికేమైనా లక్ష్యమా?

శంక : తప్పులేనిదే అనవసరంగా అంటున్న మాటల్ని లక్ష్యపెట్టవలసిన అవసరం ఏముంది?

సీత : మేమెంత చెప్పినా నీతప్పేదో నీకు తెలియలేదన్నమాట!—

శంక : నాతప్పు నాకు తెలియకపోవడం కాదు. మీరందరు పడుతున్న పొరపాటు మీకు తెలియడం లేదు. పైగా ఇప్పుడు వచ్చింది మొదలు నన్నేమీ చెప్పనివ్వకుండా అనవసరంగా ఘర్షణ ప్రారంభించారు. విషయమేమీ వినకుండానే విమర్శకి పూనుకున్నారు. మామగారూ, ఇప్పుడు చెబుతున్నాను వినండి!—లలిత ఎవ్వరోకాదు. నా సొంత చెల్లెలు!—రాధమ్మ నాతల్లి!

లక్ష్మి : (ఆశ్చర్యంగా) ఆఁ!—రాధమ్మ...అంటే రాధామణి—?

శంక : అవును!—ఆరాధామణే ఈనాడు రాధమ్మగా మారింది!—

లక్ష్మి : ఆమె ఇక్కడే వుందా?

శంక : నిన్నటివరకు ఇక్కడే వుంది.. కాని నిన్న సాయంత్రమే ఈలోకాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయింది

లక్ష్మి : (శోకాకులుడై) హాఁ! రాధమ్మ చనిపోయిందా? —(నిశ్చేష్టుడై విచారంగా కుర్చీలో చేరబడి పోతాడు)

శీతా : అయితే ఈమె మీ చెల్లెలా?

శంక : అవును, ఈమె నా సొంత చెల్లెలు!—అదొక్కటే కాదు!—నాతో సమంగా నాతల్లి గర్భాన నవమాసాలూ పెరిగి నాతో పుట్టిన కవల చెల్లెలు!—

శీతా : ఆఁ!—చాలా ఆశ్చర్యంగావుందే?—అయితే లోకంఅంతా ఇంతలాగ అనుకుంటున్నా నువ్వీ సంగతి ఇంతవరకు చెప్పకపోవడానికి కారణమేమిటి బాబూ?

శంక : తను నాతల్లి, ఈమె నా చెల్లెలుఅన్న విషయం తనొక్కతె జీవించివున్నంతవరకు ఎవ్వరికీ తెలియనివ్వవద్దని మాఅమ్మ కోరింది.

శీతా : ఆమె ఈసంగతి నింతరహస్యంగా వుంచడానికి గల కారణం నీకు తెలియదా?

శంక : ఆ కారణం తెలుసుకోవడం మీకనవసరం!

లక్ష్మి : శీతారామయ్యగారూ!—ఆ కారణం నేను చెప్తాను వినండి!—ఇందులో మీకూ, ప్రపంచానికి తెలియని మరో రహస్యంకూడా వుంది ...ఇంతవరకు శంకరం మా పెంపుడుకొడుకనిమీరంతా అనుకుంటున్నారు కాని కాదు!... శంకరం నా కన్న కొడుకు— లలితకి శంకరానికి నేను కన్నతండ్రిని. రాధమ్మ నా భార్య!—నేను మద్రాసులో లా చదువుతున్న రోజుల్లో ఆమె తనతల్లితో నాలాడ్జికి ఎదురుగా వున్న ఇంట్లో వుంటూవుండేది. అప్పుడే మా కిద్దరికీ పరిచయం అయింది. ఆ పరిచయం ప్రేమగామారింది. తత్ఫలితంగా రాధామణి గర్భం ధరించింది. ఆరోజే నా చదువుకూడా పూర్తయింది. నేను రాధామణినే పెళ్లాడదామనుకున్నాను. కాని మానాన్నగారు నాకు ఒక మునసబుగారమ్మాయిని నిశ్చయించారు. అప్పట్లో నేనుకూడా జరిగిన సంగతినంతటిని మానాన్నగారికి చెప్పలేకపోయాను. మొదట్లో వద్దని దెబ్బలాడినా చివరికి నేను అంగీకరించక తప్పలేదు. ఇంటికి వెళ్ళిపోయేముందు రాధామణిని కలుసుకొని జరిగినదంతా వివరించి ఆమెను పెళ్లాడలేక పోతున్నందుకు నా విచారాన్ని తెలిపాను. గతించినదానిని మరిచిపొమ్మన్నాను. కొంత డబ్బిస్తాను. మరెవ్వరినైనా పెళ్లాడి సుఖపడమన్నాను. ఆమె డబ్బుపుచ్చుకోలేదు. కాని నా సుఖానికి తనేమీ అడ్డురానంది. నాకు తనతో సంబంధంవున్నట్టు ఎవ్వరికీ తెలియనివ్వనంది. మరి నా కంటికెదురుపడనని చెప్పింది. నేను హృదయాన్ని రాయిగామార్చుకొని మా నాన్నగారు నిశ్చయించిన, ఇప్పుడున్న ఆమెను వివాహమాడేను...... నేను పెళ్ళాడిన మూడుసంవత్సరాలకే ఆమెకు ఆరోగ్యం బాగులేక ఆపరేషను జరిగింది. మరి ఆమెకు సంతానం కలగదని డాక్టరు చెప్పేరు. ఇద్దరం చాలావిచారించాం...అప్పుడు నేను మద్రాసువెళ్ళి రాధామణిని అడిగి శంకరాన్ని నావద్దకు తెచ్చుకున్నాను. నా మూలంగా జన్మించిన కవలలు శంకరం, లలితా అప్పటికి మూడేళ్ళపిల్లలు... అప్పటినుంచి శంకరం మావద్దనే పెరుగుతున్నాడు.

శీతా : ఆఁ!—చాలా ఆశ్చర్యంగావుంది. ఈ సంగతి నేనెప్పుడూ వినలేదే?

లక్ష్మి : అవును, మీరేకాదు ఎవ్వరూకూడా వినివుండరు. నే నీసంగతిని ఎవ్వరికీ తెలియనివ్వలేదు... నేను ప్రాక్టీసు ఆరంభించిన కొద్దికాలంలోనే నాకు మంచిపేరువచ్చింది. రాబడికూడ చాలా పెరిగింది. ప్రపంచం నన్ను చాలాగౌరవంగా చూస్తోంది. అటువంటి సమయంలో నేను చేసిన అన్యాయం ఎవరికి తెలిసినా నా కీర్తిప్రతిష్ఠలం దెబ్బతగులుతుంది. అందుచేత నేను ఎవ్వరితోను చెప్పలేదు. ఆ రాధామణి, పిల్ల ఎలావున్నారో అనికూడా ఏనాడూ కనుక్కోలేదు. వారిసంగతి నాకీక్షణంవరకు తెలియనే తెలియదు.

శీతా : అయితే ఇంతకథ వుందన్నమాట!—ఇదంతా తెలియక నేను శంకరాన్ని, లలితని అనరాని మాటలన్నీ అన్నాను.

లక్ష్మి : ఇందులో శంకరం నేరం, లలిత నేరం ఏమీ లేదు. ఇదంతా నా మూలంగానే జరిగింది. కీర్తిప్రతిష్ఠలగురించి భయపడి జాలి, దయ, అభిమానం విడిచి ప్రవర్తించాను. ప్రేమించి సర్వ

అర్పించిన ఒకఅబలకి తీరనిఅన్యాయం చేశాను. కన్న సంతానాన్నికూడా నా సంతానం అని ధైర్యంగా చెప్పుకోలేకపోయాను......అమ్మా, లలితా! విన్నావా ఇలాటిఘోరాలు చేశాడు ఈమీతండ్రి!—పరమ పాపాత్ముడు!

లలిత: విచారించకండి నాన్నా, జరిగినదేదో జరిగిపోయింది.

లక్ష్మి: విచారించకుండా ఎలాగుండేదమ్మా?-ఆనాటి నుంచి ఆమెకు నేను చేసిన ద్రోహం నా అంతరాత్మని పీడిస్తూనే వుంది. అయినా ప్రపంచానికి భయపడి ఏమీ చెప్పలేక చేయలేక ఊరుకున్నాను. నాలో ఇంతటి అన్యాయం వుండడం చేతనే లోకం అంతా శంకరం గురించి ఇంతలాగ అనుకుంటున్నా వాడికి చెప్పేపాటి ధైర్యం కూడా నాకు లేకపోయింది. అందువల్లనే ఎప్పటికప్పుడు దావాలు, కోర్టు పనులు అని తప్పించుకుంటూ వచ్చాను. కాని ఈరోజున శంకరంద్వారా కీర్తి ప్రతిష్ఠల కంటే జాలి దయ అభిమానాలే విలువైనవని గుర్తించాను

[లక్ష్మిపతి ఈ మాటలు అంటున్నప్పుడే చంద్రయ్య ప్రవేశించి వెనక నిల్చొని ఆశ్చర్యంగా వింటూ వుంటాడు]

శీలా: మీరు ఊరుకోడానికిదా కారణం?

లక్ష్మి: అవును! - అయితే మీ అమ్మాయికి కూడా అన్యాయం జరగనివ్వ దలుచుకోలేదు. రాధమ్మకెంతో కొంతడబ్బు ఇచ్చేసి ఆమె లలితను తీసుకొని ఎవ్వరికీ తెలియకుండా మరెచటనా దూర ప్రాంతాలకి వెళ్ళిపోయేలాటి ఏర్పాటు చేదామనుకున్నాను.

శీలా: అవునుమరి, ఇదంతా మీకు మాత్రం ఏం తెలుస్తుంది? — అయితే నాకు మాత్రం శంకరం అలాటిపని చేస్తాడన్న నమ్మకం మొదట్నించీ లేదు. కాని ఈ ఆడవాళ్ళున్నారు చూశారూ; చిలవలు, పలవలు కల్పించి చెప్పడంతో వాళ్ళమ్మ మరింత భయపడిపోయి అమ్మాయి నింటికి తీసుకువస్తేనేకాని భోజనం చేయనని కూచుంది. అందువల్ల ఇలాగ వచ్చానుకాని లేకపోతే రాకనేపోదును. (శంకరంతో)-మూడు నాయనా, అందరూ అన్నమాటలు విని నిన్నేమేమో అన్నాను. అవన్నీ మనస్సులో వుంచుకోకేం?

శంక: ఒకరు అన్నమాటల్ని నేను లక్ష్యపెట్టనండి!- వాటన్నిటికీ ఆలోచిస్తే దిక్కులేని నా తల్లినీ, చెల్లెల్నీ రహస్యంగా ఇన్నిరోజులుంచుకోడం సాధ్యమయ్యేదే కాదు.

శీలా: అవున్లే మరి!

లక్ష్మి: (లలితతో)-అయితే నువ్వూ అమ్మా ఇక్కడికెలాగ వచ్చారమ్మా?

లలిత: మీరు అన్నయ్యని తీసుకు వెళ్ళిపోయాక అమ్మకి బాధలు మరింత లావయాయి. మద్రాసులో వున్న ఆచిన్నయింటిని అమ్మగా వచ్చిన డబ్బుపెట్టి అంతవరకు మా యిద్దరినీ పెంచింది అమ్మ. మీరు అన్నయ్యని తీసుకువెళిపోయిన కొద్దిరోజులకే అమ్మదగ్గర డబ్బు పూర్తిగా అయిపోయింది. ఇంక జీవనోపాధికి మరేదీ మార్గంలేక కొందరిళ్లలో పనికి కుదురుకుంది. ఎందరివల్లనో తిట్లు పడింది. ఎన్ని అవమానాలనో సహించింది. ఆ వృత్తితోనే నన్నింతవరకు పెంచి పెద్దదానిని చేసింది......నేటికి ఆరుమాసాల నుంచీ అమ్మ ఆరోగ్యం క్షీణించడం ప్రారంభించింది. నన్ను దిక్కులేకుండా చేసి తనెక్కడ చనిపోతుందో అన్న భయం ఆమెను ఆవరించింది. దానితో ఆమె ఆలోచించి ఆలోచించి చివరకి అన్నయ్య నెలాగేనా కలుసుకొని నన్ను వాడికి అప్పచెబుదామని ఈవూరు తీసుకువచ్చింది. వచ్చి డాక్టరు ప్రసాదరావుగారింట పని మనిషిగా కుదురుకొని అన్నయ్యజాడ తెలుసుకుంది. వారి అబ్బాయి పుట్టినరోజు పండుగనాడు అన్నయ్య, ఒదినా వారింటికి వచ్చారు. అప్పుడు అమ్మ రహస్యంగా సంగతంతటినీ అన్నయ్యకు చెప్పి తనూ మీరూ కలసి తీయించుకున్న ఫోటో చూపించింది. అన్నయ్య అంతావిని మా ఇద్దరినీ యింటికి వచ్చేయమన్నాడు. అమ్మ అందుకంగీకరించలేదు. నన్నొకర్తినీ తీసుకు వెళ్ళిపొమ్మంది. తనెటో వెళ్ళిపోతానంది. అందుకు

నేనూ అన్నయ్యకూడా ఇష్టపడలేదు. అలాగయితే తనిక్కడే నాలుగిళ్ళలో పనిచేసు కుంటూ రహస్యంగా వుంటానని, తను వాడి తల్లి అన్న సంగతి ఎవ్వరికీ తెలియనీయవద్దని అమ్మ అన్నయ్యతో చెప్పింది. అన్నయ్య దానికికూడా ఒప్పలేదు. అమ్మని తన తల్లి అని ఎవ్వరికీ తెలియకుండేటట్టు వేరే యింట్లో వుంచుతానని, ఎవ్వరింటా పనిచేయకుండా తన దగ్గరికివచ్చి వుండమని అన్నయ్య కోరేడు. అమ్మ సరేనంది. నేనుకూడా అమ్మదగ్గరేవుంటా నన్నాను. అప్పట్నుంచీ అన్నయ్య మమ్మల్ని వేరేయింట్లోవుంచాడు. మాకుతిండి బట్టా అన్నీ సమకూరుస్తూ వచ్చాడు. అందిన జీతం అంతా అమ్మకే యిచ్చేవాడు. డాక్టర్ని పెట్టి అమ్మకి మందిప్పించాడు. చాలా కాలానికి కనబడ్డం చేత నాకూ అమ్మకి అన్నయ్య ఎప్పుడూ మా దగ్గరే వుండిపోవాలనిపించేది. అన్నయ్యకూడా మమ్మల్ని విడచి ఇంటికి వెళ్లలేక పోయేవాడు. అందువల్ల వాడి భోజనం, పడక, తరచుగా, మేమున్నచోటనే అయేవి. కాని ప్రపంచం దీని నంతటినీ మరో విధంగా అర్థంచేసుకుంది.

శంకర : పాపం ఎన్ని బాధలు పడింది!

లక్ష్మి : ఆమె బ్రతుకంతా బాధలతోనే తెల్లవారింది. తండ్రి ఆస్తినంతటినీ త్రాగుడుకింద తగలేసి మద్రాసులో మేమున్న లాడ్జికి ఎదురుగావున్న ఆ చిన్న యింటినిమాత్రం మిగిల్చి చని పోయాడు. తల్లి ఆమెను పెట్టుకొని ఆ ఇంట్లో వుంటూ అక్కడున్న ఒక ఇంజనీరు గారింట్లో వంటపని చేస్తూండేది. ఎక్కడేనా సంబంధం కుదురుతే ఆ ఇంటినమ్మేసి ఆ డబ్బుతో మా అమ్మకి వివాహం చేదామని ఆ తల్లి అనుకుంది. కాని మా అమ్మ బ్రతుకిలాగయింది.

సీతా : ఏదో అయిపోయిన సంగతి అయిపోయింది. మరవన్నీ మరిచిపో బాబూ!

లక్ష్మి : లేదు!—వాడికి నామీద చాలా కోపంగా వుంది.

శంకర : ఛా ఛా! కోపం ఎందుకు నాన్నగారూ?— అమ్మ అన్నిబాధలు పడిందన్న విచారంతో అలాగన్నాడుకాని మీ మీద కోపంతో అన లేదు.

లక్ష్మి : నిజమేనాయనా, నీ కున్నంత ధైర్యం నా కుంటే ఆమె అన్ని బాధలుపడే అవసరం లేక పోను!

సీతా : విచారించకండి బావగారూ!—ఆమె నిజంగా ఒక దేవత!—మీకు సంతానాన్ని ప్రసాదించ డానికి ఈ లోకంలో అవతరించింది. మణి పూసల్లాటి ఈ ఇద్దరు పిల్లల్నీకని మీ దగ్గరకు చేర్చి తను వెళ్ళిపోయింది.

కాంత : (లలితదగ్గరకువెళ్ళి ఆమె రెండు చేతులూ పట్టు కుంటూ) నిజం తెలుసుకోకుండా నిన్ను ఏమి టేమిటో అన్నాను. నన్ను క్షమించువదినా!

లలిత : ఆడదీ మగాడు ఒక దగ్గరుంటే ప్రపంచం వారి గురించి ఎన్నో అనుకుంటుంది. అందరూ అను కున్నట్టే మధ్యా అనుకున్నావు. ఇందులో క్షమించడానికేముందమ్మా?

సీతా : ఆఁ!—అదీ!—అయితే ఒదినా ఆడబిడ్డలు కలిసి పోయినట్టేనన్నమాట!—నేనింకా ఇదే చెబుదామనుకుంటున్నాను.

లక్ష్మి : వాళ్ళకి మనం చెప్పాలిటండీ? — అమ్మ కాంతా!—లలితని లోపలికి తీసుకువెళ్ళమ్మా!

కాంత : (లలితతో) రా ఒదినా!—

లలిత : పిన్నెక్కడుంది బావా!

లక్ష్మి : మీ పిన్ని తెనాలిలో వుందమ్మా!—రమ్మని ఇవాళే రాస్తాను.

చంద్ర : పాపం!—పిల్లలంటే పెద్దమ్మగారికి మా పెద్ద సరదా!—ఈ సంగతి తెలిస్తే ఎంతో యిదయి పోతారు!

సీతా : పిల్లలులేరు లేరనుకుంటే వున్నామ నరకం తప్పింది. రేపు ఎక్కడో మంచివరుణ్ణి చూసి అమ్మాయికి ఆ మూడుముళ్లూ వేయించేస్తే కన్యా దానఫలంకూడా దక్కుతుందన్నమాట బావ గారికి!

చంద్ర : నాకు బూరెముక్కలుకూడా దొరుకుతాయి!

[తెర]

# ఆలోచనల గొడుగు

శ్రీ విరించి

కాలం జరిగిపోతోంది.
ఆవేశం ముదిరిపోతోంది
దారి కనరావటం లేదు,
మది కేమీ తోచడం లేదు.
ఇలా ఎన్ని నాళ్లు గడవాలో
అంతు పట్టటం లేదు—
ఎడారిలా వుంది ఆలోచన,
అయినా తప్పటం లేదు.
పార్కు నుంచి ఇంటికి వస్తున్నాను;
శరీరం తూలుతోంది,
సైడు కాలువలో పడుతుందేమో నని
లోలోపల భయం పుడుతోంది.
నడుస్తున్నాను—ఎంతో ప్రయత్నం చేసి.
ఇంటికి చేరుకుందామనే అభిలాష లేదు,
ఎటో తిరుగుదామని
ఎందుకో పయనిద్దామని
అనిపిస్తోంది!
యాత్ర సాగించాలి,
దేశం వీక్షించాలి. అన్ని బజార్లూ
లక్ష సార్లు చుట్టిరావాలి.
దీక్ష పూర్తి కాదు లేకపోతే.
గమ్యం అంటూ యేమీ లేదు
సూటిగా తోచనంత వరకూ పోవడం తప్ప.
ఎందు కిట్లా సోమరిలా
దేశదిమ్మరిలా
తిరుగుతున్నాను?
నేను యాత్రికుడిని కాను, అంతకంటే
మాంత్రికుడిని కాను.
మహామంత్రినో, ప్రభుత్వ కార్యదర్శినో
అసలే కాను.
మరి...మరి ఎందు కిలా తిరుగుతావు?
పిచ్చివాడివా?
నాకు తెలీదు గా మరి, యేం సమాధానం
చెబుతాను?
నాకూ అనుమానమే, పిచ్చివాడిని
కానేమో నని!
నాకు అనేకం ఆలోచను,
దేశం అంటే యేమిటి?
దేహం అంటే యేమిటి?
దేశానికీ దేహానికీ యేమిటి సంబంధం?
జనం అంటే ఎవరు?
మనం అంటే ఎందుకు?
వినని వాళ్ళంటూ ఎందుకు?
చెయ్యని వాళ్ళంటూ ఎందుకు?
అన్నీ అనుమానాలే, తీరని సందేహాలు,
నాకు పూర్తిగా తెలుసు, అవి అంతేనని!
వాటి శాశ్వత స్వరూపం అంతేనని!
అయినా ఆలోచిస్తా నెందుకు?
ఇదీ ఆలోచించాల్సిన విషయమే మరి!!

* * *

రోడ్డుమీదే నడుస్తున్నాను.
కంకరరాళ్ళు కనిపిస్తూనే వున్నాయి,
కనుచూపు మేరంతా
దీర్ఘంగా యీరోడ్డే కనిపిస్తోంది.
ఈరోడ్డు ఎక్కడికి పోతుంది?
ఎక్కడికీ పోదు—
ఎన్నాళ్ళనుంచో చూస్తూన్నాను,
ఇక్కడే వుంటోంది.
మన నాగరకతంతా 'యే' బాంబుతో
సర్వ నాశనం అయ్యేంతదాక
ఇక్కడే వుంటుంది.
తరువాత; లోపలికి పోతుంది—
పాతాళం లోనికి,
అందాక కనిపిస్తూనే వుంటుంది.
రోడ్డు ఎక్కడికీ పోదు,
నేనూ ఎక్కడికీ పోను,

రోడ్డుకూ నాకూ అవినాభావ సంబంధం,
దేశంలో ఎక్కడికి పోయినా,
పట్టు విడకండా
ఒట్టు చెడకండా
కనిపించేది ఒక్క యీరోడ్డే
మనుషుల మంచితనం కాదు,
మనుషుల గొప్పతనం కాదు,
మనుషుల రేమీకాదు—
ఈ రోడ్డే !
చాల గట్టిగా ఉంది,
కాలికి దెబ్బతగులుతూంది,
రోడ్డునుగురించి ఆలోచనేమిటి, కాకపోతే ?
అచేతన పదార్థాలగురించి ఆలోచనేమిటి,
దుర్భ్రమ కాకపోతే ?
ఏది దుర్భ్రమ ?—?
ఈ ప్రపంచం, జీవితం, దేశం, శరీరం,
కీర్తి, ప్రతిష్ఠ—అన్నీ దుర్భ్రమ
రోజూ యిదే పనయినా
విసుగనిపించనిది యిదొక్కటే
యాత్ర !
ఊరంతా మట్టు కెంత ?
నాలుగున్నర చదరపుమైళ్ల వైశాల్యం,
రోజుకో అరడజను సార్లు
చులాగ్గా చుట్టిరావచ్చు,
రోడ్డంటే నడుస్తోంటే
మనం మధ్యలో ఆగిపోయినా
నడుస్తూనే వుంటాం—
మనం నడవటం ఆపేశినా
నడుస్తూనే ఉంటాం,
మహాజనం ముందుకు పోతూంటుంది,
వాహన యోగాలు పట్టించుకొన్న పెద్దలు,
బొర్ర కదలకండా, బుర్ర చెదరకండా
ముందుకు నడుస్తూనే ఉంటారు;
మరీ విచిత్రం యేమిటంటే—
ఎటునైపునించి ఎటువైపు చూచినా
అంతా ముందు చూపే
అంతా సమతల దృశ్యమే.
నడుస్తోండటంలో
ఆనందం ఉన్నది.

దివ్యమంగళ విగ్రహాల దర్శన భాగ్యం,
భవ్యమంగళ సుగ్రహాల సంక్షిప్త ప్రత్యాగం,
'అ' మొదలు 'క్ష' వరకు అన్నిరకాల
లక్షణాలు, రోడ్డుమీదే,
అందరూ అనుక్షణమూ నడిచే
అన్ని రోడ్లమీద
కనిపిస్తోంటాయి.
ఏ బ్యాంకు భవనమో
న్యూయార్కు నగర నమూనా యో
ప్యారిస్ నగర సుశిక్షిత శృంగారమో
ఏషడుగుల మనిషి తెలూకు
మూడు మూర్తుల విగ్రహమో!
అన్నీ వింతలు
వింతలు చూస్తూ విచిత్రపడుతో
రోడ్డుమీద నడవటంలో
ఆనందం లేదా మరి!
ప్రపంచం అంటే యేమిటి?
ప్రకంపం అంటే యేమిటి?
ప్రభంజనం అంటేనో?
అన్ని ప్రశ్నలకూ జవాబులు అవిగో!
అందరికీ అందుబాటులో
అట్టలమీద రాశిపెట్టారెవరో—
పుణ్యాగణ్యలు, పాపం—లోకం కోసం
ఉపకారాలు చేస్తోంటారు,
లోకం కోసమే బతుకుతోంటారు,
లోకుల కోసమే బతుకుతోంటారు,
అట్టివారి 'కాతం' ఎక్కువయితేనే
అందరికీ 'అభ్యుదయం' రాదంటారు.

*　　*　　*

ఈ రోడ్డుమీద యిట్లా
ఎప్పుడో ఎక్కడో
బయల్దేరి
ఎంత దూరం వచ్చానో
ఎట్లా తెలుస్తుంది?
వెనక్కి తిరిగి చూస్తే
ఏం కనిపిస్తుంది?
ముందు చూసినా, వెనక చూసినా—
ఏవీ తెలీదు, అర్థం కాదు.
అర్థం చేసుకోటం మనవంతు కాదు.
అన్నీ చూస్తోండటమే మనకు తెలిక.

ఆలోచించకుండా మనమంతా
అల్లంత గొప్పవాళ్ళం.
ఆలోచించటం అంటూ మొదలెడితే
దౌర్భాగ్యులం, భ్రష్టులం, దుర్మార్గులం—
—అయినా ఆలోచిస్తానెందుకు?
ఆలోచించడంఅంటూ ఎప్పుడు
మొదలెట్టానో కాని, దానికి అంతు
విషయం, వివరం యేమీ లేవు.
మొదలు లేనిదానికి అంతు లేదు,
అంతు లేనిదానికి ఆది లేదు,
ఆది అంతూ లేనిదానికి 'మధ్య' లేదు
ఆదిమధ్యాంతరహితం ఆలోచన.
ఒక ఆలోచనేనా? అన్నీ అంతే—
యావత్ప్రపంచం అంతే.
ఎంతసేపు యిట్లా
ముసిరే జోరీగల్లాగ
వెంటబడి మొరిగే పిచ్చికుక్కలాగ
వెనకబడి తిరిగే చీమలాగ
యాత్ర సాగించాలి?
యాత్రాప్రయోజనం యేమిటి?
ఎప్పటికయినా ఒకగమ్యంఅంటూ—
చేరుకోవటమే ఆశయం అయినా
అగమ్యం, అగమ్యంగా
అనవ్యవ్యయప్రయాసలకు—మానవిక
వ్యథలకు, యిత్యాది యిత్యాగులకు
అతీతంగా, ఆకసంలో కలిసిపోతుంది!
శూన్యంలో లీనమైపోతుంది!
కాని, పగలు—రాత్రి, వెలుగు—చీకటి
దరి—దాపు, అ నేవ్యత్యాసం
మనసుకు రాకండా, యాత్ర సాగిస్తాను;
యాత్ర నిరాఘాటంగా సాగాల్సిందే!
ఏగోడా రాకూడదు,
ఏ మేడా తగలకూడదు,
నిర్విచారంగా, నిర్వికారంగా
నిర్వేదంగా యాత్ర కొసకంటా
నడవాల్సిందే!
సంకల్పం గొప్పది,
సంవిధానం సూక్ష్మమైనది,
సాగుతుంది యాత్ర!

ఫలిస్తుంది యాత్ర!
జయిస్తాను సంకల్పాలు—
ఏమిటికోరిక? ఏంకావాలి??
తెలీదు—
అనాసక్తంగా బతుకుతోన్నాను,
చీకటిలో వెలుగుతోన్నాను,
వెలుగులో మెలుగుతోన్నాను,
ప్రపంచం అంతటా కనిపించే
ఒకే ఒక రోడ్డుమీద
పయనిస్తున్నాను, బహుశా
శయనిస్తూకూడా పయనిస్తున్నాను.
ఉద్రేకాలు ఉద్వేగాలు లేకండా
మదమాత్సర్యాల ప్రసక్తి రాకండా
మోదప్రమోదాల ప్రమాదాలు లేకండా
నా పని చేసేదో చేసుకు పోతున్నాను,
సందేహం లేకండా, సేవంతే చేస్తున్నాను.
ఆలోచన్ను మినహాయిస్తే
బ్రతుకు అసలే లేదు.
ఆలోకన మినహాయిస్తే
ఆకారం అసలే లేదు.
బ్రతుకుకు ఆకారం కావాలి.
ఆకారానికి యేకారం కావాలి?

* * *

ఈ నిమిషంలో వున్న ఆలోచన
మరు నిమిషం మనకోసం
వేచి వుండదు.
ఏ నిమిషాని కానిమిషమే
ఏ ఆలోచన కా ఆలోచనే
కొత్తగా స్ఫురిస్తుంది,
ఒకదాన్నుంచి మరోటి
'డిరైవేటివ్' కాదా?
కాకపోవచ్చు— అట్లా కాకపోవటంలో నే
మెచ్చుకోదగ్గ ఆనందం ఉంది!
ఆలోచన రాకపోవటం అంటే—
చావు మీదకురావటం అన్నమాట!
చావు మీదకురావటం అంటే—
మరో ప్రపంచంలోకి
తరలి పోవట మన్నమాట!
ఆ, మరోప్రపంచం ఎక్కడుంది?

మనిషి మనస్సులో వుంది.
ప్రతి మనిషికీ ఒక్కో ప్రపంచం ఉంటుంది,
కాదు, అంత సంకుచితం కాదు,
ఒకో మనిషికీ రెండు ప్రపంచాలు—
చాలవు......
డజన్ల కొద్దీ ప్రపంచాలు ఉంటాయి
ప్రతివాడూ యే నిమిషంలోనయినా
యే ప్రపంచంలోనయినా ఉంటాడు.
అయినప్పటికీ అనువయిన అన్ని
ప్రపంచాలూ చాలవు.
ఎప్పటి కప్పుడు యింకో ప్రపంచం
కావాలి! వెలితి లేంది బ్రతు కేముంది!
నిరాశ లేకండా సుఖం యేముంటుంది?
స్వర్గానికి వెళ్లినా సరే
ఆలోచనలు మూటకట్టుకుని
చంక పెట్టుకునే వెళతాను,
ఎన్ని వంతెనలు దాటాల్సొచ్చినా
ఎన్ని తంత్రులు మీటాల్సొచ్చినా
ఆలోచనల మూటమటుకు మర్చిపోను,
ఎన్ని ఆలోచన లున్నా
ఎన్ని ఆవేదన లున్నా—
యేమీ ఫరవాలేదు.
ఏమంటే, దీనికీ 'కంక్లూషన్' లేదు కనక
ఏదీ బ్రతుకును 'ఇంక్లూషన్స్' చేయదు కనక!
గతులు మార్చటానికి యేదీ ప్రయత్నించదు—
ఎట్లావున్నది అట్లా వుంటే చాలు!
ఏదీ మార్పు అక్కర్లేదు.
ఏ చేర్పులూ అక్కర్లేదు,
ఎవరి కూర్పులూ అవసరం లేదు.

* * *

నిశ్చల జలనిధి ఎవడి ప్రమేయమూ
లేకండా చలించదు.
దానవు డెవడో గులకరాయి వేశాక
మళ్ళీ తేరుకుని నిశ్చలత్వాన్ని
పొందటానికి యుగాలు పట్టవచ్చును!
దాన్నే యీ మానవుడు సహించడు,
ఎవడు చేస్తున్నది వాడిని చేస్తూవుండనీ,
నువ్వుమాత్రం చూస్తూవుండు,
చూస్తూవుండటమే చేస్తూవుండు.
చేస్తూవుండటమే చూస్తూవుండు.
అన్నీ మనసులో ఆలోచించుకో
రహస్యంగా కూడబలుక్కుంటూండు,
రమ్యంగా గడిచిపోతుంది నీకు,
దివ్యంగా వెలిగిపోతావు నీవు!
నీ స్వరూపం గ్రహించి, స్మరించుకో
స్మరించుకుని, మరిచిపో.
మనిషిని అని గుర్తెచ్చుకుని
భయపడకు లే—మాయలూ
మర్మాలూ గడిచిపోతాయిలే!
కోడ్డుకు అడ్డం తగల
దనుకున్నావు కాని—
పొరపాటు సుమా!
విస్తృతంగా ఆలోచిస్తే
మనిషికి మిత్రుడంటూ లేడు,
అసలువాడు మందికి మనిషి కాడు,
ఎన్ని చెప్పినా పోడు—
మదించిన భిక్షుకుడిలా
త్యాగాన్ని ఉపాసిస్తూ భోగాన్ని అపేక్షిస్తాడు,
రాగాన్ని ఆలపిస్తూ వేగాన్ని మరుస్తాడు.
ఈ సరికి—
యాత్రికులు బసచేసే సత్రానికి
చేరుకున్నామూ అంటావా?
ఆ మాటకు, యాత్రికుడు బసచేయటం
ఎందుకంటాను?
నిజంగా యాత్రికుడైనవాడు,
యాత్రచేస్తూనే వుండాలి!
బసచేసుకు భోజనం చెయ్యట మెందుకు?
బ్రతకటంకోసం ఆలోచించట మెందుకు?
[ఆలోచించేందుకే
అవతరించాను ఈ లోకంలో!
ఆలోచిస్తూనే
అవతరిస్తాను అవతలి గట్టుకు—]
యాత్రికుడికి కావల్సింది
నడవటానికి దారి—కాకపోతే పందు!
పందు కోసం సర్వప్రయత్నం చేసి
ఎందూ కానక విసుగు చెంది
యాత్రికుడుగా తయారయా నంటావా?
నిన్ను మోసం చేసేవాళ్లు అవతల
ఎంతో మంది కాచుకునుంటే—

నిన్ను నువే విశ్వాసం చేసుకోవటంలో
అర్థం ఏముంది—పైగా అది కేవలం
అనవసరం కూడాను!

*　　*　　*　　*

ఎందరో కనిపిస్తారు
మిత్రులమంటారు—మనిద్దరికీ
నిజం చెప్పాలంటే ఒకటే ప్రాణం అంటారు,
చివరకు 'నువు చచ్చిపో'—'నేనొక్కడినే
బతికితే చాలంటారు'
కోడ్డంటే ఎన్ని విశేషాలు చెప్పాను,
ఏమిటో దొరుకుతుంది,
దాంతో ఎంతో కాలం దొర్లిపోతుంది,
చివరికి మిగిలేది, నేనూ—
నా ఆలోచన్లూ
ఏ యుగం అంతమయినా
ఏ కల్పం అంతమయినా
ఏ లోకం దాటిపోయినా
మిగిలేది యింతే, నేనూ
నా ఆలోచన్లూ
ఇట్లా యాత్ర సాగిస్తూవుంటే,
ఎంతో మంది
ఘన పురుషులు తగుల్తారు,
వాళ్లనుగురించి మనం గర్వపడతాం—
వాళ్ళున్న సమాజంలో మనం వుండటం,
వాళ్ళు నడిచే భూమ్మీదే మనమూ నడవటం,
వాళ్ళు మాట్లాడే మాటలే మనమూ అనటం,
కాస్త విచిత్రమే అయినా,
చెప్పుకోదగ్గంత గొప్పదేను!
మనుషుల్లో నిజంగా
కొంతమందే గొప్పవాళ్లు,
ఈ కొంత మందిలో నిజంగా
కొంతమందే గొప్పవాళ్లు.
మిగతా వాళ్లంతా, మామూళ్లు ప్రజ!
గొప్పవాళ్లు చెప్పినట్టు చేస్తారు,
చెప్పినట్లూ చేస్తారు!
గొప్పదనం మనుషుల్లో వుంటుంది,
మనుషులూ గొప్పదనంలో దాక్కుంటారు,
గొప్పవాడి మనస్సు గొప్పది,
తినుస్సు గొప్పది, తినస్సుగొప్పది.
గొప్పవాడి వైభవంతా గొప్పే!

గొప్పకావటంవల్లనే గొప్పవాడైనాడు,
గొప్పవాడవటంవల్లనే అంతా గొప్ప!
కాని—కొంతమంది వుంటారు,
కొన్నింటిలోనే గొప్ప.
ఆ కొన్నింటిలోనే తిరుగులేపోయి,
మిగతా వాటిలో వేలుపెడితే—కంపు!

*　　*　　*

కాని, గొప్పవాడైనా, కొద్దివాడైనా
కొద్దిగా గొప్పవాడైనా,
గొప్పగా గొప్పవాడైనా
అందరికీ సర్వసామాన్యంగా, అవసరమయేది
డబ్బు!—డబ్బు అవసరానికి మనిషి తాలూకు
ధార్మికత, మానసికతల ప్రసక్తిలేదు.
లేదు, లేదూ?—ఛీ వెధవడబ్బు నాకక్కరేదు!
కావల్సి రాందే అక్కర్లేదని ఎందుకంటాడు?
అక్కర్లేనిదాని ప్రసక్తి ఎందుకసలు
తీసుకొస్తాడు?

డబ్బులేనివాడు దరిద్రుడు
కాడు, డబ్బక్కర్లేనివాడు!
డబ్బు విషయం తీసుకొస్తే
మన మంతా మంచి వాళ్లమే,
మనిషి హుషారుగా వున్నా
జబ్బుగా వున్నా డబ్బుమాత్రం కావాలి!
నిండువున్నా నిండో లేకపోయినా
తిన్నా తినలేక పోయినా
డబ్బు మాత్రం కావాలి!
డబ్బే తినడు.
డబ్బును పరోక్షంగా తింటాడు.

యాత్ర చేస్తోంటే—
సాయంత్రం అయినా ఫరవాలేదు.
చీకటిపడినా మరేం బెంగలేదు,
యాత్రమాత్రం నిరవధికంగా సాగితే
యితరమేమీ అక్కర్లేదు.
ఉన్నప్పుడు తింటాడు,
లేనప్పుడు పడుకొంటాడు.
ఉన్నప్పుడుమాత్రం ఎందుకు తినాలి,
లేనప్పుడు పడుకుంటున్నప్పుడు?
చేతనయినవాడికి
ఉంటేనేం, లేకపోతేనేం?

పార్కు బెంచీకన్నా
పల్లెటూరి వీధి అరుగు మెరుగు.
వీధి అరుగుకన్నా
మర్రిచెట్టు నీడ మెరుగు.
మర్రిచెట్టు నీడకన్నా
మెరుగయినవాటికి జాబితా
పెరిగివుంది.
వీటన్నిటికన్నా
ఆలోచనల గొడుగు
బెస్టు!—ఆ గొడుగు
విప్పుకు నిలుచుంటే
హైడ్రోజనుబాంబు
పడినా—మనకేవీ భయవా లేదు.
ఆహా, శాంతిః శరీరానికి
ఊన్నా.
మానసికత శాంతి భంగం రాదు.
మనస్సు పోయినా
తపస్సు కేరినా భయవా లేదు.
ఆ—ఆలోచనల గొడుగుక్రింద చేరితే,
ఆలోచనల అవతారాలన్నీ కూడ గుర్తురావు.
ఆలోచనలలో చేరితే
అవసరాలు కూడా గుర్తురావు.
ఆలోచనలలో చేరితే
అవరోధాలు కూడా అనిపించవు.
ఆలోచనల గొడుగున్నవాడికి
అవసరాల అవరోధాలుండవు,
అవరోధాల అవసరాలమాట సరే
సరి!
అయితే—యీ ఆలోచనల
గొడుగెక్కడుంది?

అవతలి గట్టుకు చేరుకుంటే,
ఆకాశం భూమీ కలుసుకుంటే,
నదివొడ్డునే నాకలోకం వెళ్ళొస్తే
ఆలోచనల గొడుగు దొరుకుతుంది.
ఆ గొడుగు కోసరం,
యే తపస్సూ చేయరాదు,
యే మనస్సూ మునగరాదు—
ఆలోచనల గొడుగు అవసరం లేనివారుంటారా?
ఆ గొడుగు మడిచి చంకను
పెట్టుకోనూవచ్చు.
విప్పి భుజాన వేసుకోనూ వచ్చు.
భూమికానించి మీద కూర్చోనూవచ్చు.
ఆలోచనల గొడుగు
కామధేనువులాంటిది.
కల్పవృక్షంలాంటిది,
స్వభావం ఒకటే అయినా
వాటికీ వీటికీ భేదం లేకపోలేదు.
కామధేనువయినా కల్పవృక్షమయినా
అడిగినవన్నీ యిస్తాయి,
అడగటంతోటే యిస్తాయి,
అడగకముందే యిస్తాయికూడా.
అంతేకాని—ఆలోచనల గొడుగుమాత్రం
ఇవేవీ అడిగే అవసరాన్ని కలిగించదు,
ఈ గొడుగుక్రింద చేరితే—
పైని మనవి చేసుకున్నట్టు
ఏ అవసరమూ వుండదు,
కనకనే, ఆలోచనల గొడుగు
కామధేనువుకన్నా
కల్పవృక్షంకన్నా—మిన్న!
అవును—మిన్న!!

# ఆంధ్రవాఙ్మయచరిత్ర: శబ్దస్వరూప నిష్పత్తులు

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

మనభాషాస్వరూపాన్ని సుస్పష్టంగా ఆకళించుకోవటానికి, అందులోని శబ్దాల నిష్పత్తులను గూర్చి తీవ్రంగా పరిశోధనలు జరగాలి. మనవాడుకలో ఉన్న శబ్దా లెలా సిద్ధించాయో—వాని సంస్కృతు లెలా జరిగాయో—దాన్ని అనుసరించి వాటిలో కలిగిన మార్పు లెలాటివో—వాటికి అనుగుణంగా తక్కిన సోదర ద్రవిడభాషా శబ్దాల పోలిక లెలా సంభవించాయో వీటినిగూర్చి పరిశోధకులు, శబ్దశాస్త్రజ్ఞులు, భాషాచరిత్రకారులు—ఈనాటివఱకు ఎడతెగకుండా 'శిష భిషలు' పడుతూనే వున్నారు. మనవాళ్ళింకా సామాన్యశబ్దాలకే కాకుండా, సాంకేతిక పదాలకు కూడా వ్యుత్పత్తులతో కూడిన స్వరూప నిష్పత్తులను నిర్ణయించే పరిశోధనలకు పూనుకోకపోవటం శోచనీయం. ఈ విషయంలో నాకు తెలిసినంతవరకు ఒక్క శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు మాత్రం కొంత పరిశ్రమ చేసినట్లు కనబడుతున్నది. కీర్తిశేషులలో కొత్త కొత్త శబ్దనిష్పత్తులను బయట పెట్టటానికి కృషి చేసినవారు — శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారున్నూ, శ్రీ చిలుకూరి నారాయణరావుగారున్నూ. కాని వీరిలో మొదటివారు సర్వస్వ నిర్మాణాన్ని, రెండవవారు సాహిత్య పరామర్శను ప్రధానంగా పెట్టుకొని వాటికై కృషిచేసే సందర్భంలో ప్రసక్తానుప్రసక్తంగా ఆంధ్రశబ్దనిష్పత్తులను కొన్నింటిని బయలు పరిచారు.

ప్రకృతం ఉన్నవారిలో శ్రీ మల్లాది, వఝలవారీ విషయంలో గణింపతగ్గవారు. శబ్దశాస్త్రరీత్యా వీరెన్నో పదాల నిష్పత్తులను గూర్చి వివరించారు. అవి యిప్పటివారికే కాక, భావి తరాలవారికి గూడా ప్రమాణాలు అవుతాయి. అందులో రెండవవారి కృషి అపారమయింది. నిజంగా, ఈ శతాబ్దంలో మన సారస్వతం, లక్షణ విషయంలోనే కాక, శబ్దస్వరూప నిష్పత్తుల విషయంలోను వారి (సంపుటాల కొలది) రచనలు సమగ్రమయినవని నిరూపించవచ్చును.

అయితే పై ఇరువురి కృషి సంస్కృతాంధ్రాల వరకే పరిమితమయింది. మనకు భాషాచరిత్రను మొదటిసారిగా అందించిన కీర్తి శ్రీ శేషగిరిరావుకు దక్కింది. ఆయన సాధ్యమయినంత వరకు ద్రావిడ భాషలన్నింటిలోను గల శబ్దసాదృశ్యాలను చూపి వివరిస్తూ తన తరువాతి పరిశోధకులకు ఆదర్శప్రాయు డయ్యాడు. అయితే వారు వ్రాసిన తెలుగుభాషా చరిత్ర (Telugu Philology) మీదకూడా కాల్డ్వెల్లు సిద్ధాంత ప్రాబల్యం పని చేయకపోలేదు.

ఇక ఆంగ్లభాషలో పట్టభద్రులనిపించుకొన్న శ్రీకంటి, కోరాడల పరిశోధనలకా యన్యదేశ్య పరిజ్ఞానం కూడా కొంచెం తోడ్పడిందనక తప్పదు. అయితే మొదటివారు శబ్దశాస్త్రకర్తలై ఆంధ్రలోకాని కందజేసిన విషయాలకంటె, రెండవ వారి భాషాచరిత్ర విషయైకరచనలు అందజేయగలిగిన అంశాలే యెక్కువ. అని నా అభిప్రాయం. పై చెప్పినవారిలో ఎవరుగాని తక్కిన దక్షిణదేశ ద్రావిడ భాషలయందలి పదాల నిష్పత్తులను వాని కాధారమయిన లక్షణాలను గూర్చి పరిశీలింప గలిగినంత పరిచయాన్ని క్షుణ్ణంగా గడించిన వారు కారు. వీరికీ కాల్డ్వెల్లు వ్రాసిన భాషాచరిత్రాంశాలే శిలాక్షరాలు. వేదవాక్యాలు. కాల్డ్వెల్లు ద్రావిడ దేశం చేర అరవాన్ని దక్కగా నేర్చుకొన్నాడు. తక్కిన దక్షిణభారత భాషలతో చాలినంత పరిచయం గలవాడు కాడని అతడి భాషాచరిత్రమే చెబుతుంది. అలాంటప్పుడు అతడి సిద్ధాంతా లెలా ప్రమాణా లవుతాయ్? అన్య దేశీయుడైన ఈ కాల్డ్వెల్లు తాను నేర్చుకున్న అరవం మీది పక్షపాతంతో దానివంకకే మొగ్గ చూపాడు. కనుక అతడి నిర్ణయాలకు తక్కిన దక్షిణప్రాంతాలవారు బద్ధులు కాలేరు. కాల్డ్వెల్లు తాను స్వయంగా నేర్చుకోకపోయినా తక్కిన ప్రాంతాలవారిని కొందరిని చేరదీసుకొని, వారినుండా తన భాషాచరిత్రకు కావలసిన సరకు సేకరించుకొని వుంటాడనటంలో సందేహంలేదు.

ఈసందర్భంలో మనం ఒక ముఖ్యవిషయం గమనించాలి. ఏజాతి అయినా సరే, అది పుట్టినప్పుడే పరస్పరాభిప్రాయ సూచక సంజ్ఞల మూలంగా ప్రజలు నిత్యవ్యవహారాలను జరిపేవారు. నాగరికత ముదిరినప్పుడట్టిసంజ్ఞలే వాగ్రూపానికి మారటం సహజం. దీన్నిబట్టి అనాదిగా వస్తూంటే తెలుగువారి శబ్దోచ్చారణలకు అనురూపమయిన వాక్కులు ఏర్పడ్డాయి. ఈయవస్థ ఒక్క తెలుగుజాతికే కాక, తక్కిన యేజాతికైనా తప్పనిసరి అయింది. అయితే దక్షిణభారత భాషలలో ఏది ముందో, ఏది వెనుకో తగిన ఆధారాలుంటేగాని స్థిరీకరించలేము. ప్రాంతీయ భాషా శబ్దాలు అన్యోన్యం ఒండొంటితో సమైక్యం కావటం భాషాభిజ్ఞుల కందరికీ తెలిసిందే. కనుక అరవపదాలే ఆదికాలంలో తెలుగులోకి వచ్చాయని కాని, తెలుగుపదాలే ద్రవిళంలోకి పోయాయని గాని అపోహపడటం వెర్రితనం.

ద్రవిడభాషా పండితులలో ఈ వెర్రితనం అత్యధికం. ద్రవిడ భాషా పండితుడు ఒకాయన అరవమే మొదటిదని, అందలి శబ్దాలే ఆంధ్ర కర్ణాటక కేరళ భాషలలో వ్యాపించి ఉండటంచేత, తమ అరవమే వాటికి భిక్ష పెట్టిందని వాదించేవాడు. అందుకు ఉదాహరణంగా తెలుగులోని 'చుట్టాలు' అనేపదం చూపి, 'సుట్రు+అళ్=సుట్రాళ్' అయిందని వాదించాడు. అయితే 'సింహాలు, గృహాలు, భోజనాలు ఈలాంటి వాటిగతిఏమి?' అని అడిగేటప్పటికి ఆయన గారి ఆట కట్టింది. ఆయన అభిప్రాయంలో 'చుట్టూ ఉన్న జనము=సుట్రాళ్' అని లక్షణాన్ని అనుసరించి యేర్పడ్డ శబ్దాన్ని ఆయన అరవంలోనించి తెలుగులు తెచ్చుకొన్నా రనటానికి తెలిపేది ఎంత అసంబద్ధమయినదో చూడండి.

ద్రావిడదేశంలో అరవభాషయందు—సెందమిళ్—వాదులకు అమితాభిమానం. వారికొక పిచ్చి ఆవేశం. వాళ్ళు తమ భాష అగస్త్యునిచే సంస్కృతి పొందింది కనుక ఆ మహర్షి కాలానికిముందే, డాదాపు ఐదువేలేండ్ల క్రితమే పుట్టిందనీ—కనుక తమ అరవ శబ్దాలే తక్కిన ద్రావిడ భాషల్లోకి ప్రవేశించాయని అంటారు. కాల్డ్వెల్లు అంత సాహసానికి దిగలేదేమో కాని, అరవానికి ప్రాధాన్యం మాత్రం ఇచ్చినాడు. ఆ కారణం చేతనే ద్రావిడభాషాభిజ్ఞులు ఆయనకు బ్రహ్మరథం పడతారు. కీ. శే. శేషమళ్ళ రాజగోపాలరావుగారు అరవల ఆగడాన్ని చూచి, తెలుగు విశ్వామిత్రుడికాలం నాటిదని (ఏవో కొన్ని ఆధారాలతో) అంటూ వచ్చేవారు.

మనలో గలిగిన ఒకలోపాన్ని యిట్టియెడ గుర్తించటం ముఖ్యం. మన కేవిషయమయినా విదేశీయులు ప్రశంసించినప్పుడే దృగ్గోచరమవుతుంది; ఒంటపడుతుంది. ఆ విషయాన్నే మన భారతీయుడు తెలిపితే ప్రమాణంగా స్వీకరించము. పైగా హేళనచేస్తాము. జాతి దౌర్బల్యానికి దోహద మిచ్చే యీ దుర్లక్షణం పోతే తప్ప మన వాఙ్మయానికి గాని, దేశానికి గాని, జాతికి గాని పుట్టగతు లుండవు.

మనకు కాల్డ్వెల్లువంటి శబ్దపరిశోధకు లయితే లేక పోయినారు. కాని బ్రౌనుదొరవంటి సాహిత్యవేత్తలు, కావ్యప్రియులు, రసజ్ఞులు పెక్కురు మనభాషా మాధుర్యాన్ని గ్రహించి ముగ్ధులైనా రన్నదిమాత్రం నిశ్చయం. ఆట్టి విదేశీయులు భాషాచరిత్రమీద, శబ్దలక్షణాల మీద అంతమోజు చూపినవారు కారు. మన తెలుగువాట ఎవరైనా ఆ పనికి పూనుకుంటే, వారికి ప్రోత్సాహం కలిగించేవారు లేరు. అసలు ఆంధ్రులు చరిత్రహీనులు. దుర్భర కష్టనష్టాల కోర్చి, నిరంతర పరిశ్రమతో శ్రీ వీరభద్రరావుగా రా కొరత కొంతవరకు తీర్చారు. దాన్ని గుర్తించలేక కృతఘ్నులయిన తెలుగువారికి భాషాచరిత్రను సమగ్రంగా సృష్టించుకునే శక్తి ఎలా కలుగుతుంది? అది నెరవేరినప్పుడే మనజాతి ధన్యమవుతుంది. మనకు మనస్థైర్యం లేకపోవటానికి తోడు స్వోపజ్ఞ కూడా తక్కువయింది. దానివల్ల పరాయివాళ్లు చూపించే దారిని పయనించే దురవస్థ మన కేర్పడింది. స్వయంగా కృషిచేసి తక్కిన ద్రావిడభాషలకు తలమానికంగా నిలిచేటట్లూ నాటి సారస్వతాలమోస్తరే తెలుగు కూడా స్వయంభువు అని చెప్పేంత దమ్ములు లేని గతి తెచ్చుకున్నాం. అది తొలిగితేనే తప్ప మన శబ్దాలకు సిసలయిన శబ్దనిష్పత్తులు కనిపెట్టి సమగ్ర వాఙ్మయచరిత్ర వెలువరించటానికి ముందంజ వేయలేము.

అరవలు తమ ప్రాచీనభాషాస్వరూపాన్ని నిలబెట్టుకోవటానికనీ, అన్యభాషా శబ్దాలకు తమ సారస్వతంలో ఏమాత్రం స్థానం యివ్వకూడదని పట్టుదలతో మడిగట్టుకొని కూచున్నారు. వారి రచనలకు చాలి

నంత పదజాలం స్వచ్ఛమయిన 'సెందమిళు'లో గలదని గర్విస్తున్నారు. 'నన్ను ముట్టుకోకు నామాలకాకి' అనే తత్వానికి అరవభాషాపండితులు బాగా జతపడి పోయినారు. మన తెలుగుపండితులలో ఇతరవాఙ్మయ శబ్దాలకు తమరచనలలో బాహాటంగా తావిస్తున్నారు. ఇది పాల్కురికి సోమనాథుని కాలంనుంచి అనువాయితిగా వస్తున్నది. సోమనాథుకు మెచ్చుకొన్నట్లు, తన వృషాధిపశతకంలో ఒక్కొక్క ప్రాంతీయ భాషకొక్కొక్క పద్యం వ్రాశాడు. మణిప్రవాళ మార్గాన్ని కూడా అతడు విడువలేదు. పదహారో శతాబ్దం వాడయిన ధూర్జటికవి కూడా "నుణ్ణాసయము, పొణ్ణాసయము, పెణ్ణాసయము లేనివారు" అని అరవ శబ్దాలను, "విజయాదు దేవర" అని—కన్నడపదాలను తన గ్రంథంలో ప్రయోగించాడు. అరవభాషాశబ్దస్వరూప సిద్ధికై కృషి చేస్తున్నారు ద్రావిడులు. తాము ఉపయోగించే పదాల రూపనిష్పత్తుల పరిశోధనలు విస్తారంగా చేస్తున్నారు. సెందమిళ్ లోని ఒక్క శబ్దమైనా పోగొట్టుకోవటానికి వారు ఇష్టపడరు. క్రొత్త పదాలకు తావు కించిత్తయినా ఇవ్వరు. మనమున్నానో, కవిత్రయం వారు ఉపయోగించిన పెక్కుపదాలు వాడుకకు తీసుకొని రాని కారణాన పోగొట్టుకున్నాము.

అరవలు తమ ప్రాచీన (సెందమిళ్) భాషను ఉజ్జీవింప చేయటానికి తమ శాయశక్తులా పనిచేస్తుంటే మన తెలుగువారు ప్రాఁదెలుగు పదాల్ని పోగొట్టుకొంటున్నాము. ఏ దేశం వారికయినా ప్రత్యేక జాతీయత అనేది వుంటే, అది వాళ్ళ నిత్యజీవితాలలో ఉపయోగించే శబ్దాలరూపంగా స్ఫురించాలి. అందువల్లనే వాళ్లకి అన్యభాషా సంపర్కం లేని తిరుక్కురళ్, తొల్కాప్పియం పరమ పూజనీయాలయినాయి. మనమున్నానో—మనజాతి మనుగడకు మూలాధారాలైన ప్రాచీనాచ్ఛికాలను త్రోసిరాజన్నాము. పోనీ వాటి స్థానంలో మరోటి సృష్టించామా అంటే—అదీ లేదు. చివరకు తెలుగు వాఙ్మయ ప్రపంచం దిక్కుతోచని త్రిశంకుస్వర్గంలో పడి దారీ తెన్నూ కానక ఉక్కిరిబిక్కిరి అయ్యేస్థితికి వచ్చింది. హైక్, మెయిక్ = (తోన్); పాంకిక్ (కొఅపక్); బోరనక్ (శీఘ్రముగక్); దోర (పాటే); ఒయ్యనక్ (తిన్నన); తిద్దయుక్ (మిక్కిలి)—ఇవి నన్నయ భట్టారకునివి. పెన్నడికోను (సెంబసేంచు); తమ్ముఁగుజ్జులు (తమ్ములయిన పసివారు); తిఱదు (తేలిక); వాంచి (వంచి); కుదురు (ఆధారము)—ఇవి ఎఱ్ఱాప్రెగ్గడవి. మూదల (తొందర); తెరయు (వ్యాపించు); చాడ్పు (వరెక్); కడవఁజెయు (తొలఁగించు)—ఇవి తిక్కన సోమయాజివి. ఈలాటి అచ్ఛిక ప్రయోగాలు కవిత్రయంలో ఎక్కడబడితే అక్కడ శతాధికంగా, సహస్రాధికంగా కనబడుతున్నాయి. నేటి లాక్షణిక రచయితలు ఎందరు తమ కావ్యాలలో అట్టివి వాడుతున్నారు? ప్రావాహిక మయిన సహజీవన పారస్పర్యములో క్రొత్తనైన దేశ్యాలు గాని అన్యదేశ్యాలు గాని, చేరకూడదని నా యభిప్రాయం కాదు. ప్రాచీన కవులు వాడిన పదాల స్వరూప నిష్పత్తులు కనిపెట్టి, వాటిని పోవడిక వాడుకోవటమే కాకుండా, క్రొత్త శబ్దాలు (వ్యావహారికాలైనాసరే) సంస్కరించి సలక్షణంగా ప్రయోగించటంవల్ల భాషకు పుష్టి నిచ్చినవారవుతారు. మన భాషలో శబ్దదారిద్ర్యాన్ని తొలగించడానికి కాదు, మన ప్రాచీనులు తత్సమశబ్దాలకు ప్రాశస్త్య మిచ్చింది! సంస్కృతం అన్ని భాషలకు తల్లి వంటిదని, దాని పోలిక తెలుగున కంటు కూడుతుందని, తద్వారా తెలుగురచన శ్రోత్రపేయంగా ఉంటుందని వారివిశ్వాసం.

అరవలు మాత్రం మాకుగీర్వాణ భాషాసంపర్కం లేదంటారు. కాని, అది పొసగదు. 'తిణ్ణీర్'—లో నీర మున్నది. మఱి అది సంస్కృతభవం కాక యేమవుతుంది? రామ, రంగనాథ శబ్దాలకు ముందు 'ఇ'—'అ' చేర్చి 'ఇరామన్' అనటంవల్ల, అరంగనాథన్ అనటం వల్ల—అరవ మయిపోతుందా?—ఇక అచ్చికాలలో, సెయ్, పాల్ ఉప్పు ఆంధ్ర ద్రావిడాలలో సమానమే. మన'కూర'—వారికి 'కీరై' అయింది. మన పసుపు వారికీ పసుపే. ఇలాగే 'నిప్పు' 'నెరుప్పు'—'గాలి' 'కాత్రు', 'బొమ్మ' 'బొమ్మై' ఇలా ఎన్నని వుటంకించ గలం. అయితే ఇలాటి శబ్దాలు ఒక దాన్లోనుంచి మరొక దాన్లోకి వచ్చినవి. కనక ఆ భాషే, ముందు, ఇది వెనుక—అని మాత్రం చెప్పటం సాహసమే అవుతుంది. ప్రాంతీయ భాషలలో పరస్పర సాన్నిహిత్యాన్ని సంపర్కాన్ని అనుసరించి, కించిద్భేదంతో శబ్దాలు ఒక వాఙ్మయాన్నుంచి మరొక వాఙ్మయానికి ప్రవేశించటం సహజం. ఈ సహజలక్షణమే సజీవభాషకు గల ప్రావాహిక స్వభావం.

ఇంతకూ శబ్దరూప నిష్పత్తుల పరిశోధనలో మనము అరవవారికంటె ఎంతో వెనుకబడి ఉన్నాము. ఇప్పటికైనా దక్షిణ భారతి భాషలు దక్కగా ఆకళించుకొన్న ఆంధ్రవాఙ్మయపరిశోధకులు బయలుదేరి తెలుగువారికి సమగ్రభాషా చరిత్ర లభ్య మయ్యేట్టు కృషిచేయగలరని విశ్వసిస్తున్నాను.

# గంగాపుత్రుడు

శ్రీ జి. రామకృష్ణ

చేపలు పట్టడంలో తండ్రికన్నా మొనగాడని మెచ్చుకుంటున్నారు జాలరులందరు రత్తాల్ని. తన పేరు, తన పేరే కాదు తర తరాలుగా వస్తున్న తమ వంశం పేరు నిలబెట్టిన కొడుకు పుట్టినందుకు రాఘవులు చెప్పరాని ఆనందం పొందుతున్నాడు. ఒక్కగా నొక్కడే గాబట్టి ప్రాణంగా చూసుకుంటున్నారు తల్లి తండ్రులు రత్తాల్ని. ఒంటరిగా ఎప్పుడూ పోని వ్వరు కొడుకుని. తను తెప్పమీద లేందే కొడుకుని చేపలకు పంపడు. తోటి జాలర్లు మేమంతా వున్నాం మాతో పంపు ఫరవాలేదు అన్నా ఒప్పుకోడు రాఘవులు. సాటిలేని జాలరి అనిపించుకున్నా తండ్రి చాటు వాడుగా పెరుగుతున్నాడు రత్తాలు. ఒకవేళ తండ్రి మెత్తబడ్డా తల్లి కోటమ్మ లబోదిబో మంటుంది తండ్రి లేకుండా కొడుకు బయలుదేరితే. బందరు కోటలో రాఘవులంటే గజ యీతగాడని పేరు. ఉక్కులాంటి మనిషి. అలాంటి రాఘవులు వలఘమోల్యపడిలో పడ్డ తర్వాత అడపా తడపా ఖాయిలా పడుతున్నాడు. ఇదివరకు మాదిరి సముద్రంలోకి పోలేక పోతున్నాడు. ఒకమారు చేపలకి వెళ్తే రెండు మూడు రోజులు బాధ పడుతున్నాడు జ్వరంతో, దగ్గుతో. ఈ వాగాల మూలంగా రాబడి తగ్గింది.

రత్తాలు తండ్రి పరిస్థితి చూసి తండ్రిని పూర్తిగా విశ్రాంతి తీసుకోమన్నాడు. ఇరవై యేళ్ళవాడయ్యాడు గాబట్టి రత్తాలు ఇంటి కష్టసుఖాలు బాగా గ్రహించాడు. రాఘవులికి దుఃఖం పొర్లుకొచ్చింది. తన వంట్లో ప్రాణంవుండగా కొడుకు తనులేకుండా పడవెక్కటం సహించలేకన్నాడు తండ్రి. ఎన్నో విధాల తండ్రికి చెప్పాడు. తల్లికి కూడా చెప్పాడు. మొదట్లో యిద్దరూ అంగీకరించలేదు. కుటుంబ పరిస్థితులు నానాటికి అధ్వాన్న మవుతున్నాయి. రత్తాలు తండ్రికి తిరిగి చెప్పాడు. తాను చేపలకి వెళ్తానని. చివరికి తన తోటి జాలర్ల్ని పిలిచి కొడుకును అప్పగించాడు రాఘవులు కళ్లనీళ్లతో. అంతా ధైర్యం చెప్పారు. సింహంలాంటి కొడుకును సముద్రంలోకి పంపడానికి భయపడొద్దన్నారు.

రత్తాలు సముద్రంలోకి పడవమీద వెళ్లటం ప్రారంభించాడు. దిట్టమైన జాలరి. చేపలకేం కొదవ! కుప్పలుగా పట్టుకొస్తున్నాడు. సాయంత్రం అయ్యేటప్పటికి తల్లి రత్తమ్మ గటువ కొడుకోసం కనురెప్ప వాల్చకుండా నిరీక్షించేది. గంపెడు చేపలు తెచ్చేవాడు రత్తాలు.

బజారు పట్టుకెళ్ళి అమ్ముకొచ్చేది కోటమ్మ. కుటుంబం ఖర్చులకు రాబడి సరిపోయేది.

రాఘవులికి దగ్గు తగ్గలేదు. పైగా ముదిరింది. ఒకనాడు తండ్రిని బందరు పెద్దాసుపత్రికి తీసుకెళ్లాడు రత్తాలు. పరీక్ష చెయ్యాలన్నారు డాక్టర్లు. ఎక్సురే ఫోటో తీశారు. పెద్దడాక్టరు నిట్టూర్చారు. క్షయ అంకురించింది. మదనపల్లిగాని మద్రాసుగాని తీసుకు వెళ్లమని సలహాయిచ్చారు.

రాఘవులికి యిదివరకే అనుమానంవుండి, లోలోపల బాధ పడుతున్నాడే గాని ఎవ్వరికీ చెప్పలేదు. పెద్ద డాక్టరు ఒక్కసారి కుండ బద్దలుకొట్టినట్టు చెప్పడంతో రత్తాలుకి, తల్లికి కడుపు చెరువులయిపోయాయి.

తిరిగి యిల్లుచేరుకున్నారు, బరువు గుండెలతో. తండ్రిని రక్షించుకోవటం తనధర్మం అని తెలుసుకున్నాడు రత్తాలు. కానీ అంతా డబ్బుతో పని. రాఘవులు కూడా ఆ విషయంగురించే బాధపడుతున్నాడు. చికిత్స ఖర్చులు లేకపోయినా అక్కడికి పోవటానికి, రైలు ఖర్చులకు, పైఖర్చుకు సొమ్ముకావాలి.

రాఘవులుదగ్గర నిల్వసొమ్ము ఏమీలేదు. రత్తాలు సంపాదన ఏరోజు కారోజు తిండికిసరిపోతోంది.

రత్తాలు పైకం గురించి తీవ్రంగా ఆలోచించాడు. ఒక ఆలోచన తట్టింది. స్వంతపడవ కళ్ళలో మెదిలింది.

దాన్ని అమ్మితే తండ్రిప్రాణం కాపాడవచ్చని రత్తాలుకు ధైర్యం కల్గింది.

మాటలు తడబడుతూ తన అభిప్రాయం తండ్రికి చెప్పాడు. రాఘవులు గతుక్కుమన్నాడు. కొలకుల్లో నీళ్ళు నిల్చాయి. 'ప్రాణంకన్నా ఎక్కువయిందిరా పడవ మనికి, దాన్ని తెగనమ్మితే బతుకు దారేదిరా?' అన్నాడు రుద్ధకంఠంతో. అంతకుతప్ప వేరేమార్గం లేదని రాఘవులికి తెలియకపోలేదు.

'అవును అయ్యా! నీ ప్రాణం సరిగ్గావుంటే యిలాంటిపడవలు మరో రెండు సంపాదించొచ్చు... నేనువెళ్ళి మరిడయ్య బాబాయితో చెప్పి రెండుమూడు రోజుల్లో వాకబు చేయమంటాను' అన్నాడు.

రాఘవులు కళ్ళల్లోంచి నీళ్ళురాలాయి. 'సరే చెప్పు' అన్నాడు బొంగురుగొంతుకతో.

రత్తాలు వెళ్ళి మరిడయ్యతో చెప్పి వచ్చాడు.

మర్నాటికే బేరంవచ్చింది. మూడొందల రూపాయలకి ఖాయం అయింది. రాఘవులు తన పడవ అమ్మేశాడు. పైకం చేతికొచ్చింది. రాఘవులు ఆరోగ్యం నానాటికి దిగజారుతుండటంవల్ల రత్తాలు, తల్లి ఖంగారు పడుతున్నారు.

కోటమ్మ అన్న గంగన్న మద్రాసులో వుంటున్నాడు. కష్టంలో ఆదుకుంటాడని కోటమ్మ నమ్మకం. అందుకని మద్రాసే వెళ్ళేందుకు నిర్ణయించుకున్నారు.

మర్నాడే బయలుదేరారు. బెజవాడవచ్చి ప్యాసింజరులో మద్రాసు చేరుకున్నారు.

ముందుగానే వుత్తరం వ్రాయటంవల్ల గంగన్న సెంట్రలుస్టేషనుకు వచ్చాడు. బావ అనారోగ్యస్థితి చూసి వాపోయాడు. మేనల్లుణ్ణి చూసి, 'ఓరీ, రత్తాలు! ఎంత వాడివయ్యావురా' అని పలకరించాడు.

"ఏం చెల్లమ్మా! బావకు సుస్తీ అని మాటవరసకన్నా ఎప్పుడూ రాయిందలేదేమే?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"మాకు మటుకేం తెలుసన్నా! పెద్దదొర చెప్పాక తెలిసింది. వెంటనే బయలుదేరాం. నీమీదే ఆశ పెట్టుకువచ్చాను." అని కళ్ళతడిపెట్టుకుంది కోటమ్మ.

గంగన్నపాక ట్రిప్లికేనులో సముద్రానికి దగ్గర్లో వుంది. ఇల్లు చేరుకున్నారు. గంగన్న భార్య సత్తెమ్మ చుట్టాలందర్నీ పలకరించింది. గంగన్న కూతురు భూషమ్మ బావను చూసి సిగ్గుపడింది. కాని క్రీగంటితో చూసి బావను మెచ్చుకుంది లోలోపల. కోటమ్మ మేనకోడల్ని దగ్గరకు తీసుకుని ఆప్యాయంగా పలకరించింది.

ఆ మరుసటిరోజే రాఘవుల్ని తాంబరం క్షయాసుపత్రిలో జేర్చారు. ఆస్పత్రిలో దగ్గర యింకెవ్వరూ వుండవసరంలేదు. అన్ని ఏర్పాట్లు ఆస్పత్రిలోనే సమకూరుస్తారు. అందువల్ల కోటమ్మ రత్తాలు ఇంటిదగ్గరే వున్నారు. రత్తాలో, గంగన్నో ఎవరో ఒకరు ప్రతిరోజూ వెళ్ళి రాఘవుల్ని చూసి వస్తున్నారు.

గంగన్నకి ఒక్కగానొక్క చెల్లెలు కోటమ్మ. చెల్లలంటే ప్రాణం. అందులోనూ ఆపదలో వచ్చిందని మరింత ప్రాణంగా చూస్తున్నాడు.

బావను చూసి మొదట భూషమ్మ సిగ్గుపడింది. బావను క్రిందటిమారు మూడేళ్ళ క్రిందట వచ్చినప్పుడు చూసింది. అప్పుడు తనకి పన్నెండేళ్ళు. ఇద్దరూకలసి మెలిసి తిరిగేవారు రకరకాల కబుర్లూ, కథలూ చెప్పుకునేవారు. సాయంత్రంపూట సముద్ర పొడ్డుకెళ్ళి తండ్రికోసం ఎదురుచూస్తూ వుండేవారు. గంగన్న వచ్చేవరకు కెరటాలతో ఆడుకునేవారు. అప్పుడు అత్తా, బావ పదిహేనురోజులుండి తిరిగి వెళ్ళిపోయారు. అవన్నీ గుర్తుకొచ్చాయి యిద్దరికీ వారిసిగ్గు క్రమంగా మాయమైపోయింది.

రత్తాలు తన యింట్లోనే వుండటం భూషమ్మకు మహానందంగా వుంది. ఆమెలో క్రొత్తవెలుగు పొడ చూపింది. ఇదివరకు మనోపథంలో చూసుకుంటున్న బావ ఎదురుగా వుండటం ఆ అనుభూతికి కారణం. భూషమ్మ బంగారు బొమ్మగా కనిపించింది రత్తాలుకి. ఎన్ని ముచ్చట్లు చెప్పినా యింకా చెప్పబుద్ధి అయ్యేది రత్తాలుకి. ఆమె తేనెపలుకులు ఎంత విన్నా తనివి తీరేది కాదు.

కాని రత్తాలుకి తండ్రి వ్యాధిగురించి బెంగగా వుంది. దానికితోడు తాను పూరికే వుంటున్నాడు. చేతిలో పైకం హరించిపోతోంది. తానుకూడా చేపలు పట్టడానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. తన అభిప్రాయం తల్లికి చెప్పాడు. పరిస్థితుల బట్టి తల్లి సమ్మతించింది.

ఆ సంగతి గంగన్నకు చెప్పాడు. 'అదేమిట్రా! రత్తాల్నా నీకెవరు చెప్పార్రా చుట్టంగా వచ్చిన వాడివి పనిచేయటం ఎందుకురా? అన్నాడు.

'అదికాదు మామా. ఏదో చుట్టం చూపుగా రాలేదుగా. ఎంతకాలం వుండాలో తెలియదాయె. నువ్వుమాత్రం ఎక్కడనుంచి తెస్తావు అందరికీ, నాకు బాగా అలవాటే మామా. బందర్లో సముద్రంలోకి వెళ్తునేవున్నా. మీ కట్టమరం వాకోలకొక్క జమా. రేపట్నుంచే నే కూడా వస్తా మామా.' అన్నాడు రత్తాలు.

గంగన్న కాదనలేక పోయాడు.

ఆ మర్నాటినుంచీ రత్తాలు చేపలు పట్టడానికి వెళ్తున్నాడు. గంగన్న మేనల్లుడి నేర్పుచూసి ఆశ్చర్యపోయాడు. గంగన్నకాదు తోటిజెస్తలు కూడా రత్తాల్ని పొగిడారు. పెద్దపెద్ద చేపల్ని సునాయాసంగా పట్టేవాడు.

రోజూ సముద్రంలోకి వెళ్ళేముందు గంగమ్మతల్లికి పూజచేసి భూషమ్మ, తండ్రికి బావకు మొఖాన కుంకుమ పెట్టేది. వాళ్ళని కాపాడమని గంగమ్మతల్లికి వేయి దండాలు పెట్టేది. ప్రొద్దు క్రుంకగానే ఒడ్డునుండి ఎదురుచూసేది. అల్లంత దూరంలో తండ్రి బావవున్న కటమరం చూసి చిరునవ్వుతో ఆహ్వానించేది. హృదయంలో పొంగే ఆనంద తరంగాలు కళ్ళలో ప్రతిబింబించేవి. తను తెచ్చిన చేపలు భూషమ్మకు అందించేవాడు రత్తాలు.

ఒక్కొక్కప్పుడు గంగన్న తాంబరం ఆసుపత్రికి వెళ్తుంటే వాడు బావమరిదిని చూట్టానికి. అప్పుడు రత్తాలు ఇతర జెస్తలతో సముద్రానికి వెళ్ళేవాడు. రాఘవులు ఆరోగ్యం మునుపటికన్నా నయంగా వుంది. క్షయ యింకా ప్రారంభావస్థలోనే వుండటం వల్ల తిరిగి పూర్తిగా స్వస్థత చేకూరుతుందని డాక్టరు ధైర్యం చెప్పాడు. అదివిని కోటమ్మ మంగళసూత్రం కళ్ళకద్దుకుని పరమాత్ముడికి కోటి నమస్కారాలు అర్పించింది.

ఒకరోజున గంగన్న బావమరిదిని చూడటానికి వెళ్లాడు. ఉదయంనుంచే కొంచెం మబ్బు మబ్బుగా వుంది.

జెస్తలందరితో పాటు రత్తాలు కూడా చేపలు పట్టడానికి బయలు దేరాడు. ఎందుకో భూషమ్మ మనస్సు ఆవాళ కలత పడింది. 'మబ్బుగా వుంది బావా ఇవ్వాళ మాని రేపు వెళ్ళకూడదా? అంది గోముగా.

రత్తాలు నవ్వాడు. భూషమ్మ ముఖంలోకి ప్రేమగా చూస్తూ, 'నాకేం భయం భూషీ! ఈ మబ్బులు వుంటాయా? కొంచెం గాలివిస్తే పోతాయి. దీనికే జడిసి మానుకుంటామా' అన్నాడు ప్రయాణమౌతూ.

కటమరంమీద రత్తాలు సముద్రంలోకి వెళ్లాడు తోటి జెస్తలతో. రెండు గంటల తర్వాత మబ్బులు బాగా క్రమ్మాయి. గాలి కూడా జోరయింది. మబ్బులు తేలిపోయే జాడలు కన్పించలేదు. రత్తాలు, జెస్తలు సముద్రంలో బాగా పైకి వెళ్లారు. ఆకాశంవైపు తలెత్తి చూశారు. భయంకరంగా వుంది. గాలి హోరుపెడుతూ వీస్తోంది. గంగమ్మ తల్లి పరవళ్ళు త్రొక్కుతోంది. అలలు పందాలు వేసుకున్నట్టు ఉవ్వెత్తుగా ఎగురుతున్నాయి. కటమరం ఒడ్డుకు పడదామని రత్తాలు, తోటి జెస్తలు ప్రయత్నించారు. సాధ్యపడలేదు.

తుపాను పోకళ్ళు కన్పించాయి. కట్టమరంమీద వుండటానికి సాధ్యం కావటం లేదు. తెడ్డు వేయడానికి వీలుకాకుండా అలలు ముంచెత్తుతున్నాయి. గాలి ఎడాపెడా కొడుతోంది. దారీ తెన్నూ తోచటంలేదు. బలంకొద్దీ కట్టమరాన్ని గట్టిగా అంటిపెట్టుకుని వున్నారు. ఒక గంట అలా వుండగల్గారు. తుఫాను ముదిరింది. కుంభవర్షం కురుస్తోంది. రౌద్రరూపం దాల్చిన అలలలో మునకలు వేస్తున్నారు. చేతులు పటు తప్పాయి. కట్టమరంమీదనుంచి జారిపోయారు. ఎవరెక్కడున్నారో తెలియలేదు. ఎటు కొట్టుకు పోతున్నదీ తెలియకుండా వుంది. మృత్యువుతో పోట్లాడుతున్నారు ఎవరిమటుకు వారు ఆ సముద్రం మధ్య.

గట్టున కోటమ్మ, గంగన్న భార్య, కూతురూ వచ్చి నిలబడ్డారు. రెప్పలు వాల్చకుండా చూశారు. రత్తాలు తిరిగి రాలేదు. తతిమ్మా జెస్తలుకూడా రాలేదు. చీకటి పడింది. తుఫాను అంతకంతకు హెచ్చింది. కోటమ్మ గుండెలు బాదుకుని ఏడ్చింది, కొడుకు కోసం. గంగన్న కూడా ఏడ్చాడు. చిన్న పిల్లవాడి మాదిరి. ఏం చేయ

డానికి పాలుపోలేదు. పత్తెమ్మ ఆడబిడ్డను ఓదార్చింది. భూషమ్మ లోలోపల కుమిలి పోయింది, బావకోసం. ఆ పెనుగాలిలో అతికష్టంమీద ఇల్లు చేరుకున్నారు. అప్పటికి పాకకి కప్పు సగం ఎగిరిపోయింది. ఆ రాత్రి పాకలో వుండటం ప్రమాదం అని తెలుసుకున్నాడు. ప్రక్కన పాకలు అప్పటికే చాలా కూలేయి. లోపలి నుంచి పనికి వచ్చే సామాను తీసుకుని కొంచెం దూరంలోవున్న ఒక పెద్ద బంగాళా వసారాలోకి చేరారు. బిక్కు బిక్కుమంటూ ఆ రాత్రి గడిపారు. రాత్రంతా తుఫాను జోరు తగ్గలేదు. వారి ప్రాణాలన్నీ రత్తాలుమీదే వున్నాయి. ఆ నాటి మధ్యాహ్నానికి గాలి విసురు తగ్గింది. వాన కొంచెం తెరిపిచ్చింది. సాయంకాలానికి ప్రశాంతత పడింది.

తిరిగి సముద్రపొడ్డుకు వెళ్ళి చూశారు. కట్టమురాల జాడే లేదు. చూసి చూసి వెళ్ళిపోయారు. ఆ రాత్రి ఆ వసారాలోనే గడిపారు. గంగన్న, అధికార్లకి, రత్తాలు తుపానులో చిక్కుకున్న వైనం తెలిపి సహాయం అర్థించాడు.

మర్నాడు పుదయమే గంగన్న తన పాక దగ్గరకు వెళ్లాడు. ఆ ప్రదేశమంతా పెద్ద చెరువై పోయింది. తన పాక తాలూకు కర్రలు, ఆకులు తీసుకుని దూరంగా యింకో ఎత్తు బాగాలో పాక కట్టడానికి ఏర్పాటు చేశాడు. మరో ముగ్గురి సాయంతో పాక తయారయింది సాయంకాలానికి. కుటుంబాన్ని అక్కడకు చేర్చాడు.

కోటమ్మ, భూషమ్మ సముద్రపొడ్డుకు వచ్చారు. పోయిన కట్టమరాల అజా పజా తెలియలేదు. మొత్తం పదమూడుమంది కప్పించటం లేదు. బంధు జనం యావత్తు లబో దిబోమని గోల పెడుతున్నారు.

కోటమ్మ గగ్గోలు పెట్టి ఏడుస్తోంది. భూషమ్మ లోలోపల కుమిలిపోతోంది. కోటమ్మ యింటికి వెళ్ళింది. భూషమ్మ ఒడ్డునుంచి కదల్లేదు. బావ తిరిగి వస్తాడని ఎదురు చూస్తోంది. సముద్రంలోకి బెస్తలు తిరిగి కట్టమరాలలోవెళ్ళి చేపలు పట్టకొస్తున్నారు. చేపలు పట్టంకే వాళ్ళకి తిండి దొరకదు.

ఏ కట్టమరం ఒడ్డుకు వచ్చినా తన బావే వస్తున్నాడని అనుకొని దగ్గరగావెళ్ళి చూసేది. రత్తాలు లేక పోవటం గమనించి కళ్లనీళ్లు పెట్టుకునేది. ఆస్పత్రి నుంచి గంగన్న తిరిగివచ్చాడు. మర్నాడే రాఘవుల్ని పంపించి వేస్తామన్నారని కోటమ్మతో చెప్పాడు. రాఘవులికి పూర్తి ఆరోగ్యం చేకూరింది. రోగ చిహ్నాలు పోయాయి. అది సంతోషవార్త అయినా రత్తాలు గురించిన వేదన యీ సంతోషాన్ని అనుభవించనీయలేదు.

గంగన్న వెళ్ళి, భూషమ్మను ఒడ్డునుంచి ఓదార్చి యింటికి తీసుకువచ్చాడు.

మర్నాడు పదిగంటలకు రాఘవులు ఆస్పత్రి వదిలివచ్చాడు. కొడుకుని తలచుకుని భార్యాభర్తలు వెక్కి వెక్కి ఏడ్చారు.

ముందు చేయవలసినపని ఎవరికీ తోచలేదు. భూషమ్మ మరీ బాధపడుతోంది. ఆ సాయంకాలం ఒడ్డుకువెళ్ళి కూర్చుంది. పరిపరి విధాల ఆలోచిస్తోంది భూషమ్మ. తనుకూడా బావతోపాటే సముద్రంలోకి పోదామా అని కూడ తలపోస్తోంది. కాని తిరిగి బావ వస్తాడేమోనని ఆశతో వెనకడుగు వేస్తోంది. వేరే తలపే లేదు. అలలవంకా, కట్టమరాలవంకా చూస్తోంది. ఆమె ఆలోచనలు తీవ్రరూపం దాలుస్తున్నాయి. ప్రొద్దు క్రుంకుతోంది. ఆమె ఆశలు సన్నగిల్లాయి. ఆవేశం పెరిగింది. లేచింది. అతివేగంగా నీళ్ళల్లోకి దిగింది. వాహ్యాళికొచ్చిన జనానికిది అర్థం కాలేదు. అలలతో ఆట అనుకున్నారు. భూషమ్మ మరీ లోతుకి వెళ్తోంది. జనం ఆమె అఘాయిత్యం చేయబోతోందని గ్రహించారు. భూషమ్మ యింకా లోపలికి పోతోంది. అలలపైన తేలుతోంది. జనం గొల్లుమని అరిచారు. ఎవరూ ధైర్యంచేసి దూకటంలేదు. ఆమెను రక్షించడానికి. కేకలు ఎక్కువయ్యాయి. గుంపు చేరారు. బొబ్బలు పెడుతున్నారు.

ఇంతలో ఒక యువకుడు బాణం మాదిరి గుంపును చీల్చుకుని సముద్రంలోకి దూకాడు. పెద్ద చేపమాదిరి యీది భూషమ్మను పట్టుకున్నాడు. భుజం మీద వేసుకుని ఒడ్డు చేరాడు. జనం యావత్తూ యువకుణ్ణి పొగిడారు.

యువకుడు భూషమ్మవంక ఆవేదనతో చూస్తున్నాడు. భూషమ్మ కళ్ళు తెరిచింది. ఆశ్చర్యపోయింది. 'ఆ! బావా!, నువ్వా ఎలా వచ్చావ్?' అంది.

'అ, నేనే రత్తాలు బావనే. ఎంత పనిచేశావ్ భూషీ?' అన్నాడు.

భూషమ్మ బావను చూసి మహానందం పొందింది. లేచి నుంచుంది. ఇద్దరూ ఇంటి ముఖంపట్టారు. జనం ఆశ్చర్యపోయారు.

'భూషీ! ఇలా ఎందుకు చేశావ్?' అని అడిగాడు రత్తాలు.

'నీకోసమే బావా. ఎంతకీ రాకపోతే నేనే బయలుదేరా. అయితే నీవెలా వచ్చావ్?' అని అడిగింది కుతూహలంతో.

'తుపానుకు మేం కొట్టుకుపోయాం. కట్టుమరం ఎక్కడోపోయింది. తలోదారిన పడి సముద్రంమీద తేలుకుంటూ ఎక్కడెక్కడికో పోయాం. నేను మరో ముగ్గురం ఇక్కడికి ఎనిమిది మైళ్ళ దూరంలో ఒడ్డుకు చేరాం. ఒడ్డున మమ్మల్ని ఎవరో తీసి ఆస్పత్రిలో చేర్చారు. నిన్న ఉదయానికి బాగా తెలివొచ్చింది. ఆస్పత్రిలో ఉన్నాం. యివ్వాళ ఉదయం వరకు. తర్వాత లారీలో మమ్మల్ని యిక్కడకు చేర్చారు. మన పాతపాక లేదుగా! వెతికి వెతికి కొత్త పాక తెలుసుకున్నా రాంగానే నన్ను అంతా కావలించుకుని ఏడ్చారు. తర్వాత నీకోసం చూశాను. అన్ని ప్రక్కలా. నువ్వు రాలేదు. అమ్మని అడిగాను ఒడ్డున వున్నావని అమ్మ చెప్పింది. వచ్చాను ఒడ్డుకి. వెతుకుతున్నా నీకోసం. ఇంతలో గోల వినిపించింది. ఎవరో సముద్రంలో పడ్డారంటే రక్షించేందుకు దూకాను. నిన్నే రక్షించుకున్నాను, భూషీ!' అని ముగించాడు.

ఇంతలో పాక వచ్చింది.

భూషమ్మ వృత్తాంతం విని అంతా మరీ ఆశ్చర్యపోయారు.

ఆరాత్రి పెద్ద పండుగ చేసుకున్నారు. మాటల సందర్భంలో రత్తాల్ని భూషమ్మ కిచ్చేందుకు నిశ్చయించుకున్నారు. త్వరలో ఆ మూడు ముళ్ళు వేయించాలనుకున్నారు. మర్నాడు రాఘవులు, కోటమ్మ రత్తాలు తిరిగి బందరు కోటకు ప్రయాణమయ్యారు.

# స్వప్నములు: జ్యోతిశ్శాస్త్రము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ప్రపంచమున మనము అనుభవించు సుఖదుఃఖాది రూపములగు పరిణామము లన్నియు జన్మకాలిక గ్రహభావాది యోగములచే సూచింపబడుచున్న వనుట జ్యోతిశ్శాస్త్ర నిర్వచనముకదా? జాతక ఫలములు దశాక్రమము ననుసరించి పక్వమై, చారగ్రహముల వలన ఉత్తేజనములు పొంది, ఆయావ్యక్తుల పురుష కారమున కనుగుణముగా, అధికార తారతమ్యముతో, వారికి అనుభవమునకు రాగలవని పాఠకమహాశయు లెరుగుదురు. కాని, అట్టి యోగములు దుర్బలము లయ్యెనేని, వాస్తవప్రపంచమున తమ ఫలము చూపుశక్తి లేకుండు కారణమున, స్వప్నప్రపంచమున తమ ప్రభావమును చూపించు నని ప్రాచీనులు చెప్పిరి.

"పరిణమతి ఫలోక్తిః స్వప్నచింతాస్వపీత్యైః"

గ్రహములు వాస్తవగోళములు; వాని తేజఃకిరణ ప్రసారము వాస్తవము; దాని తాకిడివలన ఫలము ననుభవించు మన ఉనికి వాస్తవము. అట్టిచో, గ్రహములు సూచించు సుఖదుఃఖాదులు వాస్తవ ప్రపంచమున చూపట్టక అసత్యమయిన స్వప్నప్రపంచమున పొడగట్టనేల? అనుశంక కలుగుట సమంజసమే. కాని, జాగ్రదవస్థలో నున్న ప్రాణికి వాస్తవ ప్రపంచమందలి అనుభవము లెంత సత్యములో, సుషుప్త్యవస్థలో నున్న ప్రాణికి స్వప్నప్రపంచమందలి అనుభవములు నైతము అంత సత్యములే! ఆలోచించి చూడుడు. అంతియేల? అద్వైతమత రహస్యసారమును అనుభవమునకు తెచ్చుకొనగలిగిన యోగిశ్రేష్ఠుల దృష్టిలో మన ఈ వాస్తవ ప్రపంచము, దానియందలి పదార్థములు, వ్యక్తులు, అనుభవములు, అన్నియు మిథ్యయేకదా?

అది యట్లుండె. గ్రహయోగములు దుర్బలములుగా నున్నప్పుడు వాని తేజస్సును స్వీకరించి స్పందించుటకు కావలసిన సూక్ష్మపదార్థ గ్రహణశక్తి స్థూలములగు మన ఇంద్రియములకు లేని కారణమున, బాహ్యప్రపంచమున ఆ యోగముల కార్యము వ్యక్తమగుట కవకాశము లభించదు. కాని, అత్యంత సూక్ష్మమై అపారశక్తి మంతమయిన మానసేంద్రియము మాత్రము ఆగ్రహ తేజస్సును గ్రహించి 'స్పందింద' గల్గుటచే, ఇంద్రియ కార్యముల గొడవ లేనట్టి స్వప్న ప్రపంచములో మాత్రము ఫలానుభవమును మనకు సంపాదించి ఈయగలదు. స్వప్నములకు జ్యోతిశ్శాస్త్ర సూత్రముల తోగల సంబంధముల గురించిన మన ప్రకృత చర్చకు ఇంత ఉపపత్తి చాలు. ఇంతకంటె విశిష్టమగు కార్యకారణ సమన్వయము చేయు బాధ్యత మన తత్త్వశాస్త్రవేత్తల (Psychologists) సూక్ష్మ విమర్శనమునకు వదలుకొందము గాక.

వరాహమిహిరాచార్యుని ఉపలక్షణ సూత్ర మిది పరికింపుడు :—

"ఏకదకలాంశగతో,
యథోక్తఫలద శ్శుభో గ్రహవశేన;
అన్యర్క్షగత, స్స్వప్నే,
మనసావా, భావనంకురుతే."

ఉక్తస్థానములలో యోగప్రద గ్రహము భాగకలలతో నికరముగా నుండక, అస్థానములకు ముందో, వెనుకనో, కొంత దూరముగా నుండెనేని, ఆ యోగ ఫలము సుషుప్త్యవస్థలో స్వప్నమునందో, జాగ్రదవస్థలో భావనయందో, చూపట్టగల దని ఈ శాస్త్రవేత్త సిద్ధాంతము. మహత్తర ఫలమునో, ప్రభావమునో, ఆశించి, ప్రాపంచికముగా కార్యరూపమున దానిని సాధించుటకు చాలిన నైతిక, ఆధ్యాత్మిక, అధికార సామర్థ్యములు లేక, ఊరక మనసులో మండిగలు చేసుకొనుచు, ఆ ఫలము ననుభవించుచున్నట్లు భావించి గాలి ఊయెలలో ఆనంద మనుభవించు మహానుభావులు కొందరు మనకీ ప్రపంచమున అందందు కానవత్తురు కదా? వీరు దుర్బలములయిన గ్రహ యోగఫలములను జాగ్రదవస్థలో భావనా ప్రపంచమున అనుభవించుచున్నవారు కాబోలు? కాని, ఈ భావనానుభవము కంటె స్వప్నానుభవము నిరుపద్రవ మనుకొందును మహాత్ముల నైతిమని భావించుకొని తృప్తిపడుట

చాలక, ఇతరులను నమ్మించుటకు ప్రయత్నించిరేని, వారినుండి కొన్ని సందర్భములలోనైనా, లోకులు మోసపోవు సంభవమున్నది. కనుక, అట్టి భావనా యోగ సిద్ధులనుండి సంఘమునకు నష్టమే. స్వప్నములలో ఫలము ననుభవించు ఆత్మారాములనుండి ఇట్టి తొందర యుండదుకదా ?

పోనిత్తము. సాధారణముగా మనము అనుభవించు ప్రాపంచిక సుఖదుఃఖాదులకు ఇతర వ్యక్తులతో మనము సంపాదించుకున్న సంబంధ బాంధవ్యములే కారణము కదా! అట్టి సంబంధాదులయొక్క స్వభావము, వాని పరిణామము సహా, మనయొక్కయు, వారియొక్కయు జన్మకాలిక గ్రహాదుల అన్యోన్య సంబంధముచే ప్రేరితమై, ఆయా కాలములయందలి దశాస్వభావము ననుసరించి యుండును ననుట పాఠకమహాశయులకు క్రొత్తవిషయముకాదు. మరి, స్వప్నములలో మనకు కలుగు సుఖదుఃఖరూపములైన అనుభవముల విషయములో నైతము అధర్మమే వర్తించగలదని పైసూత్రములు చెప్పుచున్నవి. అనగా, స్వప్నరంగములో ఏ వ్యక్తులతో వ్యవహరించుటవలన మనకు అట్టి అనుభవములు కలుగునో, వానిని సూచించగల జాతకగ్రహాది సంబంధములు మనకా వ్యక్తులతో సిద్ధముగ నుండవలయుననియు, స్వప్నదినమున ఆ సంబంధములకు ఉత్తేజనము నిచ్చునట్టి చారగ్రహయోగాది సౌకర్యములు ఏర్పడవలెననియు, ఆ యోగముల ఫలితము వాస్తవ ప్రపంచములో చెల్లివచ్చుటకు చాలినంత శక్తి లేమిచే స్వప్నరూపముగా పరిణమించుచున్నవనియు, తేలుచున్నది.

సామాన్య జీవితానుభవముల విషయములో చాలక స్వప్నములలో నైతము జ్యోతిశ్శాస్త్ర సూత్రముల కైలాటము చూపట్టుచున్నదా? అని హేళనము చేయగోరు విమర్శకు లుందురేమో? గ్రహప్రపంచము, మానవ ప్రపంచము, స్వప్నప్రపంచము, ఇవిఅన్నియు ఆసర్వేశ్వరుని సృష్టిలోని చిత్రములే. వీనికిగల అన్యోన్య సంబంధము సాధ్యమైనంతవరకు కనుగొనుటకే పరిశోధకులగు శాస్త్రజ్ఞులు సర్వకాలములలో కృషి చేయుట. వారు కనుగొని వెల్లడించిన విషయములకు సంతసించి, తెలియనివానిని గురించి పరిశోధన సలుపుట మాత్రమే మన కర్తవ్యము. అంతేకాని, తెలియని దంతయు అసంభవ మని సిద్ధాంతీకరించు పండితంమన్యులకు సమాధానము చెప్పుటకై ప్రయత్నించుట వ్యర్థ పరిశ్రమ.

ప్రకృతి ననుసరింతము. అనేక సందర్భములలో స్వప్నములలో కలుగు అనుభవ విశేషములు మెలకువ వచ్చిన ఉత్తరక్షణమే తెరమరుగై స్మృతిపథమును దాటి పోవుచున్నవి. అట్టి స్వప్నములు మన చర్చకు పనికిరావు. కాని, కొన్ని స్వప్నములలోని రంగములు మాత్రము అట్లుగాక జాగ్రదవస్థలో సయితము చాలా కాలము కన్నులకు కట్టినట్లు జ్ఞప్తిలో నుండగల వనుట చదువరుల అనుభవమునకు వచ్చి యుండకపోదు. అట్టి రంగములలో మనకు పరిచితులైన వ్యక్తులు ప్రధాన పాత్ర వహించిన సందర్భములలో మాత్రమే, ఆ వ్యక్తుల జాతక సామగ్రి యున్నచో, మన పై సూత్రముల ఫలమును సంశోధించగలము. ఈ లక్ష్యముతో విమర్శించితి మేని, స్వప్నములకు జాతక శాస్త్రముతో గల సంబంధము స్పష్టమగును. కొన్ని స్వప్నములలో అపరిచిత వ్యక్తులు అదృష్ట పూర్వము లగు రంగప్రదేశములు చూపట్టుట కలదు కదా! వాని మాట ఏమి, అన వచ్చును. అవి మన ప్రాచీన జన్మమునకు సంబంధించినవి ఏల కారాదు? సంఘముయొక్క, అథవా జాతియొక్క, జ్ఞానము వ్యక్తుల మనస్సులో సంక్రమించి యుండి స్వప్నములలో ప్రతిబింబించుటచే అట్టి స్వప్నదృశ్యములు సంభవించు ననెడి యొక విచిత్ర సిద్ధాంతమును మన తత్త్వశాస్త్రజ్ఞులు కొందరు లేవదీసినారట! ఎవరో, ఎప్పుడో, ఎన్ని తరములవాడో, సంపాదించియుండిన జ్ఞానము వంశక్రమముగానో, సాహచర్యమువలననో, వ్యక్తుల రక్తములో సంక్రమించియుండి స్వప్నములలో వ్యక్తమగుచున్నదని తృప్తి పడుటకంటె, ఆవ్యక్తులకే పూర్వ జన్మానుభవములు మానసికముగా నిలిచి యుండి, ఈ జన్మములో జాగ్రదవస్థలో ఇంద్రియ వ్యాపారము నతిక్రమించి వ్యక్తము కాజాలక, స్వప్నములలో చూపట్టు చున్నదని విశ్వసించుట సమంజసముగ నుండును కదా! శ్రీమతి శాంతిదేవికి కల పూర్వ జన్మానుభవముల స్మృతిని, ఆమె పూర్వజన్మ పునర్జన్మ జాతకములకు గల అన్యోన్య సంబంధమును సహా, గమనించితిమేని, పై ఊహ నిరాధార మనజాలము. *

ఈ దృష్టితో పరిశోధించినచో, చాలి నన్ని నిదర్శనములు మనకు సులభముగా లభించగలవు. ఒక

(*) 1957 వ సంవత్సరపు అక్టోబరు నెల 'భారతి' సంచికలో 47 వ పుటలోని "శ్రీ శాంతిదేవి విచిత్ర జాతకములు" అను వ్యాసమును చిత్తగింపుడు.

విచిత్రమైన స్వానుభవమును పాఠక మహాశయుల కిచట నివేదించుట అప్రస్తుతము కానేరదనుకొందును.

దాదాపు ఆరు సంవత్సరముల నాటిమాట. అపుడొక సంవత్సరముకాలము నేనొక నగరమునందుండవలసి వచ్చినది. నాకుగల విరామకాల మంతయు నాడుక చొప్పున జ్యోతిషగ్రంథ వ్యాసంగముతోనో, జాతక చర్చలతోనో, గడుపుచుంటిని. దూరదేశములో రాష్ట్రాంతరమునందుండిన ఒకానొక విద్యావతియగు కన్యక (అనగా, అవివాహిత) తన వివాహ విషయమున జాతక ఫలములను గూర్చి అపుడు ఉత్తరప్రత్యుత్తరముల ద్వారా సంప్రతింపులు జరుపుచుండెను. రూపము, లావణ్యము, విద్య, సంగీతజ్ఞానము, ఆర్థిక సౌకర్యము, మున్నగా కన్యకలలో సాధారణముగా కోరతగిన సుగుణము లన్నియు ఆమెయందు కొదవలేకయుండినా, వివాహ మంగళము మాత్రము ఎదిగిరాలేదు. వరులు కొందరు వచ్చి చూచిపోయిరట, కాని దురాశవలననో, దౌర్భాగ్యమువలననో, వారు నిరాదరము చూపియుండిరి. ఆమె కిది భరింపరాని క్లేశముగ నుండినది."

జాతకమున దేవమానదశలో చలితరవికి వరుణుని సార్థకేంద్రవేధ వచ్చియున్న కాలమది. తగిన వయస్సులో నున్నవారికి దాంపత్య జీవిత కాంక్షను రగులకొల్పి, ఆశచూపించి, నిరాశలో పర్యవసాన మగునట్టి దుష్టదశ ఇది. వివాహము జరిగినా, జరుగకపోయినా, విప్రలంభ శృంగారపు విలాపమే దీనిఫలము. ఒక సంవత్సరకాలము ఈ దశ వ్యాప్తిలో నుండుటచే, వివాహమున కిది తగని కాలమనియు, తరువాత కొద్దినెలలలో నే శుభకాలము వచ్చుననియు, అంతదనుక వివాహప్రయత్నము మానుకొనుట భావి దృష్టితో హితమనియు, సహేతుకముగా ఆమెకు తెలియజేసితిని. జాతకశాస్త్రమందు కొంత పరిచయము, గొప్పవిశ్వాసము, కలదగుటచే, ఆ ఉపదేశము ననుసరించి మనశ్శాంతిని సంపాదించుకొని, ఆకాలమును జ్యోతిశ్శాస్త్ర వ్యాసంగముతో ఆ వివేకవతి గడుపుచు వచ్చినది. వరుణునికి అభిమాన పాత్రములగు విద్యలలో జ్యోతిశ్శాస్త్రము, తత్త్వశాస్త్రము ముఖ్యమైనవి. వరుణగ్రహపు వేధాఫలము కాయికముగా, వాచికముగా, ప్రసరింపనీయక, మానసికముగా దానికి నెల్లుకట్టుటకై ఈ వ్యాసంగము ఆమెకెంతో ఉపకరించినది. గ్రంథములలో కటువులుగా తోచిన అంశములను గూర్చి ఆమె నాకు వ్రాయుటయు, తోచిన సమాధానములను ప్రత్యుత్తరములద్వారా నేనామెకు తెలుపుటయు జరుగుచుండెను. ఒకప్పుడు దాంపత్య ధర్మములకు సంబంధించిన యోగములు కొన్నింటికి కల ఉపపత్తిని గూర్చియు, ఫలిత తారతమ్యమును గూర్చియు, ఆమె ప్రశ్నించినది. అవివాహిత యగు ఆ యువతికి ఇట్టిసమస్యలు లేఖలలో వివరించి వ్రాయుటకు సంకోచించి నా అభిప్రాయము తెలుపగా, శాస్త్రచర్చలో అట్టి సంకోచము అనవసరమనియు, గురు శిష్య న్యాయములో నిశ్శంకముగా వ్యాఖ్యానించ వలయుననియు, ఆమె ప్రార్థించినది. కొనిమ్మని కొంత విపులముగా వ్రాసి, మరల సంకోచించి, ముగించక ఆపియుంచి, ఆ విషయ మామెకు తెలిపితిని. ఆమెను నేను చూచియుండలేదు. నాజీవిత కాలములో ఆమెను చూచుసంభవము ఏహో మాపట్టదు. జాతకములో లగ్నము రాశ్యంతములో వచ్చుటచే, లగ్న నిర్ణయ విషయమున పనికివచ్చునని ఆమె ఫోటో ప్రతిని తెప్పించుకొని యుంటిని అంతే.

నా స్వప్న విషయములు సులభముగా చదువరులు గ్రహింపగల్గుటకై ఈ ఉపోద్ఘాతము వ్రాయవలసి వచ్చినది. క్షంతవ్యుడను.

ఆ నగరమున నేనపుడు నివసించుచుండిన ఇల్లు మా వారిది. చిన్నదే కాని సౌకర్యములు బాగున్న ఇల్లది. ప్రహరిగోడలోని ఆవరణములో నిరంతర ఫలభరితములై కన్నులపండువుగానుండు ఎత్తైన నారికేళవృక్షములు కొన్ని ఆ యింటికి అపూర్వమైన శోభ. అందందున సంపంగి, పనస, మామిడి, నిమ్మ, అంజూరము మొదలగు వృక్షములు మధ్యన కొక్కొకటి వాని నడుమ మల్లి, జాజి, ఇరువంతి, రోజా, కనకాంబరము గోరంటి మున్నగు పూలచెట్లు ఘుమఘుమ లాడుచుండును.

“చలిత లతాంత కాంతికను చందురుకావిచెరంగు” తో మిలమిలలాడు దానిమ్మ గున్నలు రెండు ఆ ప్రదేశమునకు ప్రకృతి యొసంగిన అమూల్యాలంకారము. వ్యాసంగమునకో, ధ్యానమునకో, తలచిన మనశ్శాంతికి, ఉల్లాసమును ఒదిగించుటకు ఆ సన్నివేశము ఎంతో తగియుండినది. కాని, ఎవడైనా దొంగ దాగు

కొనుటకు ఆ చెట్లమాటు బాగా పనికివచ్చునేమో యని స్త్రీలు భయపడెడివారు.

ఆ ఇంటికి 'కటాంజనపు' తలుపులుగల చిన్న వసారా కలదు. దానికి పశ్చిమపు వైపునున్న గదినా వ్యాసంగమునకు ఉపయోగపరచుకొని యుంటిని. ఆ గదికి పశ్చిమదిశలో నున్న వాతాయనమునకు చేరికగా అమర్చిన మంచము పైన పుస్తక సామగ్రిని ఉంచుకొని కాలక్షేపము చేసెడి వాడను. రాత్రులలో ఆగదికి తాళము వేసి వసారాలో శయనించుట నా వాడుక.

ఒకనాటి రాత్రి నాకొక విచిత్ర స్వప్నము వచ్చినది. 1953 వ సంవత్సరపు మార్చినెల 25 తేదీ నాటి రాత్రి అది.

ఏదో సినిమా రెండవ ప్రదర్శనమునకు నేను వెళ్లి యుంటినట! దాని కథ ఏమో, స్మరణలో లేదు. ప్రదర్శనము ముగిసిన తరువాత, రమారమి రాత్రి ఒంటిగంట ప్రాంతములో ఇంటికివచ్చి, వసారాలో నిశయ్య చేరితిని. చూడగా, నా గదిలోని విద్యుద్దీప ప్రకాశము తలుపుసందులలో గుండా కానవచ్చినది. 'స్విచ్' తీయుట మరచి పోతినేమో యని లేచి చూడగా, గది తలుపులకు బీగము వేసియుండలేదు. భయమైనది. ఆ గదినుండి లోపలికాలకు ద్వారమున్నది. గొప్ప పొరబాటు చేసితినని స్పష్టమై అనుతాపము కలిగెను. గది తలుపొక్కటి నిశ్శబ్దముగా కొంచెము తెరచి చూతునా నా ఆశ్చర్య మేమని చెప్పగలను? నాకన్నులను నమ్మలేక పోతిని. గదిలో నా మంచమునకు చేరువగానున్న కుర్చీలో ఆసీనురాలై పుస్తకము నొకదానిని తదేక ధ్యానముతో చూచుచుండిన ఒక తరుణీమూర్తి దృగ్గోచరము కాగా, భ్రాంతుడనైతిని. పాలమీగడబోలిన వలిపంపుపటు పుటములోనుండి చంద్రకావిరంగు కుబుసంపు కాంతి ముగ్ధమధురముగా పైకి ఉబుకుచుం డినది. సవిలాసముగ రోజాపూవు చెక్కిన నీలంపు కురుల ముడిపై ధనురాకారముగా వంచికట్టియున్న మల్లెపూలదండ వర్షాకాల సాయంసధ్యాసమయములలో సూర్యు నాచ్ఛాదించిన నీలమేఘంపు పైయంచున ప్రసరించు కిరణప్రసారపు దృశ్యమును తలపునకు తెచ్చుచుండెను. మెడలోని చంద్రహారము, జడలోనున్న కెంపుల కంఠాభరణము, చెవుల నలంకరించియున్న రవల కమ్మలు, విద్యుద్దీప ప్రకాశమున ధగధగలాడుచుం డినవి. సాక్షాత్తుగ సరస్వతి కాబోలు నని తోచి, క్షణ కాలము కింకర్తవ్యతా మూఢుడనై అక్కడే నిలిచితిని.

అరనిమిషము అట్లుండి మనసు కుదురుపాటునకు తెచ్చుకొని, తలుపులు తెరచి మెల్లగ గదిలో ప్రవేశించి "ఎవరు?" అంటిని.

ఆ వ్యక్తి దిగ్గున లేచి నా కభిముఖమై, తటాలున కోమలహస్తములతో నా పాదము లంటి నమస్కరించి, వినమ్రమయి నిలచి మృదుమధురముగా,

"శిష్యురాలను" అనియె.

ఫోటోలో చూచిన వ్యక్తియే అని సులభముగా గుర్తించితిని, అత్యాశ్చర్యమైనది.

"దీర్ఘ సుమంగలీ భవ"

అని హృదయ పూర్వకముగా నాశీర్వదించి, "ఎప్పుడు వచ్చినావమ్మా! పత్రమైనా వ్రాయలేదే?" అని ప్రశ్నించితిని.

నా కేలనో పరమానందమైనది.

"క్షమించండి. దొంగతనము చేయుటకై వచ్చి యుంటిని. నా రాకపోకలు మీకు తెలియకుండా జరుపనెంచితిని. కాని, కనుగొంటిరి."

నాసాభరణపు రవల తళతళలతో మేళవించి మందహాస చంద్రికలు ఆమె ముఖ బింబమునకు ఏదో అపూర్వశోభ నొసగినవి. ఆమె భావము నాకు అర్థముకాలేదు.

"ఏమి? దొంగతనమా?" అంటిని.

"అవును. వ్రాసినది మీరు పంపలేదు. మీకు తెలియకుండా అది సంగ్రహించుకొని పోవుటకై వచ్చితిని. గది తాళము తీసితిని. నా అపరాధము క్షమించండి."

నాకు నవ్వు వచ్చినది.

"దీనికి క్షమాపణ ఎందుకమ్మా" అని మరల, "ఇప్పుడు ఏ రైలు? ఎవరెవరు వచ్చినారు? ఎక్కడ బస?" అని అడిగితిని.

"రైలులో రాలేదు. మా వూరివారు పరిచితులు కొందరు అత్యవసర కార్యము కలిగి విమానములో వచ్చుచుండగా, మావారికి తెలియకుండా ఆ విమానములో రాత్రి 11 గంటలకు బయలుదేరి వచ్చితిని. ఆ విమానము ఇంతలో నే మా ఊరికి మరలగలదు. దానిలో నే

వెడలి మా వారికి తెలియకుండ నాల్గుగంటలలోగా ఇల్లు చేరుకోవలసియున్నది. చాపల్యముతో ఈ సాహసము."

"విమానాశ్రయమున కిప్పుడె వెళ్ళవలెనా? ఎట్లు పోగలవమ్మా?" అంటిని.

"అవును." మరల చేతిగడియారము చూచి, "వేళ కావచ్చినది. ఇంతలోనే వారి మోటారుకారు వచ్చును." అని ఆమె ప్రతి ఇచ్చినది.

"సరే. కాని, వచ్చినపని అయినదా మరి?"

ఆమె చిరునవ్వుతో, "లేదు. వాడు దొరకలేదు. వ్యర్థ ప్రయాసమే." అనెను.

అంతలో ఇంటిముందు మోటారుకారు "హారన్" ధ్వని వినవచ్చింది. ఆత్రముతో ఆమె చేతులుమోడ్చి.

"అదో! వారు పిలుస్తున్నారండి." అని వెళ్ళుచు, "గదికి తాళంతీసి లోనికి వెళ్ళినా, మీరు మెలకువ రాలేదు. 'దొంగలున్నారు జాగ్రత్త'!" అని చిన్నగ నవ్వినది.

ఆవరణము ముందు బాటలో నిలిచియుండిన మోటారుకారు సమీపమునకు ఆమె వెళ్లగా నేను వెంటపోతిని. కారులో కూర్చుండి ఆమె నమస్కారములు చెప్పినది. కారువెడలిన తరువాత ఆశ్చర్యపడుచు నేను నా పడక చేరితిని.

మెలకువ అయినది. స్వప్నరంగము కన్నుల కట్టినట్లుండెను. నా గదివంక చూచితిని. వెల్తురు కానరాలేదు. 'టార్చి' వేసి చూడగా గడియారములో 2-54 A M (I S T) అగుచుండినది. అది చంద్రాస్తమాన కాలము. దేహబాధ తీర్చుకొనుటకై లేచి వసారా మెట్లు దిగి, వాడుక చొప్పున నా గదికి పడమటనున్న బయలులోనికి పోవుదమని నాలుగడుగులు వేయునంతలో ఆ చీకటిలో నాకగుపడిన దృశ్యమొకటి నన్ను భ్రాంతుని చేసెను. గదికి పశ్చిమమందున్న వాతాయనములో తల దూర్చి నిలువెల్ల తెల్లని వస్త్రములు ధరించిన ఒకవ్యక్తి నిలిచియున్నట్లు కానవచ్చెను. స్వప్నములో కనుపించిన శిష్యురాలే మరల వచ్చినదని స్ఫురించి పలుకరింతమని మాట నోటికి వచ్చెను. కాని, అంతలో ఇది మరో స్వప్నమేమో అని సందేహము కల్గెను. నిర్విణ్ణుడనై అట్లే పది సెకండ్లకాలము నిలిచితిని. మేలుకొనియున్నానని స్థిరపరచుకొంటినే కాని, ఆ దృశ్యము అర్థముకాలేదు. పిశాచ చేష్టయా అను భావము స్ఫురించి కొంత గుండెదడ కల్గినది. ఆ దృశ్యములో మార్పు రాలేదు. కార్తవీర్యార్జునుని స్మరించుచు మనసు కుదుటపెట్టుకొని రెండడుగులు ముందుకు వేసి, "ఎవరు?" అంటిని. తోడనే వాతాయనము నుండి తల ఎత్తి నావైపు తిరిగి చూచి, ఆ వ్యక్తి రెప్పపాటు కాలములో గబగబ పరుగెత్తి ఆ సమీపపు ప్రహరిగోడ ఎక్కి అంతర్ధాన మయ్యెను! నివ్వెరపోతిని. క్షణంలో ఇంటి వెనుకనున్న సందులోనికి ఇద్దరు దుమికినట్లు శబ్దము వినవచ్చెను. చోరులు కాబోలునని అప్పుడు తోచి చెప్పరానంత భయమైనది. ఒక దొంగ గోడపై కావలియుండెననియు, మరియొకడు కిటికీలో ఏమో చేయుచుండెననియు ఊహించితిని. లోపల శాలలో నిద్రించుచుండిన మా వారిని పిలిచి మేలుకొలిపి, విద్యుద్దీపములు వెలిగింపచేసి చూతునా, ఊడ పెరికి క్రింద పడవేసియుండిన ఆ వాతాయనపు ఇనుపకోచలు రెండు మాటలాడకయే తమకథ వెరిగించుచుండెను. నా మంచము సమీపములో ఉంచుకొనియుండిన 'ట్రంకు' పెట్టె జ్ఞప్తికి వచ్చి, కాలుసేతులు కొంత వణకసాగెను. రెండు వేల రూప్యములకు పైబడిన విలుగల బంగారుసొత్తులు దానిలో నుండెను. పరిశోధింపగా, చోరుడు లోపల ప్రవేశించి యుండలేదని ఏర్పడి కొంత నెమ్మది కలిగినది. వాతాయనమున కడ్డముగా మంచముపై నిలిపియుండిన నా పుస్తకముల అలమారు (Rack) ప్రవేశమునకు ప్రతిబంధకముగా నున్నందున, సద్దు కాకుండు నట్లుగా పుస్తకములను ఒక్కొక్కటిగా తీసి ప్రక్కకు పెట్టుపనిలో ఆ చోరుడు మగ్నుడై యుండెననియు, కొన్ని నిమిషములు కడచియుండె నేని, నిరుపాధికముగా గదిలో దూరి అదటనున్న ట్రంకును కాజేసి యుండుననియు స్పష్టమయ్యెను. పాపము! వాస్తవముగా, ఎంతో దురదృష్టవంతుడా చోరుడు! వృథా శ్రమపడినాడు. అదృష్టము నాది. స్వప్నములో నా శిష్యురాలు చేసిన హెచ్చరిక ఇప్పుడు నా కర్థమైనది. కృతజ్ఞతతో ఆమెను మరల ఆశీర్వదించితిని. స్వప్న వ్యాజమున భగవంతుడు నా సొత్తును రక్షించెననుట కాక వేరేమి?

అది యట్లుండె. మరునాటి ఉదయమున స్వప్న కాలమునకు (2-54 Am I. S. T.) కుండలిని సిద్ధపరచుటే నా మొదటిపని. ఆ చక్రమిదే.

| | | | |
|---|---|---|---|
| బు 21-39 (వ) | ర 4-56 స్వప్న 8-32 | శు 1-12(వ) కు 4-6 చోర 4-16 గు 20-10 | |
| రా 9-38 I 4-0 | (సాయనము) — స్వప్న కాల గ్రహస్థితి | | వ 14-26 |
| | సూచన: సహమములు దిన జాతకమునకు సంబంధించినవి. | | కే 9-38 చ 14-29 య 17.42(వ) |
| | X 13-0 | ఇ 23-0 శ 25-24 | |

ఈ గ్రహస్థితి, ఈలగ్నము సహా, ఆ సమయములో ఆ నగరవాసు లందరికిని సమానముకదా? మరి నాకు మాత్రము ఈ చోరదర్శనానుభవము రా నేల?

ఏనాటి గ్రహస్థితి అయినా, ఆయావ్యక్తుల జాతక గ్రహాదులతో సంపాదించుకొన్న సంబంధముల ననుసరించి వారివారికి ప్రత్యేక ఫలము సూచించగలదనుట ముఖ్యసూత్రము. నాజన్మగురువుతో ఆనాటి రవికి నికరముగా త్రికోణమిత్రదృష్టి. ఇది అహితముకాని, కష్టముకాని, చూపునట్టిదికాదు. నాజన్మచంద్రునికి యముడు కేంద్రము. ఇది మనసును కలవరపెట్టజాలును· అంతే. ఇతరగ్రహముల సంబంధమేమియు కానరాదు·

ఇక, దశలు నా కపుడు దుష్టముగా లేవు. చలిత లగ్నము లగ్నాధిపతికి శుభదృష్టిలో నుండెను. చలిత చంద్రునికి ధనాధిపతియగు శనితో అర్థకోణమిత్ర దృష్టి. ఇట్టిదశలో చోరబాధ, ద్రవ్యనష్టము, సంభవించుట కానిపని. పోతే, చలిత బుధవరుణులకు సమసప్తకయోగము వ్యాప్తిలో నుండినది. జన్మకాలములో వారికిగల సంబంధము ననుసరించి ఈ దశ శాస్త్రపరిశోధనమునకు పనికి వచ్చునట్టిది. నిరంతరము అధ్యాసంగములో నే యుంటినికదా! ప్రకృతి సమస్యకు సరిపడిన ఫలము దీనికి లేదు. ఇక, చోరసహమమును బెంగుపు ఒకటికలదు. దశలలో దానికి తగిన ఉత్తేజనము వచ్చేకేని, అది తన ప్రభావము కొంత చూపగలదు. జన్మకాలములో నాకు ధనభావములో దూరముగా కేతువున్నాడు. ఆ సహమము చలించి రాహుకేతువుల మైత్రిని సంపాదించిన వయస్సులో నా ద్రవ్యము కొంతచోరులు అపహరించి యుండిరి. కాని, ఇప్పు డట్టి సందర్భములు లేవు. ఆ సహమమునకు రాహుకేతువుల కేంద్రదృష్టి వచ్చియుండిన కాలమది. చోరులకు ఉపయోగకరమైన దశ కాదు. కావుననే చోరుడు ప్రయత్నించినా, ఫలము వాప్తించలేదు.

సరేకాని, ఈవిచిత్ర స్వప్నమేమి? దానితో ఆ తరుణికి ఏమిసంబంధము? ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా సంపాదించుకొన్న శిష్యురాలు స్వప్నములో చూపట్టుట ఏమివింత, అనవచ్చును. ఏడెనిమిది నెలలుగా అట్టి పరిచయము ఉండినా, ఆమె స్వప్నములో కనిపించుట అనాడే! ఏమి ఆనాటి విశేషము? దొంగతనము చేయుటకై వచ్చి బీగము తీసితినని ఆమె చెప్పుట పుస్తకములు తిరుగవేసినా ఆశించిన వస్తువు దొరక లేదనుట. తనరాకను గమనించలేదని ఎత్తి పొడుచుట, "దొంగలున్నారు జాగ్రత" అని హెచ్చరించి క్షణములో మాయమగుట ఉత్తర క్షణమే పుస్తకముల సవరించుచు ఇంచుమించుగా అదేస్థలమందే దొంగ ఒకడు కంట బడుట. గదికిటికీ ఊచలు తీయబడి యుండుట, పలుకరించిన తోడనే చోరుడు పలాయనమగుట అనునవి ఈస్వప్నపు వింతలు. స్వప్న వృత్తాంతముతో ఈచోరునికథ సర్వ విధములుగా సరిపోవు చున్నది. కదా? తెల్లవారి పోలీసువారికి చోరుని ప్రయత్నమును తెలుపగా, ఆప్రాంతములో కొందరు విద్యార్థులు, కులవృత్తి పనిలేక అప్పుడప్పుడు ఇట్టి సాహసములు చేయుచున్నారనియు, వారు చాలా జాగరూకులై పట్టుపడక తిరుగు చున్నారనియు వారు చెప్పిరి. చోరుడు సహా 'విద్యార్థి' 'యట' ఏమి 'తమాషా' ఇది?

పోనిత్తుము. చోరసహమదశ దుర్బలముగుటచే నా ద్రవ్యము పోలేదనుకొందము. స్వప్నములో చౌర్యప్రసంగము వచ్చుట సహా దాని ఫలమే కాబోలు! కాని ఎన్నడు కాని చూచి ఎరుగని ఆ తరుణి అనాడే నా స్వప్నములో సాక్షాత్కరింప నేల! మరి, దొంగతనమునకై ప్రయత్నించ నేల? ఆమె చలిత బుధుడు నా జన్మగురువుతోటి సంయోగమున కపుడు వచ్చియుండుటచే, లేఖల మూలముగా నా కామె శిష్యురాలగుట సమంజసమే. ఇదికాక, నాచలిత

లగ్నము ఆమె చలిత లగ్నాధిపతి శుక్రునితో కోణ మిత్రదృష్టికి వచ్చియుండినది. *పరస్పర దర్శనోత్కంఠకు అవకాశ మిచ్చు దశ ఇది. అటి ఆశ మా ఇరువురికీ కలదు. కాని, అప్పటి మా పరిస్థితులలో అది అందరానిపండు. వరుణ వేగకల ఆమె చలితరవి(లాభాధిపతి) నా చంద్రునితో నిండు సమసప్తకములో నుండుట ప్రతిబంధక సామగ్రి; కోరికలు కొనసాగనీయదు. కావున మా లగ్న శుక్రుల స్నేహదృష్టి దుర్బలమై బాహ్య ప్రపంచమున తన ఫలము చూపజాలక నా స్వప్నములో ఫలించినది. భావన చాలదా? స్వప్నమేల? అనవచ్చును. స్వప్న సహమము అను బిందువుకలదు. నాకది వృశ్చిక రాశిలో నున్నది. 1958 నాటికది చలించి పరస్పర మిత్రదృష్టిలో నుండు నా రవి కుజు లిరువురితో స్నేహదృష్టిలో నుండెను. ఆ కాలములో నాకు వచ్చుచుండిన స్వప్నములు ఉత్సాహజనకములుగ నుండెనవి కాని క్లేశకరముగా నుండలేదు. జ్యోతిశ్శాస్త్ర పరిచయము సూచించు భాగలో నా రవి యుండుట. కనుక, పలుమారు జ్యోతిషచర్చ నా స్వప్నములలో జరుగుచుండెడిది. ఈ స్వప్నము సహా అట్టి సమస్యపై ఆధారపడినదే కదా?

మరియొకటి స్నేహమువలన కాని, ద్వేషము వలన కాని, ఇరువురు వ్యక్తులకు పరస్పరముగా కలుగు సంబంధముయొక్క స్వభావమును, పరిణామమును, తెలుపు బిందువు ఒకటి కలదు. అన్యోన్య సహమమని దాని పేరు. నా జాతకములో ఆ బిందువు చలించి అప్పటికి ఆమె శుక్రుని కోణ దృష్టికి వచ్చియుండెను. పరస్పర విశ్వాసము తెలుపుదశ ఇది. వింత ఏమనగా, ఆ తరుణి చలిత జాతకములో ఇట్టి బిందువు అపుడు నిలిచియుండుట నికరముగా నా చలిత స్వప్న సహమము పైననే! సమావేశము స్వప్నమందే జరిగినది.

కాని, ఇది దశకదా? ఆనాటికి ఏమి విశేష ముండునేమో? ఆనాటి నా దిన జాతకములోని స్వప్న సహమము (8-32 మేషము), ఆమె జాతకమందలి అన్యోన్య సహమము (8-44 ధనుస్సు), నా చలితాన్యోన్య సహమము ([illegible]-30 సింహము)—ఈ మూడును నికరముగా పరస్పర త్రికోణ స్థానములో నుండినవని విన్నచో, చదువరు లాశ్చర్యపడకమానరు. కావుననే, ఆనాడే ఇట్టి స్వప్నము; దినజాతకపు శక్తి ఇది.

మంచిదే. కాని, శిష్యురాలుగా శాస్త్ర చర్చ చేయక, అవ్యక్తి దొంగతనమునకై ప్రయత్నించ నేల? అను ప్రశ్న మిగిలియున్నది. ఆమె జాతకమందలి చలిత చోర సహమస్థానమందే (14-20 సింహము) స్వప్న కాలపు చంద్రుడు ఉండవలయునా? భార్యాభర్తలను మాత్రము కాక, సప్తమభావము చోరుని సహా తెలుపు ననుట జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము. (అదర్శప్రాయులగు భార్యాభర్తలు పరస్పర హృదయచోరులే కదా?) స్వప్నకాలములో చంద్రుడుండుట సప్తమ భావమందే యని చదువరులు గమనించి యుందురు. తెల్లని పట్టు చీరతో వచ్చిన తరుణి ఆడదొంగ. ఈ చంద్రు డుండుట వర్గోత్తమాంశము. ఉత్తమశ్రేణికి చెందిన వ్యక్తి ఆమె. ఇంకొక్క విశేషము. నాటిదిన జాతకలగ్నము (7-20 ధనుస్సు) మిథునాంశ; స్వప్న సహమము (8-32 మేషము) మిథునాంశ; సప్తమ భావములో చంద్రునికి తోడుగా నున్న కేతువు మిథునాంశ. నా అన్యోన్య సహమము మిథునాంశ. ఇక నా శిష్యురాలి లగ్నము మిథునాంశ; అందున్న బుధుడు మిథునాంశ; ఆమె లగ్నాధిపతి మిథునాంశలోనే! కనుకనే కాబోలు నాటి స్వప్న మామె నాకర్షించుట!

భావములలో సప్తమ భావము చౌర్యసూచకము కదా? దాని అధిపతి చోరుడు. ఇక గ్రహములలో చౌర్య కారకుడు కుజుడు. శిష్యురాలి జాతకమున సప్తమాధిపతి కుజుడే. ఆమె కుజుడు సింహరాశి 4-వ భాగములో నుండుట. స్వప్న లగ్నమునకు సూటిగా అతడేమరు--అనగా, సప్తమ (చోర) భావంలో ఆమె జాతకమందలి చోరశిఖామణి నిలిచాడు. చౌర్యమునకై ఆమె వచ్చియుండుట! స్వప్నకాలపు కుజుడు చౌర్య సహమసహయుడై స్వప్నలగ్నమునకు, ఆమె కుజునికి సరిమధ్యభాగలో నుండుట గమనించదగినది. అంతా చోరమయము. ఆమెకు దశాధిపతి చంద్రుడు. స్వప్న కాలమున సప్తమ భావములో నుండి చౌర్య ప్రయ

*గ్రంథ విస్తరభీతిచే, ఆమె జన్మ జాతక, చలిత జాతకముల నిచట వ్రాయలేదు. ప్రకృత సందర్భమునకు కావలసిన ముఖ్యమగు గ్రహస్థితులు మాత్రము వ్యాసములోనే అందందు చూపితిని. కాక, ఆమె జాతకఫలములను చర్చించుట ఈ వ్యాసపు ఉద్దేశము కాదు. కనుక ఆజాతకము లిచట అనవసరము అని భావించితిని. చదువరులు క్షమింతురు గాక.

త్నము చేయుచున్నాడు. నాదలిత ఋగ్వరుణుల యొక్క స్నేహదృష్టి నీ గ్రహమభిలషించుచుండుట. ఏదో జ్యోతిశ్శాస్త్ర విషయమును సంగ్రహించవలెనని ఆమె ఆశ. ఆ పనికై విమానయానములో వచ్చినదనుట వరుణప్రభావమే. ఆమెకు లాభాపతి రవి వృశ్చిక రాశిలో 4 వ భాగలో నున్నాడు. ఈ రవికి సమసప్తక శత్రుదృష్టి స్థానములో ఆనాటి కుజుడు చోరసహాయము సహా నిలుచుటచే, చౌర్యప్రయత్నము ఆమెకు లాభకరముగా పరిణమించలేదు. చతుర్థ భావము ద్రవ్య స్థానము. స్వప్నకాలమున వానిలో ధనాధిపతి గురువున్నాడు. ఆమె జాతకమున దశమకేంద్రమందున్న గురువు స్వప్నకాలపు ద్రవ్య స్థానపు గురువుతో సుప్తమిత్రదృష్టిలో నుండుటచే, ఆమె ప్రయత్నము నాద్రవ్యమును రక్షించుటకే పనికివచ్చినది. నా శిష్యురాలు స్వప్న వ్యాజముతో నాకు సమర్పించిన గొప్ప గురుదక్షిణకాదా ఇది?

ఒక విచిత్రము పరికింపుడు. స్వప్నకుండలిలో కుజుడు వృషభములోనున్నాడు. వృషభము దక్షిణ దిక్కును సూచించురాశి. ఆ దిక్కునుండియే ప్రహరి గోడ నెక్కి చోరుడు వచ్చుట. తరువాత అంతర్థానమగుట సహా ఆ దశలోనే. ఆ కుజుని వెనుక వృషభారంభములోనున్న శుక్రుడు గోడమీద కావలికాచుచున్న మరియొకనిని సూచించడా? చతుర్థ భావము ద్రవ్యస్థానము. దానికి చేరుకొనుటకే చోరుని ప్రయత్నము. అచట ధనాధిపతి గురువు 20—10 లో నున్నాడుగదా? నా ట్రంకులో ఇరువదివందల వెలకు మించిన నగలుండినవి.! స్వప్నలగ్నము కుంభము. ఇది పశ్చిమదిశ తెలుపు రాశి. ఆ దిక్కునుండియే చోరుడు గృహప్రవేశము చేయ నుద్యోగించుటకదా? ఆ ఇంటి పశ్చిమపు గోడ నిడివి 36 అడుగులు. దానిలో 5 అడుగుల దూరములో ప్రశంసలోని వాతాయన మున్నది. 36 లో 5 ఎంత భాగమో, కుంభరాశి 30 డిగ్రీలలో స్వప్నలగ్నముండిన 4°-11' అంతే భాగముకదా? ఏమి ఆశ్చర్య మిది? కాలపురుషుని లీల!

కాని, నాకొక్క కొదవ మాత్రము మిగిలిపోయినది. ఆచోరవిద్యార్థి ఎవడో, తెలుసుకొనుట సాధ్యము కాలేదు. వానిని కనుగొని కారాగృహమునకు పంపు కుతూహలముకాదు. వాని జాతక సామగ్రిని సంపాదించుటకు ప్రయత్నించి యుందును. 'ఇదేమి పిచ్చి,' అని నవ్వువా రుందురేమో? శిష్యరాలి జాతక గ్రహములతో, స్వప్నకాలగ్రహములతో, ఎంతో నికరమైన సన్నిహిత సంబంధము వాని జాతక గ్రహములు తప్పక చూపగలవని నా నమ్మకము. ఇది నిదర్శనముగా పాఠక మహాశయులకు నివేదించు అవకాశము నా కిపుడు లేకపోయినదికదా?

పోనిండు. స్వప్నానుభవముల సందర్భమందే జాతక శాస్త్రసూత్రముల కింతవెల యున్నచో, జాగ్రదవస్థలో మానవుల అనుభవములను సూచించు విషయమున వాని కెంతశక్తి యుండునో, చదువరు లూహించుకొనగలరు. ఇంతేకాదు. సామాన్య నిద్రావస్థకు చెందిన స్వప్నములకే ఈ శాస్త్రముతో ఇంత సంబంధము ఉన్నప్పుడు, దీర్ఘనిద్రావస్థకు చెందిన పూర్వజన్మ పునర్జన్మములకు దానితో ఎంతో గొప్ప సంబంధము ఉండితీరునని మనము ఊహించుట తప్పు కాదు. కాని, ఈ విషయమున ఉన్నత స్థాయిలో పరిశోధనము జరుగవలసి యున్నది. అట్టిపనికి తగిన సంస్థలు మనదేశమున సిద్ధమగు భాగ్య మెన్నటికో?

ఈ శాస్త్రముయొక్క శక్తి అపారమైనదని యవనాచార్య డిట్లు వర్ణించెను:—

అన్యోన్యస్య రాశ్యంశక సంప్రయోగైః।
అన్యోన్యస్య సందర్శన సంగమైశ్చ।
అన్యోన్యస్య సంయోగ వికల్ప వాభిః।
ఇదం సముద్రాంబువ దప్రమేయం॥

# అగ్నిపరీక్ష

శ్రీ మంథా వెంకటరమణారావు

మేము రోజూ అప్పారావుగారి ఇంట్లో కలుస్తూ వుండేవాళ్ళం, ఆ రోజులలో. పంచ పాండవులని అంటూ వుండేవారు మమ్మల్ని. మాష్టారు ధర్మరాజు: ఆయనకి 52 ఏళ్ళు అప్పుడు. పండి నిటారుగా నిల్చున్న జుత్తు. సర్వదా చిరునవ్వు ముఖం. నుదుటి మధ్యని చిన్ననాట ఎప్పుడో చుట్టతో పెట్టిన క్రేడ్ మార్కు.

అప్పారావుగారు అర్జునులు: పొడుగాటి విగ్రహము. దానికి తగ్గ అంత బలమూ అంత సన్నమూ కాని శరీరం—కళ్ళ లాల్చీ—పంచ—గోల్డు ఫ్రేము కళ్ళద్దాలు. ఆయన అంతా పెద్దమనిషి ఫాయిలో వుండేవారు. రాసి ఏదో ఊడబొడిచేద్దామని తయారుచేసిన నాటికలు, కథలు ఆయనకు ప్రప్రథమంగా వినిపించేవారం నేనూ, కృష్ణమూర్తి. ఏదో అన్యమనస్కంగా వింటున్నట్టుండి, ఎవ్వరికీ తట్టని సూక్ష్మమయినవీ—అయినా పెద్దవీ—అయిన పొరపాట్లను పట్టి, బాణంలా సంధించికొట్టినట్టు విసిరేవారు మామీద. అప్పుడు ఆయన వయస్సు 42—మంచి రూపరి.

ఇంక నాయినప్ప: భీముడు. అతని అసలు పేరు ప్రసాదరావు. "భీముడు" సరిగా సరిపోయిం దతనికి. మంచి బలమయిన శరీరం. వితండవాదం. సులభంగా ఆవేశాన్ని పొందగలిగే తత్వం. సహృదయుడు. అతని వయస్సు 36 అప్పుడు.

ఇంక కృష్ణమూర్తి: నకులుడు. అతను కవే గాక రచయిత కూడానూ. అతని వయస్సు 32 అప్పుడు. మిగిలిన సహోదరుణ్ణి నేను. నా వయస్సు 22 అప్పుడు. మా ఇద్దరిలోనూ నకుల సహదేవుల గుణగణాలున్నా లేకపోయినా అక్కడికా ఐదు సంఖ్య సరిపోయింది కాబట్టి గత్యంతరం లేకపోయింది.

నాయినప్పని ఆవేశపరచడం కృష్ణమూర్తి పని. ఇద్దరూ కొట్టుకొనే వరకూ వచ్చేది. కృష్ణమూర్తి పాపం అర్భకుడు. అందుకక్కడితో ఆపేవాడు. ఇక నా సంగతి అట్టే రాసుకోనవసరం లేదు. చూస్తూ, వింటూ కూచొనేవాణ్ణి.

అయితే అసలు సంగతికి వద్దాం. అప్పారావుగారింట్లో కలుస్తూ వుండేవాళ్ళం అన్నాకదూ. అంతా చేరక అక్కడ కాసేపు 'హస్కు' వేసి బయలుదేరి మెయిన్‌రోడ్డు మీదుగా నడుస్తూ పోయి, అప్ప ఇల్లు చేరడమో లేక దారిలో ఒకసారి కృష్ణయ్యర్ హోటలులో దూరి కాఫీతాగుతూ ఈ మహావిశ్వాన్ని గురించి మాటాడ్డమో జరిగేది.

లేదా, ఒకోనాడు, మాష్టారు మాకు చక్కటి అనుభవాలు చెప్పేవారు. అంతా అయాక మా ఇద్దరినీ ఉద్దేశించి కథలుగా వ్రాయమనేవారు. ఓసారి ఆయన మాట తోసేలేక కథగా రాసానుకూడా ఒక అనుభవం. అది చాలాఏళ్ళక్రితం లెండి—నిజానికి అవి ఆయన అనుభవాలుకావు. ఆయన కేవలం ఒక సాక్షీ మాత్రుడు వాటికి—ఆ అనుభవం పొందిన అందులోని పాత్రలయిన వ్యక్తులు వేరు. ఆయన చెప్పడంకూడా సొగసుగానే చెప్పేవారు—అదక్కడికలా ఉండండి.

నాయనప్పని ఆవేశపరచడానికి ఒక సులభమయిన మార్గం ఉంది. అది: వాల్మీకి అనే మహర్షి రాసిన రామాయణం అనే గ్రంథాన్ని చర్చలోకి తీసుకరావటం—ఆ పని అప్పారావుగారే చేసేవారు—"అయితే—అప్పా!" అన్న సంబోధనతో ఆరంభించేవారు. అది ఇంక రాకెట్‌లా లేచి ఆకాశాన్నందుకునేది—అప్ప ఊహలో రామాయణం ఒక కల్లబొల్లి కట్టుకథ—అది అంతటితో ఆగినాబాగుణ్ణు—ఆ రాసినవాడొక బుర్రలేనివాడు—రాముడు ఒక చేతకాని చవట—అలా అలా సాగిపోయేది—పాతివ్రత్యం ఏమిటంటాడు—పతివ్రతలు లేరంటాడు—నభూతో నభవిష్యతి అంటాడు. ఈనాడేమన్నా పాతివ్రత్యం ఉంటే అది అర్థిక శానిసత్వంవల్లనే

అంటాడు—'చలం' గాలి పోకింద చేవారు అప్పారావుగారు—ఇంక ఆయనా ఆరంభించేవారు పూర్వపక్షం—సిలకలుపట్టుకు నేవరకువచ్చి అక్కడికి ధర్మరాజుగారి జోక్యంతో ఆగి, కాఫీ సేవించాక చల్లారేది.

అవి మార్చి రోజులు—ఆఫీసులో ఉపద్రవమయినపని—ఆ రోజున మరీనూ—ఇంటికి చేరుకోవేసరికి బాగా అలసిపోయేను—బాగా చీకటి కూడా పడింది. ఆకలి కూడా వేస్తూఉంది-వెంటనే భోజనం చేసేను. ఇంక ఇంట్లో ఉండాలనిపించలేదు. మా ఇంటిపక్కనే మరికికొలబ—ఆ ఇంట్లో ఉండడం బాధే—ఆ రోజున మరీనీ—సినిమాకి పోదామని బుద్ధి పుట్టింది, నాదగ్గర ఒక రూపాయి మిగిలిఉంది. ఇక కావల్సింది మరో రూపాయిపావలా—అది కృష్ణమూర్తి పూర్తిచేస్తాడన్న నమ్మకం ఉంది. మేం ఎప్పుడూ బెంచీక్లాసుకే పోయేవాళ్లం—మా ఊళ్లో టెన్ రేకుల థియేటర్ లో, నేల, బెంచీ, మూడే క్లాసులు—ఇంక హాలుగురించి వర్ణన అనవసరం. సహృదయులు ఊహించుకోగలరు. మాకు ఏ సినిమా అన్నది ముఖ్యంకాదు. ఏవో బొమ్మలు కనిపించడం ముఖ్యం. ఆ బొమ్మలు చూస్తే మా కేవో ఆలోచనలు అందుతో సంబంధంలేనివి వచ్చేవి. దానిమీద చర్చలు. సరదాగా కొన్ని క్షణాలు ఒకరి సాహచర్యంలో ఒకరు కాలం గడిపేందుకు వెళ్ళేవారం.

ఆవాడు నే వెళ్లేసరికి అంతా సమావేశమై ఉన్నారు. అప్పారావుగారి (అద్దె) ఇల్లు, రెండు గదులు, ముందుకి చిన్న వరండా, సామాన్ల కొట్టూ, గలది. ఒక గది వంటా భోజనాలకి. మిగిలిన గది వారి లివింగ్ రూము, డ్రాయింగ్ రూము, స్టడీరూమును, బెడ్ రూమూ అన్నీనూ. ఇంక మేం సమావేశమవుతే ఇంట్లో ఆడవాళ్లు అంతసేపూ పాపం వంటఇంట్లో కూచోవల్సి వచ్చేది. రెండు మంచాలు ఎప్పుడూ వేసే ఉండేవి. రెండు పరుపులూ, రెండు దుప్పట్లూ ఎప్పుడూ పరిచే ఉండేవి. మేము మా ఖాళీకాళ్లతో పాటిమీద సుఖాసీనులయేవారం. రెండు మంచాలకీ మధ్యని ఒక టేబిలు గోడ వాసుకుని—దానిమీద కొన్ని కాగితాలు, ఒక చిన్న అద్దం—అదీ, అక్కడి నిత్యరంగం.

అయిందా—ఆరోజు వెళ్లేసరికి మాష్టారూ, అప్పారావుగారూ లంక పొగాకు చుట్టలు ముట్టించి జోరుగా పొగ వదుల్తున్నారు. కృష్ణమూర్తి దీర్ఘంగా ఆలోచిస్తూ కాగితంమీద ఒక పద్యం అల్లుతున్నాడు. ఇంక నాయినప్ప కూచోని ఏవో ఎస్టేటు వ్యవహారాలు, మాటాడుతున్నాడు.

మాలో మాకు ఒకర్నొకరు ఆదో లాంఛనంగా పలకరించుకోడం కాని, సలాములు కొట్టుకోడం లాటి బాదస్తాలుగాని లేవు. ఎవరొచ్చినా కూచోడం. ఇష్టముంటే మాటాడ్డం. లేదా వింటూ కూచోడం.

కూచ్చుంటూ, ఇవాళ సినిమాకి వెడితే ఎలా ఉంటుందన్నాను—అంటూ రూపాయి తీసి టేబిల్ మీద విసిరేసేను. అప్పారావుగారు "బాగానే ఉంటుందీ" అంటూ కృష్ణమూర్తివేపు చూసేరు. ఆ చూపుల అర్థం గ్రహించినవాడై, తప్పకుండా అన్నాడు కృష్ణమూర్తి—నిశ్చయం అయినట్టే. కాని, రెండో ఆట కింకా రెండు గంటలకాలం ఉంది. ఆ రెండుగంటలకాలం ఇక్కడో లేదా, హోటల్ ప్రక్కనుండే పాణిగ్రాహి హోటలులోనో గడపవల్సిందే.

"మాటలో మాట—సినిమా ఏవిటి?" అన్నారు మాష్టారు...

"ఏదయితే నేవిటి పోనిద్దురూ" అన్నారు అప్పారావుగారు—సినిమా ఏదో హిందీది—రామాయణం సంబంధమయినది. లంకాదహనమో, రావణసంహారమో ఏదో సరిగా జ్ఞాపకం నాకిప్పుడు లేదు. ఏదో అలాటిదే—ఆమాట చెప్పేను.

"అయితే...అప్పా!" అన్నారు అప్పారావుగారు — అందుకుంది రంజకం — నాయనప్ప రాకెట్ లా లేచేడు.

"పరాయివాడి చేతబడి వాడింట్లో అన్నాళ్ళ పాటుందా? అందుకీయనగారు యుద్ధానికి బయలేరేడా? పోనీ పౌరుషం కొద్దీ ప్రతీకారం చేద్దామని బయల్దేరేడు బాగుంది. వాడ్ని చంపేడు—బాగుంది. మళ్లా ఆవిడ్ని అగ్ని పరీక్ష ఏదో పెట్టి క్యారక్టర్ సర్టిఫికేటు అనిస ప్రొడ్యూస్ చేసేక ఏలుకున్నాడా... పోనీ అదీ బావుందనుకుందాం. అంత విశాలహృదయుడు. ఎవడో ఏదో కూసేడని పెళ్ళాన్ని అడవుల్లో ఒదిలేసేడా? అదేదో అనాడే చేసుక పోయేడూ? అప్పుడా జ్ఞానం ఎందుకు లేకపోయింది. నలుగురూ నాలుగు విధాల అనుకుంటారని—పతివ్రతల ..."అని ఈవిధంగా ఆరంభించేడు—దానిమీద అర్జునుడు

కూడా వ్యాఖ్యానిస్తూ ఖండించేరు. ఇలా ఒక అరగంట కాలం చాలా హీటెడ్‌గా వాదోపవాదాలు చెలరేగి ప్రమాదకరంగా తయారయింది పరిస్థితి—అప్పారావు గారు నిజానికి ఆవేశం పొందరు. అతను కేవలం అప్పని ఆవేశపరచి వినోదించడం కోసం ఇదంతా ఆరంభించేవారు. పరిస్థితి 'క్లయిమాక్స్'కొచ్చింది. అప్పుముక్కు చెలమలు లేచి పడుతున్నాయి. ముఖం కందగడ్డ అయింది. పిడికిళ్లు బిగించేడు.

ఆకస్మాత్తుగా మా స్టారు లేచి టేబిల్ మీద గుద్దేరు—అప్పు నోరు ఆగిపోయింది. మా స్టారెప్పుడూ అలా జోక్యం కలుగజేసుకోలేదు. అందుకు కొద్దిగా ఆశ్చర్యపోయేం.

"నాదొక చిన్న మనవి—" అన్నారు అతి సున్నితంగా—అని చిరునవ్వు నవ్వేరు. అప్పు ఆవేశం సగం తగ్గిపోయింది. "ఏమిటా మనవి" అన్నాడు. "ఇవాళకి మీ వాదం ఆపండి" అన్నారాయన—"అదా—మనవి" లేచేడప్పు.

"మన కింకా ఒక గంట ఉందికదూ—ఏముంది ఒక్క పావుగంటే—చిన్న కథ ఒకటి చెప్తాను—వింటారా? ఏం అప్పా—వింటావా?"

"కానీండి" అన్నాడప్పు—గత్యంతరం లేక.

మా స్టారు గాఢంగా ఆలోచించేరు. ఆనక, జేబులోనుంచి పెద్ద ఇత్తడి 'లైటర్' తీసి చుట్ట ముట్టించేరు. ఆయన చుట్ట ప్రతిఐదు నిముషాలకీ ఓసారి ఆరిపోతుందిలెండి—పొగ లాగి వదుల్తూ అన్నారు సీరియస్‌గా—(ఆయనఏదన్నా సరదా పుట్టించేవీ, హాస్యాన్నిచ్చే సంగతులూ మహా గొప్ప సీరియస్‌గా చెప్తారు) "అప్పా! ఏ సంగతన్నా నిశితంగా మనసులో ఆలోచించకుండా, పూర్తిజ్ఞానం లేకుండా అంత తేలిగ్గా మాటాడకూడదయ్యా."

"ఏమిటి నేను తేలిగ్గా మాటాడేసేను?...పతివ్రతలు...."

"ఔను. ఆ సంగతే నేనిప్పుడు చెప్తున్నాను—నే చెప్పబోయే సంగతి విన్నాక అర్థం అవుతుంది. ఇది మీ ఇరవయ్యో శతాబ్దం నాటిదే. అయినప్పుడు అప్పా ఆనాటి సంగతి ఆలోచించు. ధర్మం నాల్గు పాదాలా నడిచే రోజులవి. ఆనాటి వాతావరణమే వేరు...... ఆ నిర్మలమయిన వాతావరణంలో అటువంటి శక్తిగల స్త్రీలుఉన్నారంటే ఆశ్చర్యపడవల్సిందేమీ లేదు..."

"పాతివ్రత్యం అంటే నవ్వు రావడం నీ తప్పు కాదు. ఏవో బలవత్తర కారణాలవల్ల వాళ్లు పతివ్రతలయేరంటావ్. అప్పా ఒక్క సంగతి జ్ఞాపకం ఉంచుకో...స్త్రీ శక్తిస్వరూపిణి..."

ఈసారి నాయనప్పు నవ్విన నవ్వుకి గదంతా కంపించింది. ఆ నవ్వుతున్న అతని ఆకారాన్ని చూసే సరికి నాకు నవ్వాగిందికాదు. మాస్టారో చిరునవ్వు పారేసి, చుట్ట ఆష్ట్రేమీద పడేసి అన్నారు—

"అనురాగం అనేది ఒక శక్తి—ఆ శక్తి స్త్రీలో కలిగినప్పుడు ఆమె శక్తిస్వరూపిణి అవుతుంది. ఆ అనురాగం దేవుడిపట్లే కాని, తన భర్తపట్లే కాని..."

"మరో మగాడిపట్లే కాని" నాయనప్పు అందిచ్చేడు......

"సరే...మరో మగాడిపట్లే కాని, కలిగిందంటే, ఆ శక్తి విజృంభించిందంటే, స్త్రీలో అహం అన్నది చచ్చిపోతుంది......స్వార్థం నశిస్తుంది...ప్రాణాలను కూడా లెక్కచెయ్యను అవసరం వస్తే. భర్తపట్లా, దైవంపట్లా ఆ అనురాగం, ఆ త్యాగదీక్ష కలిగి ఉన్న స్త్రీని పతివ్రత అన్నారు...ఒప్పుకుంటావా?"

నాయనప్పు ఈసారి అంతగట్టిగా నవ్వలేదు—కాని—

"ఈ కబుర్లు కేంలెస్తురూ మాస్టారూ" అన్నాడు.

"పూర్తిగా వినుమరి—ఏది అప్పారావుగారూ ఓ చుట్ట."

అప్పారావు గారిచ్చిన చుట్ట ముట్టించి పొగ వదుల్తూ చెప్పుకుపోయేరు మాస్టారు.

"నే చెప్పబోయే సంగతి అంత పెద్దది కాదు. చాలా చిన్నది, నాలుగు ముక్కల్లో చెప్పివచ్చు. అయినా మీరు సరిగా గ్రహించేందుకు మరో రెండు ముక్కలు తగిల్చి చెప్తాను." అంటూ చెప్పేరు మాస్టారు.

"అతను నాకు బాగా తెల్సు—అయినా స్నేహితుడనీ చెప్పలేను. స్నేహితుడంటే నా అందనా ప్రకారం వేరు. నా విలువల ప్రకారం చూస్తే నిజానికి మీ రెవరూ స్నేహితులు కారు నాకు—స్నేహం—స్నేహధర్మం—అదంతా ఒకపద్ధతి. నాకు స్నేహితుడని చెప్పుకోదగ్గవాడు ఒకే ఒక డుండేవాడు. అతనిప్పుడు

లేదు. శరీరాలే భేదం మా ఇద్దరికీ-సరే ఆ వ్యవహారం వదలండి—

"అయితే—అతను నాకు బాగా తెల్సు—అంటే అతని ఇంటికి నేను తరచువెళుతూ ఉండే వాణ్ని—ఒక విధంగా దూరపు చుట్టం కూడాను అతను—ఏదో బాదరాయణ సంబంధం.

"ఓ—ఉండేవాడు ఆరడుగుల దగ్గర దగ్గర ఎత్తు—ఎత్తుకుదగ్గ లావు. నవమోహనా కారుడని అనను కాని, ఆ ఆరోగ్యం, ఆ హుషారు ఒక ప్రత్యేక ఆకర్షణ—అంగులో అందం ఉండేది. ఎప్పుడూ నీట్ గానూ, 'టిప్ టాప్'గానూ ఉండేవాడు. టెన్నిస్ ఆడేవాడు—జూదం ఆడేవాడు—తాగేవాడు-పెళ్లాం ముందే నిర్మొహమాటంగా-అతగాడి వయసు అప్పుడు దరిదాపు 30 ఏళ్లు—

"ఆవిడ నిజంగా బహు చక్కనిది—"

"ఏవిడ?" అన్నాడు అప్పు—

"ఆవిడే...అతని పెళ్ళాం...23, 24 ఏళ్లుండేవి కాని 18 ఏళ్ళ అమ్మాయిలా కనొచ్చేది. పిల్లలు లేరు మెట్రిక్ ప్యాసయింది. ఇంగ్లీషు పుస్తకాలేంటిటి... తెలుగు పుస్తకాలేంటిటే తెగచదివేది. నా పని ఆవిడకి పుస్తకాలు సరఫరా చెయ్యడం—సరఫరా చెయ్యలేక చచ్చేవాణ్ణనుకో—అయినా అందులోనూ ఉండేది లెండి ఆనందం..."

"ఊఁ? ఉండేది ఆనందం" దీర్ఘాలు తీస్తూ అన్నాడు కృష్ణమూర్తి—

"ఆ...ఉండేదయ్యేక ఏం ఉండేది" అని మాష్టారు పకపకా నవ్వేసేరు.

"నాతో చనువుగా మాటాడేదావిడ—ఆవిడ నుండి ఆ చిరునవ్వందుకుంటే నే చాలు ఇంక చచ్చిపోవచ్చనుకోండి. మరింక బతుకులో ఆశించవల్సిందింకేం లేదు."

"మీ రింకా బ్రతికేఉన్నారు" అన్నాను నేను.

"ఉన్నాను—ఈ వెధవ బతుకు బతుకుతూ—" నిరాశగా కుర్చీకి చేరబడ్డారు మాష్టారు—

"ఎక్కడున్నాం—ఆఁ—నే చెప్పేడు వెళ్ళినా ఆప్యాయంగా మాటాడేది. ఆకళ్ళనిండా నవ్వులే... ఆ ముఖమంతా ఆనందమే...ఆ పెదవులనిండా జీవమే—లతలా నాజూకుగా ఉండేది—నల్లటిరంగు వర్చస్సు జుత్తు విరబోసుకుంటే నల్లని మేఘాలు ఆకాశాన్ని, చంద్రుణ్ణీ కప్పేసినట్టుండేది—అంతజుత్తు...కాని ఏం లాభం..."

"ఏఁవీఁ...ఏమయింది."

"అవన్నీ అతడికోసమే."

"అదా మీ కనుపు...ఏంలాభం అంటే ఏమో అనుకున్నాను" అన్నాడు అప్పు మాష్టారి భుజంతట్టి.

"అందుకే వాడూ ఏమీ పట్టనట్టే ఉండేవాడు, నాతో ఆవిడ ఎంత చనువుగా ఉన్నా—అంత విశ్వాసం వాడికి తనలో—

"అతగాడి నిబ్బరం చూస్తే మండుకొచ్చేది—అయినా ఎందుకు మండుకురావాల్లెండి—అతడూ అలా ఉండక ఏమౌతాడు...ఆమె అలా ఉంటే..."

"ఎలా ఉంటే?"

"అతగాడు తన ఎదురుగా ఉంటేచాలు!, చూసేవాణ్ణేకదా,—తన అందాన్నీ జీవాన్నీ, ప్రేమనీ, ఆరాధనని, నవ్వులనీ, వెలుగునీ, సర్వస్వాన్నీ ఆకళ్లలో ఆరెండు కళ్ళలోనూ ఇమిడ్చి అతణ్ణి తీసుకోమనేది—వాడి పాదాలముందు అర్పించుకునేది...మరి—వాడలావుండక ఎలా ఉంటాడు..."

"అప్పా ఈర్ష్యపుడుతోందా!" అన్నాడు కృష్ణమూర్తి—నాయినప్ప మాటాడలేదు. సీరియస్ గా ముఖంపెట్టి కూచున్నాడు—

"సమృద్ధిమయిన ఇంట్లో ఉండేవారు—మొప్పయి కామోసు అది—ఇంటినిండా సోఫాలు—వాళ్ళ పడకగది స్వర్గమే - అంతశ్రద్ధతో ఆ ఇల్లలా ఉంచేది. అతనిజీతం మరీ ఎంతో కాదు — 150/-- 160/-- ఆ ముక్కని ఉండేది — ఎగ్జిక్యూటివ్ ఉద్యోగం, ఏదో ఆ కంట్రోళ్లకి సంబంధించినదేదో...

"అతను నాకు తమ్ముడువరస — అందుకామె నన్ను 'బావగారూ" అని పిలిచేది - ఏవో కవుల గురించి? రచయితల గురించి వారి రచనలగురించి మాటాడేది — ఆవిడకి సంస్కృతం బాగావచ్చు - అతగాడికివన్నీ చెవిటివాడిముందు శంఖంలాటివి - అందుకు నేను దొరికే వాడికి —

"అతనికి సంగతులంటే ఏమీ పర్వాలేదండీ... అతనితో ఇవి మాటాడ్డం అతనిని అనవసరంగా బాధ పెట్టడం తప్ప మరింకేమీ కాదు..." అనేది -

"ఔను — ఎంగుకుంటుందీ ఉమర్ ఖయ్యామ్ చెప్పినట్టు విషం ఇచ్చేవి మాడూ ఉంటూ ఉండగా — పుస్తకం బదులు నేనే అనుకోండి ... ఏఁవయితే నేం" అనేవాణ్ణి కసిగా -

"చిన్నబుచ్చుకోడం పోయి కలగలా వచ్చేసేది ఆ మాటలకి -

"ఇంక వారిద్దరిమధ్యా ఎలా ఉండేదీ అంటే, చెప్పగలిగిందేదో చెప్పేను - అగడంటే ఆమెకి కలిగే భావం చెప్పేను—ఆసంగతి క్షుణ్ణంగా అతడికి తెల్సు; అలానడిచేది.

"ఆమె ఏదీకోరకుండా నే అతను తెచ్చి పడేసే వాడు— చీరలేవీఁటి — నగలేవీఁటి ... అలా అవి అదంతా ఆమెమీద అపారమయిన ప్రేమవల్లనని నేనెన్నడూ అనుకోలేదు — అందులో అతడొక రకమైన ఆనందం పొందేవాడనుకుంటాను. అదంతా తన అహాన్ని తృప్తిపరచడంకోసం అని నా నమ్మకం.

"అవన్నీ పెట్టెలలో తుప్పుపట్టవల్సిందే — ఆ అలంకారాలేవీ ముట్టేదికాదు, అతి నిరాడంబరంగా దుస్తులు వేసుకునేది -- అప్పుడే ఆమె రెట్టింపు అందంతో కానొచ్చేదనుకోండి - ఆసంగతి ఆమెకు తెల్సనుకుంటాను.

"సరే - అదంతా బాగానే ఉంది -- అప్పటికి. యుద్ధం అఖరయిపోతుం దన్నమాట. మరో నాలు గయిదు నెలల్లో -- నాకక్కణ్ణించి బదిలీ అయి పోయింది - అక్కడికి రెండువందల మైళ్ళ దగ్గర దగ్గరుంటుంది నేను పోబోయే కొత్తఊరు - ఆఖరి రోజున వారింట్లోవిందు - రాత్రి - మేంముగ్గురఁవేఁ- అతగాడు రావడం ఆలశ్యమయిం దనుకోండి — వచ్చేడు - కాస్త చుక్క వేసుకు వచ్చాడు — నన్నుకూడా వేసుకోమని బలిమాలేదు. నా పంక్తిని కూచున్నాడు. ఎటో మళ్ళిపోయేడు.

"ఆ రాత్రి అన్నానావిడతో—అతన్ని కాస్త అదుపులో పెట్టమని—మరీ అతి అయితే అతని ఆరోగ్యం చెడడం, ఇద్దరి సామరస్యం దెబ్బతినడం, ఇలాటివి జరగవచ్చని చెప్పేను. ఆవిడ నవ్వేసి ఊరుకుంది. ఆవిడ ఉదాసీనతచూస్తే నాకు కష్టంవేసింది. ఎందు కయ్యో వేసిందికష్టం అంటే వేసిందిమరి. ఉండబట్ట లేక అనేసేను—"చూడూ—నేనిలా ఉంటున్నానని ఇంకోలా అనుకోకు, నాకొకటి బాగా అనుమానం... అతను నీపట్ల అవిశ్వాసంగా ప్రవర్తిస్తున్నాడేమోనని"

"'అంటే?'--అందావిడ నవ్వుతూ. నాకు కోపం వచ్చింది, చెప్పొద్దూ—తెల్సే ఆ ప్రశ్న వేసిందని-

"అంటే ఎవరి వెంటేనా పడుతున్నాడని నా అనుమానం — ఇంకా అర్థంకాలేదా?" అన్నాను కోపంవచ్చి.

"'ఆయనలాటివారు కారు—మీరన్ని చెప్పినా నే నమ్మను...' అంది. అయ్యో! ఇంక అలాటి ఆడదానికి ఏంచెప్పి ఏం లాభం. ఏమీ లేకుండా నే అనుమానపడడం భార్యల స్వభావమే—అటువంటిది అంత ఢంకా బజాయించి నే చెప్తున్నా నమ్మని స్త్రీని ఇంక దండంపెట్టి వదిలేవచ్చు.

"నే వెళ్ళిపోతున్నానని కళ్ళ నీరు నింపుకుంది పిచ్చిపిల్ల—ఆవిడ చేతుల్ని నా చేతులలోకి తీసుకుని అన్నాను "నేను నీ మేలుకోరేవాళ్లలో ఒకణ్ణి— ఎప్పుడైనా నా అవసరంవుంటే నాకు కబురు చెయ్యడం మరవకు" ఆఖరికి మనసు ఉండబట్టలేక ఇది కూడా అనేసేను. "రోజూ నీ నవ్వుముఖం కనిపిస్తూ ఉంటే నాకెంతో తృప్తిగా ఉంటూ ఉండేది..."

"సరి, నేను ఆ ఊరు ఆ మర్నాడే వదిలి వెళ్ళి పోయేను. కొన్నాళ్ళపాటు ఈనోటా ఆనోటా వాళ్ల సంగతి తెల్సుకునేవాణ్ణి. ఆవక మరి నాకింకేం తెలీ లేదు. అప్పటికే యుద్ధంకూడా అయిపోయింది మూడేళ్లు గడిచిపోయేయి. నేనూ నా గొడవలలో పడిపోయేను ఈ మూడేళ్లలోనూ. ఇంక బయట అందరూ ఎలా ఉన్నదీ తెలీయనిస్థితిలో పడిపోయేను. మా వాడికి టైఫాయిడ్ చాలా ప్రమాదం చేసింది. దానికితోడు ఆఫీసుపని ఒత్తిడి ఇంతా అంతాకాదు. ఇంట్లో మందులు ఇత్యాది గొడవ. ఇలా మూడేళ్లు దొర్లి పోయేయి. పెళ్లియీ అవడంతోటే పిల్లల్ని కనేసే మన సుఖుస్తూ బతుకుల సంసారాలు,—చీదర, నరకం అనుకోండి—"

ఇక్కడ మాస్టారుకథ ఆపి కొంచెం చుట్ట ముట్టించుకున్నారు.

"ఆ... ఏం జరిగిందీ...ఔను ... ఓరోజు పొద్దుటే ఎర్ర సైకిలు ప్రత్యక్షమయింది. మన బ్రతుకుల్లో టెలిగ్రాంలు అందుకున్న క్షణాలు చాలా

విలువయినవి. మన బతుకులని ఎందుకంటున్నానంటే పెద్దపెద్ద వాళ్ళందరికీ టెలిగ్రాంలు రోజువారీ వస్తూనే వుంటాయి. మనకిమాత్రం అత్యవసర పరిస్థితి గానో, అత్యంతప్రమాద పరిస్థితి గానో తప్ప రావు. అందుకు అన్నా నామాట. అందులో 'అర్జంటుగా' రమ్మని ఉంది. దిగువని ఆవిడ పేరు. నాకు ఆశ్చర్యం, ఆందోళన కలిగేయి.

ఇన్నాళ్ళూ ఏనిశమయిన సమాచారమూ, ఉత్తర ప్రత్యుత్తరాలు లేకుండా ఒక్కసారిగా టెలిగ్రామ్ ఇలాటిది వస్తే ఎలా అనిపిస్తుందో అలా అనిపించింది. సెలవు దొరికేసరికి నా తాతలు దిగొచ్చేరు. రాత్రల్లా రయిల్లో, అతగాడేం అత్యాచారం చేసేడో, ఏం కొంప ముంచిగింకోవని బెంగగానే ఉంది. ఈ ఊరు చేరేటప్పటికి తెల్లవారిపోయింది బాగా. స్టేషన్‌దగ్గరే ఇడ్లీ, కాఫీ పుచ్చుక బయల్దేరేను. స్టేషన్‌కవాళ్ళి ఇల్లు ఒక మైలు. చేతిలో సంచీయే కాబట్టి నడిచేద్దామని కాలిని బయల్దేరేను. ఓ ఫర్లాంగుమారం వెళ్ళేసరికి, కుటుంబరావు ఎదురయ్యేడు. కుటుంబరావు కక్కడే తాలూకాఫీసులోపని. ఉద్యోగం అయినప్పట్నుంచి అక్కడే ఉంటున్నాడు. అప్పటికి40 ఏళ్ళు. "ఏమోయి ఏమిటిలా ఊడిపడ్డావ్' అన్నాడు. అతగాడికి తెలీకుండా ఉంటుందా అని ఆత్రంగా సంగతంతా చెప్పేను. వాడు ఆశ్చర్యపోయేడు. అంత ఆశ్చర్యం లోనూ ఒక చిరునవ్వు నవ్వి "ఇప్పుడా నీకు తెల్సింది" అన్నాడు. నాకు గాభరా పుట్టింది. "ఏమిటి తెలీనం నాకేమీ ఇంకా తెలీదు" అన్నాను. "ముందు పద. కాఫీ తాగుదాం" అన్నాడు. "కాఫీకేమిటి కాని ముందు ఏం జరిగిందో చెబ్దూ" అన్నాను. "అప్పుడే అంతా అయి రెండు నెలలయింది. వాళ్ళకి దూరపు బంధువువి...దగ్గిరి స్నేహితుడివి...ఇప్పుడా నీకు తెలుస్తా" అన్నాడు. "నాకు తెలీదయ్యా దేవుడా! అదేదో చెప్పి ఏడుద్దూ ముందు" అన్నాను. "కాఫీ తాగుతూ చెప్తా పద" అన్నాడు. అతగాడి సంగతి నాకు బాగా తెల్సు. కాఫీ పడితేనేకాని ఏదీ పెగల దన్న నిర్ణయాన్నికొచ్చి, పద అన్నాను. కాఫీ అంటే ఉత్తి కాఫియేకాదు. అన్నీ స్వీకరించేక కాఫీ చవి చూస్తూ అన్నాడు "ముప్పయిరూపాయల అద్దియిల్లు, ఇంటినిండా ఆ సోఫాలు, దివాసీలు, అద్దాలు, ఆబట్టలు నగలు ... ఆరేడియోలు, తాగుడికీ, జూదానికీ ముందు లకీ, డబ్బు అన్నీ ఎక్కడి దనుకున్నావు కదూ"—ఆ నిముషం కుటుంబరావుని చూస్తే పురుగుని చూసినట్టుగా అనిపించింది. ఏదో ఓ జవాబివ్వాలి. "నాటి సంగతి నేను ఏనాడూ ఆలోచించ లేదు" అన్నాను. "ఆలోచించ లేదూ? ఎందుకరయ్యా ఈ కబుర్లు. తెచ్చే 150 జీతం లోనూ ఇవన్నీ ఎక్కడివని ఆలోచించ లేదూ?" సరే ఏమయిందో చెబ్దూ." "అదికాక ఇరవై పాతిక వేల రూపాయల క్యాషు...ఎలా వచ్చిందంటావ్ ఇదంతా" ఇంక లాభం లేదని "ఎలా వచ్చింది?" అని ఎదురు ప్రశ్న వేసేను. "ఇవాళ ఫైనలు హియరింగు తీర్పు కూడా ఇవాళే చెప్పేరోయ్ మ్చు. తీర్పేమవుతుందో ఆనాడే అందరికీ తెల్సులే."

"నాకు చెమట్లు పోసేయి. ఫైనల్ హియరింగేమిటి తీర్పేమిటి చెప్పమన్నాను.

"దొంగతనం ఎన్నాళ్ళిదాగుతుందోయి. భగవంతు డన్నవాడొకడున్నాడంటావా లేదంటావా? ఎప్పుడో ఒకప్పుడు పట్టుబడక తప్పుతుందా..." ఇది చెప్తున్నది తాలూకాఫీసు గుమాస్తా కుటుంబరావు. అర్ధకీ, రూపాయకీ కక్కుర్తిపడే కుటుంబరావు. "అన్నాళ్ళి ఆ డిపార్టుమెంట్లో, ఆ ఉద్యోగంలో ఉండి, షావుకార్లతో కల్సిపోయి, ప్రజల కళ్లు కప్పి దోచుకుంటే, ఎన్నాళ్ళు సాగుతుంది బాబూ నాటకం ఎలాగో తెల్సింది. అంతా బట్టబయలు గాకనుపిస్తూ ఉంటే ఇంక తెలీడాని కేముంది. ఎక్కడిది? ఎలా వచ్చింది అన్నారు...ఇంకేముంది. 'ఏంటి కరప్షను ఆఫీసర్లు' పోలీసులు, వెంటనే ఆ కేసు-ఆవక ఆసుందర్రావుగారు లేరూ? నాకు భుజా లెగరేసుకుంటూ వెళ్లి బెయిల్ మీద విడిపించుకొచ్చేరు." నాకంతా అర్ధమయింది. కాని ఒకటే వింత అనిపించింది. ఈ ఇచ్చే టెలిగ్రాం ఆనాడివ్వక ఈరోజు ఎందుకిచ్చిందా ఆమె అని. అతడి కాఫీ పూర్తయింది. లేచేను. కుటుంబరావు ఇంకా చెప్పుకుపోతున్నాడు—"ఏవీ మార్పు లేదు. సంవత్సరం ఖాయం. గడించిందేదో సర్కారువారు పుచ్చుకోడం అలా ఉండగా ఇంక జరిమానామాట దేవు డెరుగును. వాళ్ళ ప్లీడరన్నమాటలే అవి. అయితే ఏమిటి, పనుతున్న తాపత్రయమల్లా, శిక్ష కొస్త తగ్గించడానికి" నేనింక అతగాడి మాటలు వినదలచుకోలేదు. బిల్లు చెల్లించి, "అయితే వస్తానోయి" అని బయల్దేరేను. "అప్పుడే? ఉండవోయి కాస్త...కిళ్ళీ అదీ వేసుకుని—"

ఇల్లు మామూలుగా ఆనాటిలానే ఉంది. అయితే ఏవిటో ఎందుకో కళావిహీనంగా ఉందనిపించింది. కేవలం నేను నా మనస్సులో అలా అనుకోడంవల్ల అలా అనిపించి ఉండవచ్చు. అది వేరే సంగతి.

ఇంట్లో ఏవీ అలికిడి లేదు. ఆవిడ ఒక సోఫాలో కూర్చొనిఉంది. కుడిచేయి చెక్కిలికి ఆన్చి సోఫాని ఆనుకుని ఆలోచిస్తోంది.

నన్ను చూడగానే ఎంతో సంతోషంతో నా చేతులు తన చేతుల్లోకి తీసుకు పలకరించింది. ఆవిడ బాగా నీరసించింది. అది మరి సహజమే. ఎంత నీరసించినా ఆ ముఖంలోని కళా, కాంతి, ఒక రేఖ ఎక్కువయితే అయేదేమో కాని తగ్గలేదు. చూసేరా, మనుష్యులు ఉపవాసమున్నా, ఏదన్నా వ్రతం పూనినా, నీరసంగా ఉన్నా ముఖంలో ఒక తేజస్సు ఉంటుంది-అలా.

ఆవిడ నాకు ఈ సంగతి చెప్పలేదు. నా ముఖంలోకి నిదానంగా చూసింది. ఎందుకో, నే నిప్పుడు మీకు చెప్పలేను. కాని చూడండీ—ఆవిడదీ మహా చికాకయిన పరిస్థితే. ఎలా చెప్పడం అన్నది. ఆవిడ కాకష్టం కలిగించకుండా నేనే అన్నాను. "కుటుంబరావు దార్లో కల్సాను."

ఆవిడ ముఖం చిన్నబుచ్చుకుంది. సహజమే. నేను అప్పటిమట్టుకు ఏమీ ప్రశ్నలు వెయ్యలేదు. నే వస్తానని తెల్సినట్టు ఉంది, ఫలహారం తెచ్చి పెట్టింది. తప్పుతుందా మరి. కాదన్నా ఆవిడ వింటుందా.

"ప్రేమపూరితమయిన హృదయంలో, లావణ్య హస్తాలతో ఇచ్చిన నైవేద్యం ఏ దేవుడు కాదనగలడు?" అని అందిచ్చేరు కృష్ణమూర్తి.

"ఏదన్నా అంటారు కవులు. ఈ కాలంవాళ్ళు మీకు అన్నిటికీ ఫ్రాయిడే గుర్తొస్తుంటాడు. సరే—సరే. దానికేం—అదలా ఉంచండి.

'కాఫీ తాగుతూ ఉండగా ఆవిడంది - "నేను ఇన్నాళ్ళూ మీకు ఏ సంగతీ తెలియజెయ్యక ఈనాడు మిమ్మల్ని రమ్మనడం 'ఏవిటిది? అనిపించిందికదూ?'

"నా మనసులో ఉన్నది సరిగ్గా గ్రహించి చెప్పిందావిడ. నే జవాబిచ్చేలోగా అంది—"ఆనాడు మీరు వచ్చి మాత్రం ఏం చేసి ఉండగలరు. అయితే ఈనాడు మీ కెందుకు కబురంపేనని అడుగుతారేమో-ఎందుకో చెప్పనా? నా కేదో మాటలలో చెప్పలేని భయం పట్టుకుంది ఈ రోజంటే—ఈ రోజు ఎదుర్కొనేందుకు నాకు ధైర్యం చాలటం లేదు. మీరు దగ్గరుంటే... అందుకు...అర్థమయిందా?" కాస్త ఊరుకుని అంది. "ఎవరేమనుకున్నా ఆయన కేదో చెప్పలేని ధైర్యంగా ఉంది. ప్లీడరుగారు కూడా నా కెంతో ధైర్యాన్ని చెప్తున్నారు...అయినా ఎందుకో చాలా ఇదిగా వుంది." ముఖం తిప్పుకు, కన్నీళ్లు తుడుచుకుంది.

"నే నేమని ఓదార్చేది—ఆ స్థితిలో ఆవిడ్ని ఓదార్చేందుకు సరయిన మాటలంటూ వున్నాయా? నేను చాలా విచారపడుతున్నాను సుమా. అన్నదీనంగా ముఖం పెట్టి కూర్చోవడం తప్పించి నే నేమీ చెయ్యలేక పోయాను. కొంతసేపు పోయేక అన్నాను—

"నావల్ల సహాయం ఉన్నా లేకపోయినా ఇన్నాళ్ళు నాకీ సంగతే తెలియజెయ్యక పోవడం..."

"మీరలా అంటారని నాకు తెల్సు. ఈ సంగతి తెలిస్తే మీరు ఎంత బాధపడతారో ఊహించుకోలేక పోయే ననుకోకండి. అందుకని—" అతని గురించి అడిగేను. అంటే అతని మానసిక స్థితిని గురించి—"అతను ఇంటికి రావడమే అరుదై పోతోంది. అతను అంతగా బాధపడి అధైర్యపడి పోయేరనుకోకండి. లాయరుగారి కారొస్తుంది. తప్పకుండా మరీమరీ రావాలని చెప్పేరు. నాకెందుకో వెళ్ళాలని లేదు. అక్కడ వుండలేను." మనస్సు అంత ఆందోళనగా ఉన్నప్పుడు వెళ్ళడం మంచిది కాదని, వెళ్ళవద్దనీ ఆవిడకు చెప్పేను."

మాష్టారుకు కుర్చీకి చేరబడి కళ్ళజోడు తీసి టేబిల్ మీద పడేసేరు. కళ్లు రాచుకుంటూ అన్నారు:

"ఇప్పటిల్లా చెప్పుకొచ్చిం దొక ఎత్తు, ఇప్పుడు చెప్పబోయేది కొద్దిపాటి ఒకయెత్తు. ఒక విషమయిన వాతావరణం మీ మనసుల్లో కలిగేందుకు యిదంతా చెప్పేను. నే చెప్పబోయేదేమంటే, ఒక అనుకోని, భయంకరమయిన, సందిగ్ధ స్థితిలో స్త్రీ చిక్కుకున్నప్పుడు అది అనుకోకుండా, ఆ పరిస్థితిలో ఆవిడ ఎలా ప్రవర్తించింది అని. లోకంలో, స్త్రీలలోనైతే నేం, పురుషులలో నయితే నేం, సర్వ కాలాలలోనూ వివిధ మనస్తత్వాలు గలవాళ్ళు ఉండివున్నారు. మాట వచ్చింది కాబట్టి చెప్తున్నా. ఇది ఇరవయ్యో శతాబ్దం కదూ. పతివ్రత అంటే నీకు నవ్వొచ్చింది కదూ. ఐతే నే చెప్పబోయే పరిస్థితిలో నువ్వన్న ఆర్థిక శావిసత్వం

ప్రశ్న రాదు. పతివ్రత అనంగానే నీ కళ్ళకి తెల్లారు జామునే లేచి, భర్త పాదాలకి దండం పెట్టి, చన్నీళ్ళ స్నానం చేసి, మడి కట్టుకుని, పరపురుషుడు కానొస్తే కళ్ళు మూసుకుని, భర్త దేవుడని శుద్ధిగా నమ్మి, పువ్వులు పత్రి తెచ్చి భర్తని పూజచేసే స్త్రీ కళ్ళకి కడుతుంది కదూ? అలా ఆలోచించటం మానెయ్యి. రక్తం, మాంసం, ఎముకలే కాకుండా పాపిష్టిదేవుడు మన సన్నది కూడా ఒకటిచ్చాడుగా. దాన్నే హృదయమను ఏమను. 'ఎక్సెంట్రిసిటీ' (వక్రగతి) అంటారే, అది ప్రతి వ్యక్తిలోనూ ఉంటూ వుంటుంది. ఎంతో అనురాగం, ఎంతో భక్తి, దీక్ష, పూనటం, శక్తి, కసి ఇవన్నీ వక్రగతులే. ఆర్థిక బానిసత్వం కూడా వుంది. లేకపోలేదు. కాని అందరికీ అది వర్తించదు.

అచంచలమైన అనురాగ విశ్వాసాలు, అనే 'ఎక్సెంట్రిసిటీ' భర్తపట్ల కలిగిన స్త్రీని పతివ్రత అన్న పదంతో పిల్చేరు మన పూర్వులు—ఇదంతా ఎందుకు గొంతుక చించుక చెప్తున్నానంటే నేనా సంఘటనని ఎలా అర్థం చేసుకున్నానో అలా అర్థం చేసుకోగలరో లేదోనని..."

"మరో అరగంటే ఉంది పిక్చర్‌కి" అన్నాను.

"పోనిద్దూ వెధవ పిక్చరు" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇంత బొత్తిగా ఓపిక లేకపోతే ఎలా, కవులయ్యేండి—మరింక నే చెప్పవల్సింది టూకీగా చెప్పేస్తాను."

"అంటూనే మరో పావుగంట" అన్నాడు పార్థు.

"పదకొండున్నర్లా కారొచ్చింది- నేనూ ఆవిడా బయల్దేరేం—ఆవిడ ముఖం పాలిపోయింది. పెదవులు వణుకుతున్నాయి. తనలోతను ఏదో మెల్లిగా అనుకుంటోంది. రెండు చేతులూ గట్టిగా కలుపుకు కూర్చుంది—ఏమంటే అనుకోండి కాని, ఆవిడ స్థితి చూసి నా మనసు తరుక్కుపోయింది."

"అతగాడిమీద కోపమూ వచ్చింది" కృష్ణుడన్నాడు.

"ఆవిడ మనసుని ఆ స్థితికి దించేందుకు వాడికున్న హక్కేమిటనిపించింది. ఆవిడని మీ రెవ్వరూ చూడలేదు—ఊహించుకోగలరో లేదో— అటువంటి స్త్రీని చూడగలగడం జన్మానికోసారి. అటువంటి స్త్రీ ముఖంమీది నవ్వు జగమంతటికీ వెలుగే—ఒక్క కన్నీటిబొట్టు రాలితే సర్వనాశనమౌతుందనిపిస్తుంది... ఆ స్త్రీ పాదాలముందు మోకరిల్లాలనిపిస్తుంది చూడగానే. ఎటువంటివాడికన్నా.

"సెంటిమెంటులో పడిపోకండి."

"సెంటిమెంటే మహాశయా! మన బతుకులో అడుగడుగునా అది కానొస్తుంది. అది లేనిది మన బతుకులు ఖాళీ - జంతువుల్లో కూడా కానొస్తుందే—మాటవరసకి కుక్కని తీసుకోండి—అదెందుకంత విశ్వాసంగా ఉండాలి? ఈవిడ అతడిగురించి పడే బాధకి, అంటీఅంటనట్టున్నాడనిపించింది.

"సరే—కోర్టుకి చేరుకున్నాం—ప్రజలున్నారు రమారమి ఒక యాభైమంది—మేం వెళ్ళేసరికి న్యాయమూర్తి వచ్చేరు—కేసు నడుస్తున్నది. 'డయాస్'కి ఎదురుగా ఉన్నాడతను. జనుల మధ్యనుండి దారి చేసుకుని వెళ్ళేం. ఆవిడ్ని ఒక కుర్చీలో కూచోమన్నాను—కూచోలేదు. అతగాడికోసం వెతికి ఆఖరికక్కడ చూసింది. ఆ ముఖంలోని భావం ఏమని చెప్పను. ఆ కళ్ళు చెరువులే అయ్యాయి. కుర్చీలో నీరసంగా కూలబడింది. లాయరు, దుక్కలా, పొట్టిగా బొద్దుమీసాలమనిషివచ్చి, ఆవిడ్ని ఓదార్చి, ఏమీ బాధలేదు, ధైర్యంగా ఉండమని చెప్పివెళ్ళేడు—కాని సంగతి సందర్భాలు విచారించగా ఏమాత్రమూ ఆశ ఉన్నట్టు అగుపడలేదు. లాయరు కూడా శిక్ష ఎంత తగ్గినా తగ్గిందే అన్న ధోరణిలో ఉన్నారు.

"ఆఖరు కతగాడ్ని బోనెక్కించేరు—ముక్కుపోతులా ఉన్నాడు—ఏదీ నిరసించలేదు, అతని వేపే దీక్షగా చూస్తూ కూచుందామె.

"చెప్పుకోవల్సిందేమన్నా ఉందా?" అని అడిగేరు న్యాయమూర్తి. చేతులు కట్టుకుని టంచనుగా నిలబడి అన్నాడు అతగాడు.

"నేను చెప్పవల్సింది బహు కొద్ది— నేను నిర్దోషిని"—ఆవిడ ముఖం వికసించింది; ఆనందం పట్టలేక వలవలా ఏడ్చేసింది.

"అంత డబ్బు నాదగ్గర ఉండడం సంభవం కాదన్న భావనమీద, ఏదో ఓ విధాన ఈ కేసు నామీద మోపబడింది. నే నీస్థితికి వచ్చేను. ఎక్కడిదీ అన్న విషయంలో నేనింతవరకూ మౌనంగా ఉన్నాను.

కాని ఇప్పుడు... ఈ పరిస్థితులలో—" ఇక్కడ అతని గొంతులోని విశ్వాసం పోయింది. తడబడ్డాడు... మాకేసి, ముఖ్యంగా ఆమెకేసి తీక్షణంగా చూసి... అన్నాడు...

"అది నా భార్యది—"

కోర్టులో గుసగుసలు చెలరేగేయి. ఆమె ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుంది. నాకూ ఆశ్చర్యమే అయింది కాని, అదేమీ అంతబలమైన ఆర్గ్యుమెంటులా కానరాలేదు. ఎక్కడిదీ, ఎలా వచ్చిందీ అని అడిగరూ మరి?

"ఎలా?" అన్నారు న్యాయమూర్తి—

అతను ఆలోచించేడు—ఎందుకో, ఏదో చెప్పేందుకు సంకోచించి, ఆమె వేపు మరోసారి పరిశీలనగా చూసి, ఔను పరిశీలనగానే, నాకు జ్ఞాపకం ఉంది, చూసి అన్నాడు:

"నేను షావుకార్లతో కల్సి, లంచాలు పుచ్చుకుని నా భార్య పేర వేసి ఉండవచ్చుని అనవచ్చు—కాని అది కాదు." చాలా డ్రమెటిక్ గా అన్నాడు, కోర్టంతా కలియజూసి—



"అవి యుద్ధం రోజులు—అప్పుడు ఈ ఊరు, ఐదేళ్ళపాటు టెంపరరీగా, ఒక కోస్ట్‌కి మిలటరీ హెడ్ క్వార్టర్సుగా ఉండేది... ఊరినిండా మిలటరీ ఆఫీసర్లే—నీళ్ళలా డబ్బు ఖర్చు చేస్తూ—నా భార్య అందనికోరకమైనది కాదు. ఇంతకన్న నే చెప్పలేను—కోర్టువారు గ్రహించుకోగలరు"

"అంతా నిశ్శబ్దం—ప్రపంచమే ఆగిపోయింది నాకు—న్యాయమూర్తి కరుడు కట్టిపోయేరు. ఆమె వేపు చూడలేకపోయేను... ఎలా చూసేది... ఎలా చూసేది—"ఇది అబద్ధం—కట్టుకథ. ఎంతమాత్రం నమ్మేందుకు వీలు లేదు" అని పబ్లిక్ ప్రాసిక్యూటరన్నారు. నాకు కొత్తప్రాణం వచ్చింది. కాని వాడు తొణకలేదు. "అబద్ధం చెప్పవల్సిన అవసరం లేదు. ఈ విషయం బహిరంగం చెయ్యడం ఎంత కష్టమో గ్రహించగలుగుతే ఈ అనుమానం వెయ్యకపోను. అయినా నా భార్య ఇందుకు సాక్ష్యం—అవిడ ఇక్కడే ఉంది... ఆవిడ నడిగి తెల్సుకోవచ్చు—"

'ప్రపంచం ఎందుకింకా ఉంది ఎందుకు మండిపోలేదు దేవుడా అనిపించింది. అందరి దృష్టీ ఆమె మీద పడింది. ఆమెని కాలుస్తూ... పాముల్లా అందరి చూపులూ—ఆ చూపులు వీటితో నాకు తెల్సి—నిండుసభలోని ద్రౌపది పరిస్థితిలా ఏర్పడింది. ఏదేవుడు వస్త్రమిస్తాడిప్పుడు.

"ఆమె శరీరంలో ఏమీ చలనం లేదు. శిలా ప్రతిమలా అతన్ని, అలా కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయింది. నాకు అక్కణ్ణించి పిచ్చివాడిలా అరుస్తూ పరుగెత్తుకు పోవాలనిపించింది.

"కొంత తెలివి తెచ్చుకుని ఆమె చెయ్యి నా చేతులలోకి తీసుకుని, ఆవిణ్ణి పిలచేను—మరో లోకంలో ఉన్నట్టు నా వేపు చూసింది. ఏదో ఆవేశంతో మాటాడేను. ఈ ఘోరమైన అన్యాయాన్ని ప్రతిఘటించమన్నాను. నా మాట లేవీ ఆవిడకు వినిపించినట్లు లేదు.

"పబ్లిక్ ప్రాసిక్యూటరు భీష్మించుకు కూర్చున్నాడు. ఆవిడ బోనెక్కే పరిస్థితి తప్పలేదు. అదీ మంచికే, ఆవిడ ఖండించి చెప్పేందుకు, అనుకున్నాను.

"అప్పా!—ఇక్కడ ఆర్థిక బానిసత్వమన్న ప్రశ్న లేదు. రెండే రెండు మార్గాలామెముందున్నాయి. చదువుకున్నదీ, తెలివైనదీ అయిన ఆమెకి ఆమె పరిస్థితి అర్థమయి ఉండదని నేననుకోను—మొదటిది: ఆవిడ

కాదన్నదా—అతనికి శిక్ష తప్పదు. అసలు ఇద్దరికీ సామరస్యం కుదరదు. ఇంటికి తెగించినవాడు అప్పుడు ఏమన్నా చేస్తాడు. ఆవిడ కిచ్చే తక్కువ శిక్ష, ఆవిడ్ని వదిలి దక్కపోవడం—అందుకని మళ్ళీ కోర్టుకెక్క మనిషి కాదు ఆవిడ—ఎక్కినా ఫలితం శూన్యం... విరిగిన బతుకులు మిగులు—రెండోది: ఆమె తప్పు కుండా—అతడు విడుదలవడం, మానవుడు దేవుడి కాక-విముదలవుతాడని ఎక్కడుంది. అసలు ఇంకా ఎన్నో ప్రశ్నలు రావచ్చు...అదిలా ఉండగా సంఘదృష్టిలో ఆవిడ పూర్తిగా బహిష్కరింపబడుతుంది. నీచంగా చూడబడే కులటకన్నా నీచంగా చూడబడుతుంది...ఈ కళంకభారాన్ని మోస్తున్న ఆమెని తిరిగి స్వీకరించడానికి అతడు వెనుకాడడం ఖాయం—ఒక వేళ అతడు విశాల హృదయంతో చేరదీసినా అది ఆట్టేకాలం సాగదు. ఆ కళంకాన్ని అవకాశంగా తీసుకుని, ఇతరులు ఆవిడపట్ల యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తారు.

అతడిదంతా భరించలేని స్థితికి తప్పకుండా వచ్చేస్తాడు...పర్యవసానం ఆవిడమానాన ఆవిడ్ని వదిలి దక్క పోతాడు...అప్పుడు ఆ కాపు కూడా లేని ఆమెని తిరిమి, తిరిమి పీల్చి పిప్పిచేస్తారు మనుష్యులు. అదీ పరిస్థితి—ఇది ఆమెకు తెలుసు—లోకెక్కిన ఆమెకు మొదటి మార్గమొక్కటే శరణ్యమనికూడా—

"తుఫానుల కదలాడి రాలిపోబోయే సగం చీలిన లేత ఆకులా ఉందామె, అక్కడ నిల్చున్నప్పుడు—ఆ ముఖంలో ఆ దైన్యం...నిస్సహాయత....వీటితో మిళితమై ఏదో శక్తి...తేజస్సు...అప్పుడామె, నేను రోజూ చూసే ఆమె కాదు—ఆమెను చూడగా—"ఈ పురుగుల్ని ... నీచపురుగులమైన మనుష్యుల్ని మేముండే ఈ ప్రపంచాన్ని భగ్గున కాల్చి మసిజేసే శక్తి ఉందమ్మా నీలో!...మసి చెయ్యి!....మసి చెయ్యి!"...అనిపించింది—

మాష్టారు గొంతు తగ్గించి అన్నారు—"కాని ఆశక్తి, తనను తాను భస్మం చేసుకుంది. ఆ మంటల్లో-అతడికి కావల్సిన జవాబిచ్చి తెలివితప్పి పడిపోయింది" కాస్త ఊరుకుని "నా కథ అయిపోయింది" అన్నారు మాష్టారు.

వాయినప్ప ముఖం భయంకరంగా ఉంది. ముక్కు చెలమలు లేచిపడుతున్నాయి. టేబిల్ గుద్ది "ఎక్కడున్నాడు...వాడెక్కడున్నాడు" అన్నాడు.

వాయినప్ప ధోరణికి ఆశ్చర్యపోయేం. చెప్పేటకదూ, ఇట్టే ఆవేశం ఒచ్చేస్తుందని.

"తరవాతేమయింది మాష్టారూ" అన్నాన్నేను.

"తరవాతేమయిందీ అన్నది అప్రస్తుతం. ఇక్కడ ఎంతవరకూ అవసరమో చెప్పేను..." విచారంగా అన్నారు.

"పోనీ, ఆవిడేమయిందో చెప్పండి" అన్నాను ఉండబట్టలేక.

"అంటే ఆత్మహత్య?"

"కాలిపోయిందన్నారుకదూ!"

"ఆవిడకి మరి తెలివిరాలేదు. అనోక 'షాక్'లా వచ్చింది. పలవరింతలు, జ్వరం ఉండుండి కొయ్యబారిపోవడం యమయాతనపడి, ఆఖరికి పది రోజుల తరవాత విముక్తిపొందింది—ఈ పాపిష్టి మన నించి" మాష్టారు కళ్ళొత్తుకున్నారు. ఔను. ఆయన కళ్ళకి కట్టిఉండొచ్చు, ఆమె అమాయికమైన ముఖం.

విశిరికొర్దుల సంగీతం, సినిమాహాలునుండి వినిపిస్తోంది. మొదటి ఆటవదిలినట్లు సూచనగా.

కాని మేం ఎవ్వరూ కదలలేదు.

# కలగూరగంప

## తిక్కన ఉద్యోగము

శ్రీ దూతలూరి జగన్నాథము

మేము తెలుగువారము. మా భాష తెలుగు. మా మర్యాద యిది. అని నోరార చెప్పుకోవడానికి వినువారికి వినిపించడానికి మహానుభావుడు తిక్కన పుణ్యము కట్టుకొన్నాడు. ఆ నోట ఏ మాట వచ్చినా అది తేటమాట. ఏ పలుకు పలికినా అది తెలుగు నుడికారపు కుడిగోపురము. ఏ చేత చేసినా అది తెనుగుచేత. అదే అతని 'ఉద్యోగము'. తెనుగు కుండ నిండుతియ్యందన మక్కడే. అందుకే "వింటే భారతం వినాలి; తింటే గారెలు తినాలి" అన్నారు. ఈ మాట ఏనాటి నుండో తెనుగునాట, యీనాటికీ నోటనోట ఊట లూరించుచున్నది.

అటు ఔత్తరాహులకు, ఇటు దాక్షిణాత్యులకు, రామాయణము మేలుబంతిగా నుంటె, ఆంధ్రులకు మాత్రము మహాభారతముపైన ఎందుకో అంత మక్కువ? అందులకు కారణము లేకపోలేదు. కంబకవి కావ్యరచనా నైపుణ్యము దాక్షిణాత్యుల వశపరచుకొన్నది. అదేరీతిని తులసీదాసు ప్రభావమే ఔత్తరాహుల నుత్తేజపరచినది. ఆ సామ్యము ననుసరించియే, తిక్కన మహాశయుని ప్రజ్ఞాప్రాభవములే ఆంధ్రలోక మీ మహాభారతమును అందల మెక్కించ కారణమైనది. ఐతే యీ ఆంధ్రభారతకర్త ఒక్క తిక్కన మహాశయుడే కాదు. అది ముమ్మూర్తులకృతము. ఐనప్పటికి హెచ్చుభాగము ఇందు పదునైదు పర్వములవరకూ కవిబ్రహ్మ వాణియే పలికినది. ఆ పలికినదికూడా అలతి అలతి తెనుగు పదములతోటె. అది ఆంధ్రజాతీయతను కూడగట్టుకొన్న నిక్కంపు తెనుగుదనము. నన్నయ, ఎఱ్ఱనలకన్నా యీ తెనుగుతీపి తిక్కన కవితకెక్కువ. నన్నయది రెండు పాళ్ళు సంస్కృతము, ఒక్కపాలు తెనుగు. ఎఱ్ఱనది సమభాగము. తిక్కన చేయి తక్కినవారివలెగాక తెనుగునందు రెండుపాళ్ళు అందె వేసినది. ఒక్క పాలు గూడా పూర్ణముగా సంస్కృతముండబోదు.

తెనుగుపద ప్రయోగము హెచ్చినంత మాత్రము చేతనే తెనుగువారీ గ్రంథమును ఎక్కుడు ఆదరించుచున్నారనుటకు వీలులేదు. అట్లైన అచ్చంపు తెనుగుతనముతో నిండిన గ్రంథము లెన్నో యున్నవి. వాటిని మనవారంతా ఆదరించుచున్నారా? కనుక దీనికి మూలకారణ మరయుదమేని తిక్కన నోట ఊటలూరించిన తెలుగు తీపితోపాటు ఆంధ్ర కుటుంబముల చిన్న పెద్దల మర్యాదలు యే యే పట్టుల యేరీతిగా పలుకవలయునో, ఆ రీతిని పలికించెను. భారతము నందు యితని ఉద్యోగమే అది.

ఇతర పర్వములవలె గాక, ఉద్యోగ పర్వమునకు ఒక ప్రత్యేకపు రాణింపు గలదు. ఇందు కథ లేదు. ఉన్నదంతయు వారి మాటలు వీరికి, వీరి మాటలు వారికి, వినిపించటముతోనే సరిపోయినది. ఈ మాటల తీరులోనే భారతము తెనుగు గడ్డపై శాశ్వతముగా నిలద్రొక్కుకొన్నది. తిక్కన కవితా సృష్టి యీ పర్వమున ఒక నూత్న సృష్టిగా నిలిచినది. కౌరవ, పాండవులను ఆంధ్రులను చేసి వైచి తిక్కన కవిబ్రహ్మయైనాడు. ఇందు కూర్చినవి పద్య గద్యము లేయైనను, నిక్కమునకు రెండునూ కావేమో! ముఖాముఖి సంభాషణలే. కవిత్వములో పత్యక్ష సంభాషణలు యీ రీతి కల్పించిన కావ్యము, తెలుగున యింకొక్కటి కానరాదు. ఉద్యోగ పర్వమును నాటకముగా రచింప దలచిన, సంభాషణములు వేరు వ్రాయ నవసరము లేదు. పద్యాది నున్న "కం, దం, ఉ, మ, శా, సీ, తే, గీ, ఆ" యీ గుర్తులు తీసివేసిన భేషుగ్గా సంభాషణ జరుగును. పద్యమున్నట్లే గద్యమున్నది, గద్యమున్నట్లే పద్యమున్నది. మొత్తము మీద పద్యములన్నియు గద్యములుగా జదివినను వినువారికి భిన్నగా తోచదు — చూచువారికి తప్ప.

ఈ విధముగా తిక్కన కవిత చవి జూచువారికి, తటాలున వేమన కవిత చెవి దూరును వేమనకు తిక్కనకు తెనుగు నుడికారమున నూటికి నూరు పాళ్ల సామ్యము కుదిరినది. మరొక్క రీతిలో పూర్తిగా వక్రించుకొన్నది. వేమన పదముల తోడనే వ్యుదు

స్వరము పుటుక వచ్చును. ఆ స్వరకల్యా సౌజన్యము చేసిన పదములనుండి విడదీయరానిదిగా నుండును. తిక్కన కవితకది రాదు. పదము లన్నియు ప్రాణములు వచ్చి మనతో మాట్లాడు చుండును. ఉద్యోగ పర్వము చదువునప్పుడు తిక్కన తలపే మనకు రాదు. మనము అందలి పాత్రలలో ఒక్కరమై స్వయముగా హావభావములతో మాట్లాడు చుండున టని పించును. ఈ మాటల తీరులో నే మేము తెలుగువారం. మా మర్యాద ఇది అని అచ్చు గ్రుద్దినట్లు స్పష్టపడును. తెనుగుదనము ఆద్యంతమూ మూర్తీభవించిన ఉద్యోగ పర్వమున ఉదాహృతికని ఒకటి రెండు ఉటంకించిన సరిపోదు.

ఆది, సభా, అరణ్య, విరాట పర్వముల కథా వస్తువు జరిగిపోయినది. ఉద్యోగ పర్వమునకు కాల దోషము పట్టదు. జరిగినది, జరుగుచున్నది, జరుగబోవు నదికూడా ఇదే. మానవజాతి ఉన్నంతవరకూ, మాట లున్నంత వరకూ, ఉద్యోగ పర్వమున వచ్చిన తీరు తెన్నులు మారరానివి. లోకోత్తరమయిన లౌకిక ప్రవ ర్తన యిందు యిమిడియున్నది. మానవులకెన్ని గుణ దోషము లుండవలయునో, అన్నీ, అన్ని విధములుగా పాత్రోచితముగా ఇందు చిత్రింపబడినవి. కవిత్వపు వన్నెచిన్నెలకన్నా, జీవితపు జిగిబిగి అధికము. జీవిత మున అలిగి నలిగి మొట్టికాయలు తిన్న వారికి యిందలి మాటల మర్మములు సులభ గ్రాహ్యములు. మాటవరుస కయినను కొన్నింటిని పాఠకుల కందించి, తిక్కన ఋణము తీర్చుకొందును గాక !

మఱపునకు రాని ఒక మంచిఘట్టము మెదడుకు వచ్చుచున్నది. దుర్యోధనునికి భీష్మద్రోణ విదురాది పెద్ద లెన్నెన్నో బుద్ధులు చెప్పిరి. అతని పెడబుద్ధి లెవరూ మాన్పజాలక పోయిరి. తుదకు పుత్రవినాశన మునకు ఓర్వని తండ్రి యెంతయో చెప్పిచూచెను. విన లేదు. వినునట్లునూ లేదు. అందరి ఆశలూ నిరాశలైనవి. ఉన్నదిక తల్లియొక్క తియే! ఆమెయైనను కొడుకునకు చెప్పి మందలించు నేమోనను ఆశ ధృతరాష్ట్రునకు. ఆమెను రప్పించును. ఆమె రాకపోకలు చిటికలో జరిగిపోయినవి. ఈ త్రుటికాలములో నిలిచిపోయినది ఒక సమగ్రరూప చిత్రణ మన కబ్బుట.

ఉదా :—

...నీ తనూభవుడు దుర్వినయంబున జనియె
నిటె వెంగలి గలదే
(384 ప. ఉద్యో. 3 అ.)
నీవైన జెప్పి శాంతుం గావింపగ నోపుదని
గౌరవకుల మా
గోవిందు శాసనము సంభావింపం గాంచి చెనక
(బతుకుం జుమీ) (385 ప)

పెనిమిటి మాటలివి. గాంధారి బదులిడును.

ఉదా:—

అనఘ నీ పుత్రు డవినీతుడగుట యెఱిగి
యెఱిగి వాని వశంబున నేలపోయె
దీవు పాండవులకు నేమి యిచ్చి లేని
వడ్డపడ నెవ్వరికివచ్చు నధిప చెపుమా.
386 ప. 3 అ. ఉద్యో)

ఈ పద్యమునుండి మనకొకానొక నిగూఢ సత్యము వెలువడును. ఇరువుర గుణశీలములు పరా కాష్ఠ నందుకొన్న విచ్చోట. గాంధారీ ధృతరాష్ట్రుల మనోభావముల ప్రతిబింబింపజేయు దర్పణమిది. ధృత రాష్ట్రుకు ఇట్టివాడేనని ధృవపడుటకు యిదియొక దృష్టాంతము. ధృతరాష్ట్రుడాడు కపటనాటకమున మసక మసక ముసుగు తెర తీసి వేసినదీ పద్యము. ధృత రాష్ట్రునదేమి తప్పు. దుర్యోధనునిదేనని నిందించు వారికి గాంధారీ అంతరంగమునుండి వచ్చిన యీ మాటలే సాక్ష్యములు. ఇంటిగుట్టు యిల్లాలికి తెలియక మరి యెవ్వరికి తెలియును ? తెలిసినది కనుక నే ఒక్క మాటలో చెప్పి తప్పుకొన్నది. తప్పు నా దన లేదని లోకమునకంతకు చెప్పుకొన్నను అర్ధాంగికి చెప్పలేకపోయెను ధృతరాష్ట్రుడు. "నీ తనూభవుడు దుర్వినయంబున జనియె నిటె వెంగలిగలదే" అన్న భర్తకు "నీ పుత్రుడవినీతుడగుట యెఱిగి యెఱిగి వాని వశంబున నేలపోయెదీవు" అన్నది గాంధారి. కుక్క కాటుకు చెప్పదెబ్బ. రెండవదిగా "పాండవులకు నేమి యిచ్చి లేని వడ్డపడ నెవ్వరికి వచ్చునధిప చెప్పుమా!" యీ మాట ధృతరాష్ట్రుని ప్రవర్తన కంతటికీ ముక్కు తాడులాంటిది. ఈ ఒక్క మాటతో ధృతరాష్ట్రుడు మనకు కటువడును, గాంధారికిగల గొప్పతనము మనకు తెలిసివచ్చును. ఆమె నూర్వుర బిడ్డలగన్న నిండు ముత్త యిదువు; ఉత్తమ కుటుంబిని, బుద్ధిమంతురాలు. కొడు కుల దుశ్చేష్టలు పెనిమిటి లోభ బుద్ధి మొదటినుండి ఆమెకు బాగా తెలియును. పాండవులయెడ నూర్వుర గన్న కడుపు కారుణ్య మొలికించినది. కొడుకులధిక లగుటకు కూడబెట్టుకొనలేనను లోభితనము ధృత రాష్ట్రునిది. ఈ ఇరువురి గుణదోషముల త్రివ్వి వెలి కెక్కించునదీ కవిత్వము—గాంధారీ గభీరహృదయము తోటి సమగ్రరూప చిత్రణకొక ఉదాహరణ. ఔచి త్యమునకొక తార్కాణము!

జరిగినది జరుగుచున్నది జరుగబోవునది, యీ మూడు ముప్పిరులు గొన్న సన్నివేశము పరికింపుడు.

ఇది చుట్టరికమున కొక చక్కని నిరూపణ. వాసు దేవుడు పాండవ కార్యార్థియై హస్తినాపురము నకు వచ్చెను. విదురునింట ఆతిథ్యము స్వీకరించిన రాత్రి యది. మాటామంతీ జరుగును. విదురుడు "ఇదియొక కార్యంబుగాగ బూని యిందు రాదగునే" అని వాసు దేవుని వారించును. ఎంతో అర్థము. ఇదియొక కార్యంబుగాగ బూని యనుటలో దేశంబున వ్యవ హారము కలదు. తెనుగు తీరే యిది. పెద్దవారేదేని కార్యార్థులై చిన్నవారియొద్ద వచ్చినపుడు 'యిది యొక కార్యముగా మీరు మా వద్దకు రావలెనా?' అనుట సహజము. మరొక్కప్పుడు పెద్దవారుగానుండి అల్పవిషయమున జోక్యము చేసికొన్నప్పుడు 'యిది యొక కార్యముగా బెట్టుకొని మీరిచ్చటకు రావచ్చునా?' అందురు. రెండవది సామాన్యముగా పోలీసులయొద్ద వినవచ్చును. మనకు కావలసిన వారెవ రైన నేరముచేసి పట్టుబడిన పలుకుబడి ఆసామిగా నుండి మన మెవ్వరైన వానిని తప్పింపబోయిన వారిచ్చు మాట యిదే. 'ఇదియొక కార్యంగా బూని యిందు రాదగునే?' "అనగా వచ్చిన పని కాదు అని చెప్పక చెప్పుడు విశేషమిది. ఈ వాక్యము తెనుగు వాకిటను మలచుకొన్నది.

తిక్కనకు వెన్నతో బెట్టిన లౌకికపు లగువు బిగువులు. ఈ క్రింది పద్యము దీనికొక ఎత్తు.

ఉదా:—చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డిష్ట పడివారితోడ పోట్లాడిరేని
దాని యుడుపంగ జేరకొన్నవాని గ్రూర
కర్ముడని చెప్పుదురు కర్మకాండ విదులు.
(ప. 243. ఆ 3. ఉద్యో)

దుర్జయపరులైన ధార్తరాష్ట్రుల కడకు సంధి కార్యముగా వాసుదేవుడేగుట విదురుడు వారించును. దానికి కృష్ణుడిచ్చిన సమాధానమిది. చదువరు లెందరో యీ పద్యము వంతిగా పట్టించుకొనక వదలియుందురు. జీవితమున నలిగి మెలిగినవారు గాని యీ పద్యమును హృదయమున శ్రద్ధపరచుకోలేరు. బ్రతుకునకు చావు నకు చుట్టరికము కావలయును. ఇది మన సంప్ర దాయము. చుట్టములకు విరుద్ధముగా ఏదేని ఒక కార్యము చేసిన చుట్టరికము తెగిపోవుననుట పరిపాటి. కార్యాకార్యములకు చుట్టముల రాకపోకలు ముఖ్యము. వ్యక్తిగతముగ స్నేహితుని మాట ఉచితమైనను కుటుంబ వీథికి చుట్టరికపు మాట కెక్కుడు విలువ. ముఖ్యముగా దాయాదుల తగవులాటలందు చుట్టరికపు ప్రాపు కావలయును. నేటి చుట్టరికము పైపై పూతలుగా నుండుటచేతనే కలహములు కోర్టుల కెక్కుచున్నవి. చుట్టముగానుండి చుట్టములకు వచ్చిన తగాదాను పరిష్కరింపక 'నాకేమి' యనువాడు క్రూరకర్ముడని కృష్ణుడను చున్నాడు. నిజమునకు ఋ. చ. తప్పని సత్యమిది. నేటి మన సమాజమునగల అసంతృప్తికీ, అలజడికీ చుట్టరికపు ఉదాసీనతే కారణమని నా గట్టి నమ్మ కముకూడా.

ముద్దులు మూటగట్టగల యీ పలుకుల నాల కింపుడు. లౌకికమున కింత దాపురముగా నున్నవో! వినువారు కృష్ణుడెంతటి నేర్పరిరా అని ముక్కున వేలిడవలసినదే! కృష్ణుడు యే నిమిత్తమై రాయ బారిగా రాదలచెనో అందు మొదటిభాగ్యత చుట్ట రికము. అందున తాను మేటి. కౌరవులతోడ సంధిపొసగదని తనకు తెలిసినను, అది లోకమునకు తెలియవలదా? ఆ లౌకికము తిక్కనకు తెలుసు. అందుకే కృష్ణునిచే చెప్పించును. ఈ వచనము భారతమున కెక్కడలేని ఔచిత్యము కలిగించునదిగా నున్నది చూడుడు. వ్యాసని స్తరగతిచే ఆ వచనమంతయు యిట వేదలవ లేదు. ఒకటి. రెండు వాక్యములు చాలును.

ఉదా:—"వందనలేక చెప్పుడు నన్ను పాండ పులవాడని కొంకించి అతండు నా మాట వినండెయ్యె నేనియు మేలకాక? ఇట్లు సాచ్చి చెప్పకున్న నన్న దమ్ములు దమలోన బోర గృష్ణుండు వారింపక నుపేక్షించె; దనచేత జక్కంబడదాకుని యజ్ఞులైన జనులాడుదురు. ఆ నింద నాయందు పెట్టుకొన నేల? చెప్పుమా చెద"నని కృష్ణు డుపక్రమించును. పై నుడ హరించిన తీరు లోకవ్యవహారమున యారితేరిన తిక్కనకే చెల్లును. ఇటువంటి నయముతోటి మాట లనేకము లుండుటచేతనే భారతమున కెక్కడలేని ఆదరణమున నారోపించుచున్నారు.

తెనుగు జాతియుతికెత్తిన యెత్తుగడ, ఔచిత్యము పుటికి పుచ్చుకొన్న తీరు గమనింపవలసిన పద్యములలో నిదియొకటి. మాట్లాడదలచినవారు యీ రీతిన మాటాడ వలె నేమో! కృష్ణునిదగ్గర చుట్టరికము, ధృతరాష్ట్రుని పెనతనము, వంశముయొక్క ముందువెనుకలు పెనవేసి కొని ముద్దుటించుటలో గల నైపుణ్యమిది.

ఉదా:—ఈ వంశంబున కెల్ల నీవ కుదురింద
వార్ధి చందంబు నై
తై వర్ధిల్లిన గీడు మేలు దుదినీయం
దొందెడుం గావున
ద్భావంబారసి లోని పొత్తువలి వృత్తింబుణ్య
జన స్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్య
వంశాగ్రణీ!
(260. ప. ఆ. 3 ఉద్యో)

ఈలాంటి పద్యము లుండుట చేతనే భారత మనువాదమున కీలుకొనంత స్వతంత్ర గ్రంథమై కూర్చున్నది.

ఇంకొకటి : ఉదా :—

కౌరవ పాండవుల్ తెరపుగాకొని శాంతత
బొందకయున్కి మే
లారయ వారు నీవు కులమంతకు నీ నృప కోటి
కుర్వికిన్
బోరితమైన నింతకును బుట్టు మహాపద
గావునన్ ధరి
త్రీ రమణాగ్రగణ్య గణుతించి అవశ్యము
బొందొనర్పవే.
(262. ఆ. 3 ఉద్యో.)

ఈ పద్యములోని 'యింతకు'ను బుట్టు అనునొక చిన్న పదప్రయోగమున్నది. దానికెక్కడ లేని సౌందర్య మబ్బినది. వారు నీవు కులమంతకు యీ నృపకోటికిన్ యీ వాక్యము గూడా అట్టిదే. 'ఇంతకు' అను దానికి ఒక క్రొత్త ధ్వని గలదు. ఇంతకు=ఈ చిన్న దానికి, ఈ పై చెప్పిన వాటిన్నింటికీ, ఈ పరికి అను మూడర్థము లుపయోగింపవచ్చును. పై మూడింటికి అన్వయము కుదిర్చెదను గాక!

ఉర్వికిన్ బోరితమైన=నేలకు గాను తగవులైన
ఇంతకున్=ఈ చిన్న విషయమునకు

నేలకుగాను తగవులాడెడు చిన్న విషయమున దీనికన్న పెద్ద విషయమున చెడుపు సంభవించును అని ద్యోతకము. ఆ పెద్ద విషయ మేది?

భరత కులంబు ధర్మమును బాడియు సత్యము
బొత్తు బెంపునుం
గరువము గల్గియుండు ననగా నెగిడున్నది
యందు ధర్మజో
త్తరులరు నీవు నీ యనుజు దమ్ములు నీ తనయుల్
యశోధురం
ధరబుధి శీలు రీ సుచరిత్రక్రమ మిప్పుడు దప్ప
నేటికిన్.
(259 ప. 3 ఆ. ఉద్యో.)

ఏనాటి నుండో పరంపరాగతంగా వచ్చు భరతవంశపు పరువు ప్రతిష్ఠలు మంటగలసిపోవును కనుక నేలకోసరమని యీ చిన్న విషయమునకుగాను పోరు తగదని ధ్వని. పైపద్యములో అన్వయము లేకుండ చెప్పుకొన్ననూ, చెప్పుకోవచ్చును. అప్పుడిట్లుండును. "వారు నీవు కులమంతకు నీ నృపకోటికిన్" మహాపద వచ్చునని అర్థము. ఈ రెండర్థములు కాదనిన 'యింతకును' యీ పరికి లేక వెనువెంటనే మహాపద వచ్చునని కూడ ననవచ్చును. (యుద్ధమునకు పాండవులు కూడా సిద్ధహస్తులై యున్నారని భావన.)

ఇంకొకటి చూడుడు :—

ఉదా :—

కౌరవ పాండవులందివ్వారలకిల జావు నొవ్వ
వచ్చిన మేలు
శ్రీరమణ చిత్తమున నెట్లారయుమా నీకు దుఃఖ
ము నెక్కైనక్.

తెనుగు గుండె పిండి వసబోయుచున్నదిది. దాయాదుల పోరము అంత గుల్లనైనదికాకపోగా దాని ఫలాఫలములు బాహ్యమున కెట్లున్నను అంతరంగికముగా సవ్యరక్తపాశములతో మిళితమైయుండును. అదే కృష్ణుడు ధృతరాష్ట్రునకు సుడువునది. 'కౌరవ పాండవులం దివ్వారలకు జావు నొవ్వ వచ్చిన మేలె,—నీకు దుఃఖము నెక్కైనన్. దీనిని కొంచెము ముందున కాలోచించితిమేని నేటికినీ లోకవ్యవహారమున వాడుకొన్న మాటల అర్థములోని సంప్రదాయము వ్యక్తపడును. పైపద్యమున కాధారములైన లోకోక్తుల గమనించునది. "తల వున్నంత వరకూ పడికము పోదు; వాడు చస్తే నీవు మునగాలి, నీవు చస్తే వాడు మునగాలి; అందులూ ఒక్క రేవులో మునగవలసినవారు." ఇత్యాది వాడుకలనుండి ఏ అర్థము వెలువడునో అది నీకు దుఃఖము నెక్కైనక్ అను దానిలో లీనమయిపోవును. ఇట్లెన్నెని జూపవచ్చును. వ్యాపవిస్తరణభీతిచే అచ్చటచ్చట కొన్నింటిని మాత్రమే యివ్వగలిగితిని. ఉద్యోగపర్వము పండితులకే కాక విద్యార్థులకు తెనుగు జ్ఞానమే మాత్రమున్న వారికైన చదువదగియున్నదని ప్రోత్సహించుటకే రచన కొప్పడగలదని నా ఆశ.

# గ్రంథవిమర్శనము

## నెహ్రూ కావ్యము

[తొలి పాలు]

రచన: శ్రీ వేదము వెంకటకృష్ణశర్మ, ప్రాప్తిస్థానము: ఉదయరంజనీ పబ్లిషర్సు మాళ— మద్రాసు—7. వెల రు 2-75.

నెహ్రూ స్వీయచరిత్రను, ముదిగంటివారు ఆ గ్రంథమునకు చేసిన ఆంధ్రానువాదమును ఆధారము చేసుకొని ఈ గ్రంథమును ఘటించానని రచయిత స్వయంగా తెలుపుతున్నారు. ఇందుచేతనూ, గ్రంథనామములోనే 'కావ్యము' అను పదమును సంఘటీకరించుటచేతనూ, చరిత్ర రచన రచయిత ఉద్దేశ్యము కాదనీ, కావ్యఘటనయే రచయిత ఆదర్శమనీ మనం అనుకోవలసివస్తున్నది. అందుచేత కావ్యముగానే దీనిని పరిశీలన చేయవలసి వస్తున్నది.

స్వీయచరిత్ర రచన సఫలమైతే, సాహిత్యాంగమే కావచ్చు కాని అది కావ్యము మాత్రము కాదు. ఇది ఇచ్చట గమనింపదగిన ప్రధాన విషయము. స్వీయ చరిత్రయందు రచయితకుగల ప్రతిభా విశేషమునుబట్టి అందందు కావ్యశోభల తళతళలు కానరావచ్చు అది వేరు విషయము. ఈ స్వీయచరిత్రలోని విషయము వస్తువుగా సేకరించి కావ్యనిర్మాణము చేయదలచి నప్పుడు, తప్పనిసరిగా ఆ విషయమును కావ్యవస్తు స్వరూపములోనికి మలచి తీరవలసివుంది. ఇందుకు చరిత్రాంశములను తారుమారు చేయవలసిన పనికూడ లేదు. చారిత్రిక విషయాలు కావ్యవస్తువులుగా పనికిరాక పోవట మంటూ లేదు. ఇటీవల చారిత్రిక విషయములను కావ్యములుగామలచి కీర్తి నార్జించుకున్నవారు కూడ కొందరున్నారు. శ్రీ వెంకటకృష్ణశర్మగారు ఈ విషయము కొంత ఆలోచింపవలసినది. వైద్య శాస్త్రమును మన ప్రాచీనులు పద్యములలో చెప్పినట్లే వీరీ చరిత్రను పద్యములలో చెప్పినారు. బసవరాజీయమునకు కావ్య గౌరవము దక్కనట్లే దీనికీని కావ్యగౌరవము దక్కుట దుర్లభము. రచనయందు కావ్యగుణము బహు స్వల్పము.

అన్యదేశ్యముల వాడుకనుగూర్చి శ్రీ వేంకటకృష్ణశర్మగారు "విన్నపము"న కొంత ముచ్చటించినారు. అన్యదేశ్యములు పరిహార్యములు కాకపోయినను, వానికి ఔచితి యుండవలయును. అనివార్యస్థితియందు సేకరింపదగినవి కాని, విచ్చలవిడిగా అందినపదమునెల్ల చొప్పించుట శోచనీయము.

'ఇండియా', 'కోర్టు', 'స్టేటుమెంటు', 'జడ్జిమెంటు', 'కేసు', 'లేబరు', 'అసెంబ్లి', 'ట్రేడ్ యూనియన్', 'జైలు', 'ఫ్యాసిలిస్టు', 'రివిజను' ఇలా అనేకం—ఈపదాలు అనివార్యములా? అందునూ ఆంధ్రకావ్యమున వీనియౌచితి యెట్టిది?

ప్రసిద్ధపండితులూ, విమర్శకులూ శ్రీ వేంకటకృష్ణశర్మగారీకావ్యము నిట్లేల సంఘటించిరో తెలియకున్నది. కావ్యస్వరూపమేమో అవగతముగాక, యేవో పద్యబంధములను తయారుచేసి వానిని కావ్యములుగా ప్రకటించుచున్న యువకులకు ఇది ప్రోత్సాహకరముగానుండి అపసంప్రదాయమునకు దోహదము చేయునే గాని, ఈ గ్రంథమునకు మరియొక ప్రయోజన మేమియూ లేదు. ఇది కావ్యము కాదు.

పాఠకుల పరిశీలనకుగా కొన్ని పద్యము లిట నుదాహృతములు :

కడు సమీపించె లాహోరు 'కాంగ్రెసు' సంత
దాని యున్నతి వరికట్టదలచి 'బ్రిటిషు'
ఏలుబడి 'ఇర్విను' ప్రభువు మూలకముగ
చాటె 'రౌండుటేబులు' సభ జరుగునంచు.

నాయకులనెల్ల దమవల వేయజూచు
దొరతనమువారి ప్రకటన మరసి మురిసి
తనిసి వేవేగ తమకొంప మునిగినట్లు
నాయకుల సభ 'ఢిల్లి'లో నడపజెంచి
కొంద రంకులకును బూనుకొనగ నందు
'తేజబహాదురు సప్రు', 'గాంధిజి' జవహరు
తండ్రియును, విఠల్భాయి ప్రధానులగుచు
బాల్గొనిరి; కాని సభ జయప్రదము గాదు.
కాంగ్రెసు విధించు నియమముల్ కఠినతమము
లనిరి మితవాదవర్గ మట్టియ్యె నవియ
కడు కనీసపు కోర్కులు 'కాంగ్రెసు'నకు
బహుగరిష్ఠము లవి మితవాదతతికి.

'ఢిల్లి' నాయక సభయందు దెలపైన
తీరు దేశీయ సభ సమ్మతింపలేదు
కాని యపుడు సమష్టి ప్రకటనలందు
చేర్చి సంతకాలిడుట తప్పినది కాదు.

## కావ్య గంగ

ఖండకావ్యసంపుటి : రచన, శ్రీ చెన్నూరి శ్రీనివాసమూర్తి : ప్రచురణ కిశోరకవితా సమితి, ముదిగల్లు కళ్యాణదుర్గం తాలూకా; వెల రు 0-50.

ఇందు 'తెలుగు పొలము', 'మహాత్యాగి' 'అప్రశుతి' అనే మూడుకృతులున్నాయి. 'తెలుగుపొలము' అన్నకృతి, కవి తన జన్మస్థానమైన తెలుగు భూభాగము నందు అభిమానమును వ్యక్తముచేయు అభివర్ణనాత్మకమైన రచన. తన ప్రజల సుగుణ సంపదలను ఎంతో ఆత్మాభినివేశముతో కవి గానముచేయును.

తెలుగున్ కర్షకు లేలెడు
పొలములకు సమీపమునందె పొమ్ము, ప్రశాంత
స్థలముల నిర్మలకుల్యా
జలకణముల చలువ హృదయశాంతి ఘటింపన్.

వర్షాకాలంబునచో
హర్షంబున జూడు పుణ్య మబ్బున్ నీకున్
కర్షకజీవనములు — వి
వర్షిత ప్రాయములు, వినుత కవికోశంబుల్
వరిమళ్లనిగమపట్టుల
పరుసలు పరుసలు బలాకవర్గముగని సుం
దరస్వర్గ భ్రాంతిన్ గని
పరవశతను గాంతు — నీవపలుకగ నేలా !

మహాత్యాగియను కావ్యము బుద్ధదేవుని జీవిత సంస్మరణ. ఇందు కావ్యరచనయందు కవి యందుకొన్న స్థాయిని, ఈ ఉదాహృతితో పాఠకులు అవగతము చేసుకొనగలరు. లుంబినీవన ఘట్టము:

'దర్శనీయము లుంబినీ ధన్యభూమి
శాక్యముని చంద్రునకు నాడు జన్మభూమి—
వివిధ పారస్యతా నేక విధ రస ప్ర
మత్త కవితల్లజ మరందమధుర లేఖి
నీ గళత్కావ్య నిర్నిద్ర గతులు
పూచెనో దివ్య సౌందర్య ముగ్ధరీతి
నాడు నేడును — నెంతి పుణ్యస్థలంబు.
అమల తరువాటికా మనోహరము, శ్రావ్య
తర శకుంత రుతామోద కరము, అంబ
ప్రసవబాధ సహించిన వన్యతలము
లుంబినీ భూమి మధుర మార్గములయందు
నీదు తొలియేమ్ములో భావ నిబిడమైన
యేమి సందేశ మున్నదోయీ! తపస్వి!
గౌతమా! నీవుపుట్టిన కావనంపు
శోభలో నాడు హృదయంబు సొక్కిపోయె'.

'అప్రశుతి' యను కృతిలో పసివిసుంగుగా చేయి జారిపోయిన కూరిమిపుత్రికై కవి పరితపించినారు. అనేకమందికి శిశువియోగము కలుగును. ఆర్ద్రహృదయుడైన కవికి కలిగిన విషాదముగనుక ఇది కావ్యరూపము నందినది.

ఈ రచనలతో శ్రీ శ్రీనివాస మూర్తిగారు నవాంధ్ర కవితాలోకమున తమ స్థానమును సుస్థిరము చేసుకొన్నారనవచ్చు.

* * *

## మన రాజ్యాంగం

రచన : శ్రీ దాసు త్రివిక్రమరావు; ప్రచురణ శ్రీ దాసు నరసింహారావు, మానేజర్ సాధనా ప్రకాశన, హైదరాబాదు. వెల తెలియదు.

భారత రాజ్యాంగమునుగురించి తెనుగులో విపులమైన గ్రంథమేదీ ఇంతవరకు రాలేదు. రాజ్యాంగమును గురించి ప్రజాబాహుళ్యమునకుగల విజ్ఞానం బహుపరిమితం. అట్టి గ్రంథములు లభించక పోవటమే యిందుకు కారణం. శ్రీ త్రివిక్రమరావుగారు ఈ గ్రంథంలో, రాజ్యాంగ స్వరూపమూ, రాష్ట్రపునర్వ్యవస్థీకరణ, శాసనసభా నిర్మాణము, శాసనవిధానములు, కేంద్రమునకూ రాష్ట్రమునకూగల పరస్పర సంబంధములు, న్యాయాధికారవర్గము ఈ మొదలైన విషయములన్నీ వివరించుతూ సరళమైన శైలిలో ఈ గ్రంథాన్ని రచించారు. 'వర్గీకృత తరగతులు' ఇత్యాది శబ్దాలు, అక్కడక్కడ, ద్వితీయ ముద్రణలో సవరణ పొందవలసినవి వున్నాయి. రాజకీయ జిజ్ఞాసువులకే కాక ఈ గ్రంథం సాంఘికశాస్త్రం అభ్యసించుచున్న విద్యార్థులకు మిగుల ఉపయోగకరంగా వుంది.

# స్వీకారము

సరస్వతీ సంహారము : నవల; కన్నడ మూలం శ్రీ బీ. చి; ఆంధ్ర అనువాదం : శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు. ప్రచురణ : ఆదర్శ సాహిత్యమాల, (17-5-850 Outside Dabhipura) హైదరాబాదు. 2. వెల రు 2/-

కర్పూర వసంతరాయలు : గేయ కావ్యము; రచన : శ్రీ సి. నారాయణరెడ్డి; ప్రాప్తిస్థానం : కాకతీయ ప్రింటర్స్ అండ్ పబ్లిషర్స్, మొజంజాహీ మార్కెట్, హైదరాబాదు. వెల రు 2-50.

విజ్ఞానగోష్ఠి : (పలువురు ప్రముఖ విద్యాధికుల యుపన్యాసముల సంపుటి) సంపాదకులు : శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రి; శ్రీ లక్ష్మీనారాయణ గ్రంథమాల, ఇన్నీసుపేట, రాజమండ్రి; వెల : రు 1-50.

వరచనాఫలము : ప్రహసనము : రచన : చిలుకూరి రామభద్రశాస్త్రి; వీరేశలింగం హైస్కూలు రాజమండ్రి; వెల రు 1/-

గాంధీ సుభాషితములు : (ప్రథమ ఖండము. పద్యరచన; రచయిత : శ్రీ దేవులపల్లి సీతారామశాస్త్రి; ప్రాప్తిస్థానము : పరమేశ్వరీ పబ్లికేషన్సు; 60, సుందరమూర్తి వినాయక కోవెల వీధి, ట్రిప్లికేన్; మద్రాసు-5. వెల రు 0.75.

శ్రీరమణలీల : తృతీయ ముద్రణము; రచన కృష్ణ భిక్షు (శ్రీ ఓరుగంటి వేంకటకృష్ణయ్య) ప్రచురణ : రమణాశ్రమం, తిరువణ్ణామలై. వెల రు 3-50.

అపశూద్రాధికరణము — శ్రీ శంకర భగవత్పాదులు; విమర్శ గ్రంథము. రచన: శ్రీ పండిత గోపదేవ్. ప్రచురణ : ఆర్య సమాజము, కూచిపూడి. తెనాలి తాలూకా; వెల రు 0 8-0.

ఆశ : నాటిక; రచన; కుందుర్తి; కాగడా ప్రచురణలు, కర్నూలు: వెల రు 0-75

మా అమ్మ (రాజేశ్వరీ శతకము) రచన : శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావు, ప్రాప్తిస్థానం వెంకట్రామా అండ్ కో, విజయవాడ, వెల రు 0-62.

గండపెండేరము : 4 నాటికలు; రచయితలు : శ్రీయుతులు: కేశవపంతుల నరసింహశాస్త్రి, కె. ఎల్. నరసింహారావు, ఉరుపుటూరి రాఘవాచార్యులు, ఎక్కిరాల కృష్ణమాచార్యులు. ప్రచురణ : ఆదర్శ సాహిత్యమాల, హైదరాబాదు, వెల రు 1/-

బోధన పద్ధతులు (తెలుగు) : ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ఏర్పాటు చేసిన మూడు ప్రత్యేకోపన్యాసములు. ఉపన్యాసకులు : శ్రీ బిరుదు వేంకటశేషయ్య, శ్రీ పత్తిరాజు కృష్ణారావు, శ్రీ పి. వి. రాఘవాచార్యులు; ప్రచురణ : హైదరాబాదు రాష్ట్రీ ఉపాధ్యాయ సంఘము. 17-5-350 డబీర్ పుర; హైదరాబాదు-2; వెల రు 2/-

రెండవ భాషగా తెలుగు బోధన : రెండు ఉపన్యాసములు, శ్రీ పత్తిరాజు కృష్ణరావు, శ్రీ బి. వి. శేషయ్య : ప్రచురణ : హైదరాబాదు రాష్ట్రీ ఉపాధ్యాయసంఘము, హైదరాబాదు వెల రు. 0-75.

చదువు-వ్రాత : రచన : శ్రీ యస్. కృష్ణరావు ప్రచురణ హైదరాబాదు రాష్ట్రీ ఉపాధ్యాయ సంఘము; హైదరాబాదు; వెల రు 0.85.

యజుర్వేద భాష్యము : (ప్రథమాధ్యాయము) మూలమంత్రములు, వానికి మహర్షి దయానందసరస్వతి సంస్కృతి భాష్యము, ఈ భాష్యమునకు శ్రీ అన్నే కేశవార్యశాస్త్రి ఆంధ్రానువాదము. ప్రచురణ: శ్రీ అన్నే మాధవరావు. ఆర్య గ్రంథాలయము. ముదునూరు (పోస్టు) కృష్ణాజిల్లా వెల రు 2/-



**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**